# చతుర

జూలై 1978

సంపుటి : 1 సంచిక : 6


## ఈ నెల సమగ్ర నవల

అశోక విద్యాపీఠం. దాని యజమాని ఓ రావణాసురుడు. అతని లెక్క ప్రకారం ఆ కాన్వెంట్ ఓ కామధేనువు. బడికి వచ్చే పిల్లలు పాడియావులు. పంతులమ్మలు నోరులేని గోమాతలు. క్రొత్తగా చేరిన ఎమ్మే పాసైన పంతులు కుర్రాడు, వారికన్నా అర్భకుడు. వారందరి మధ్య అతనొక్కడు. వారు తారలు కారు-ఇతను చంద్రుడు కాడు. వారిలో పెళ్ళయిన వారున్నారు. పెళ్ళి కాని వారున్నారు. భర్తచేత వెళ్ళగొట్టబడ్డ వారున్నారు, భర్తనే కోల్పోయిన వారున్నారు. అనుమానంగా చూసిన వారినందర్నీ అతను చేర్చిందెక్కడికి ? తాను చేరుకున్న దెక్కడికి ?

# గమ్యం

తన తొలి నవలతోనే సమర్థుడుగా ప్రసంశలంది లబ్ధప్రతిష్ఠుడైన రచయిత

## చివుకుల పురుషోత్తం

తాజా నవల ఈ నెల చతుర సమగ్ర నవల 'గమ్యం'

## [illegible] ముఖ పత్రం

[illegible] ఇండియన్ జాతీయులు ఉత్సవ సందర్భాలలో తగిలించుకునే ముఖాచ్ఛాదనం. ఆదిమ జాతులు చేసే ప్రతిపనికీ, వారి ప్రతి ఆచారానికీ, ఏదో ఒక అర్థం, అవసరం ఉంటుంది. ఇలాంటి ముఖాచ్ఛాదనం తగిలించుకున్న తమను చూసి చెడు దూరంగా పారిపోతుందని వారి నమ్మకం.

## రెండవ కవరు :

మహారాష్ట్ర ప్రాంతంలో పండుగ సందర్భాలలో ఊరేగింపులకు ఉపయోగించే రథం. ఈనాడు అరుదైపోయిన ఒకనాటి భారతీయ దారుశిల్పాల పని తనానికి పరాకాష్ఠ.

## మూడవ కవరు :

జర్మనీలోని బెర్లిన్ మ్యూజియంలో పదిల పరచిన ఆఫ్రికన్ శిల్ప ప్రతికృతులు. ఈ నాటి అత్యంతాధునిక చిత్ర శిల్ప కళలకు ఉత్తేజాన్నిచ్చినవి ఇవే కావటం ఆశ్చర్యకరమైన వాస్తవం.

## నాలుగవ కవరు :

క్రీశ. 1750 ప్రాంతాలలో యూరప్‌లో పింగాణీ పరిశ్రమ అపూర్వంగా వర్ధిల్లి వికసించింది. ఆ ప్రక్రియలో అనేకానేక ప్రయోగాలు జరిగాయి. ఆ దశలో తయారైన పింగాణీ బొమ్మ.


చతురః

ఈనాడు కాంపౌండ్
సోమాజిగూడ
హైదరాబాద్—500004

# మొసళ్ళ స్వర్గం

మద్రాసు-మహాబలిపురం దోవలో ఒక ఆశ్రమం వుంది. ఆ ఆశ్రమంలో వుండేది మహర్షులుకాదు. బైరాగులూ కాదు- అన్నీ మొసళ్ళే! 4 ఎకరాల విస్తీర్ణంలో ఏర్పాటు చేయబడ్డ ఈ ఆశ్రమాన్ని చూసేందుకు ప్రవేశరుసుం రెండు రూపాయిలు.

ఈ ఆశ్రమంలో చిన్నవీ పెద్దవీ నీటి కుంటలు అనేకం వున్నాయి. ఈ నీటి కుంటల్లో మొసళ్ళు నిరానుయంగా, ప్రశాంతంగా జీవనం కొనసాగిస్తున్నాయి. ఈ కుంటలకి తోడుగా మరీ చిన్నవి కూడా వున్నాయి. వాటిలో మొసలి బేబీలు పెరుగుతుంటాయి.

లోపలికి ప్రవేశించే ద్వారం దగ్గర



వున్న గదుల్లో మొసళ్ళ ఫొటోలు, జీవకళ ఉట్టిపడుతూ చూపరులకు నిజమైన మొసళ్ళనే భ్రాంతి కల్గించే మొసళ్ళబొమ్మలతో మ్యూజియం ఏర్పాటుచేయబడింది.

మొసళ్ళలో కెల్లా ఘరియాల్ జాతికి చెందినవి చాలా ప్రమాదకరమైనవి. అలాంటివి ఇక్కడ నాలుగ వున్నాయి. ఇలాంటి మొసళ్ళు గంగ బ్రహ్మపుత్ర నదుల్లో మాత్రమే వున్నాయి.

మద్రాసులో గిండీ ప్రాంతంలో పాముల పార్కు నిర్వహించే రాములాస్ విట్టేకర్ అనే ఆయనే, ఈ మొసళ్ళ ఆశ్రమాన్ని కూడా నిర్వహిస్తున్నాడు ఈ ఆశ్రమంలో 150 దాకా మొసళ్ళున్నాయి. స్థానికంగా వున్న కొందరు పల్లె ప్రజలు మొసళ్ళ ఆహారం కోసం రోజుకి ఇరవై కిలోల చేపల్ని తెచ్చియిస్తుంటారు. మొసళ్ళు చేపల్నేగాక, పందికొక్కుల్ని కూడా చాలా ఇష్టంగా భోంచేస్తాయి. ఈ మొసళ్ళ ఆహారానికే నెలకి రెండువేలు ఖర్చవుతున్నదిట ఆశ్రమానికి. ప్రతి నెలా దాదాపు 8000 మంది ఈ ఆశ్రమాన్ని చూసేందుకు వస్తుంటారు.

మొసలిచర్మం చాలా విలువయిందీ, ఖరీదయిందికూడా. ఒక అంగుళం చర్మం నలభై రూపాయిలుంటుంది. ఐరోపా దేశాల్లో, మొసలి చర్మంతో చేసిన సంచీలు 4,000 రూపాయల ఖరీదు చేస్తాయిట. మనదేశంలో మొసళ్ళని వేటాడటం చట్టరీత్యానేరం.కానీ చట్టాన్ని ఉల్లంఘించి ఎంతోమంది మొసళ్ళని పట్టి వ్యాపారం చేస్తున్నారు. ప్రస్తుతం ఈ మొసళ్ళ జాతి అంతరించిపోయే స్థితిలో వుంది అలనాడు గజేంద్రుణ్ణి రక్షించేందుకు 'మకరి'ని చక్రంతో ఖండించిన శ్రీమన్నారాయణుడే, ఇప్పటి మొసలి వేటగాళ్ళకి ఒరవడి పెట్టాడేమో!

# పుష్పక మాలిని

మాలిని మద్రాసులో బి య్యే స్సీ ఫైనలియర్ విద్యార్థిని. ఈ యువతి మద్రాసు ఫ్లైయింగ్ క్లబ్‌లో విమానం నడపడంలో శిక్షణపొందుతున్నది. తమిళ నాడు మొత్తంలో పైలట్ శిక్షణ పొందు తున్న ఏకైక వనితారత్నం మాలిని. తోటిబాయ్ ఫ్రెండ్స్‌తో కలిసి రోజూ ఓ గంట సేపు గగనసీమలో విమానం నడుపుతుందీ అమ్మాయి- ఇప్పటిదాకా 40 గంటలు నడిపింది. 60గంటలుపూర్తి కాగానే పైలట్ లైసెన్సువస్తుంది- అప్పుడు ఎంచక్కా- తనప్రైవేటు విమానంలో అలా గాలిలో తేలిపోవచ్చు ఆనందంగా, అని కలలు గంటున్నది



మాలిని.

ఈ 40 గంటల అనుభవంలో ఏవైనా ప్రత్యేక సంఘటనలున్నాయా అని అడిగినప్పుడు, మాలిని "పెద్దగా గుర్తుంచుకోదగ్గవిశేషాలేవీ లేవు గానీ విమానాన్ని నేలమీదికి దించడంమాత్రం ఓ పెద్ద థ్రిల్" అంటుంది. "ఒకసారి విమానం అనుకున్న సమయానికి నేల మీదికి దిగలేదు. అది రన్‌వేని దాటి ఓ కరెంటు స్తంభానికి గుద్దుకుంది. నేను మాత్రం చావు తప్పించుకున్నాను. విమానాన్ని ఎగిరించడంకంటే నేలపైకి దించడమే చాలా ముఖ్యం" అని మాలిని అభిప్రాయం. తనదగ్గర కొంతమంది స్నేహితుల జాబితావుంది. లైసెన్సు రాగానే వాళ్ళందరినీ ఓ సారి సరదాగా తనపుష్పక విమానంలో విహారం చేయిస్తుందట మాలిని.

# మంత్రుల జట్టీలు

బీహారు రాష్ట్రంలో ఇద్దరు మంత్రి శేఖరులు ఒక బంగళా కోసం హోరాహోరీ పోరుసల్పి అభినవకిరాతార్జునీయ ఘట్టాన్ని సృష్టించారు. పాట్నాలో స్ట్రాండ్‌రోడ్‌లో 12వ నెంబరు బంగళా ఖాళీ అయింది. ఆ బంగళాని ఆక్రమించుకునేందుకు ఇద్దరు రాష్ట్ర మంత్రులు తమతమ భృత్యులను పంపించారు. ఆ మహాత్ము లెవ్వరనిన- ఎక్సైజుమంత్రి విశ్వనాథశాస్త్రి, కార్మిక మంత్రి షంషేర్‌జంగ్ బహదూర్ గారలు. ఇరువురు మంత్రుల భృత్యులూ ఒకేసారి బంగళా వద్దకి చేరుకున్నారు. మాదంటే మాదన్నారు. ఒకళ్ళనొకళ్ళు తిట్టుకున్నారు. కొట్టు

కున్నారా? చివరికి ఒక మంత్రులుంగారి పక్షీయులు క్రింది అంతస్తును, మరొక మంత్రీశ్వరుని అనుచరులు పైఅంతస్తును ఆక్రమించు కున్నారు. ఇరుపక్షీయుల గొడవ మధ్యలో రక్షకభటులు వచ్చి, పక్షీయుల్ని బంగళాలోంచి వెడలనడిచి, ఆ ప్రాంతంలో 144 సెక్షన్ క్రింద నిషేధాజ్ఞలు జారీ చేశారు.



ఆ బంగళా మొదట్లో ఒక సీనియర్ ప్రభుత్వ అధికారి నివాసం. ఆయన ఢిల్లీకి బదిలీఅయి వెళ్ళడంతో బంగళా ఖాళీ అయింది. బీహార్ ముఖ్యమంత్రి ఆ బంగళాని విద్యామంత్రి దిగంబర్ ఠాకూర్‌కి కేటాయించ వలసిందిగా సిఫార్సు చేశారు. సదరు కేటాయింపు కాయితాలు, అంతిమ ఆదేశం కోసం పి. డబ్ల్యూ. డి. మంత్రి గారికి పంపబడ్డాయి. ఈ మధ్య కాలంలో 12వ నెంబరు బంగళా విద్యా మంత్రికి ఇస్తున్నారన్న వార్తలు బయటికి పొక్కినై. అధికారికంగా ప్రకటన రాక ముందే గృహప్రవేశం చేద్దామనుకుని, కిరాతార్జునులు నాకంటేనాకని జట్టీలు పట్టారు ఇంటికోసం.

ఇప్పటికీ బీహార్‌లో కొందరు మంత్రులకి అధికార నివాసాలు లేవు. వాళ్లకి కేటాయించిన ఇళ్లల్లో ఛాత్ర సంఘర్ష సమితి శాసనసభ్యులు బైఠాయించారు. అందుకని మినిస్టర్లు గెస్టుహౌసుల్లో తల దాచుకుంటూ కాలం వెళ్ళబుచ్చుతూ, అవకాశాన్ని బట్టి ఇలా ఇంటికోసం ఎగబడుతున్నారు.

## వికలాంగుడి విన్యాసాలు

అంగవైకల్యం ఒక శాపమనుకుంటాం మనం. కానీ, కొందరి పాలిట అది గొప్ప వరం! దాదాపు ఐదడుగుల పొడవైన మోహన్‌సింగ్ వయసు 37 ఏళ్ళు. బొమ్మల తలపాగా చుట్టి, తోలుకోటు కట్టి గారడీవాడిలా అనిపిస్తాడు చూపరులకు. కాళ్ళే ఇతని జీవనాధారం, గర్వకారణం కూడా. చేతులు రెండూ నిర్జీవంగా వ్రేలాడటమేగానీ, పనికిరావు. చేతుల్లేని లోటు ఇతని కేనాడూ లేదు. మనం చేత్తో చేసే పనులన్నీ కాళ్ళతోనే అవలీలగా చేయగలడు. సింగ్ తన కాళ్ళతోటే బొమ్మలు చిత్రిస్తాడు. గ్లాసులోకి నీళ్ళు వొంపుకుని తాగుతాడు, చెంచాతో చక్కగా అన్నం తింటాడు. పైగా కొన్ని సంగీతవాయిద్యాలని కూడా వాయించగలడు! గుడికి వెళ్లి కాళ్ళతోటే దేవుడికి భక్తితో నమస్కారం చేస్తాడు. మోహన్‌సింగ్ తన బ్రతుకు

తెరువుకోసం ఎన్నడూ ఎవర్నీ యాచించి ఎరుగడు. అయితే ఎవరైనా జాలిపడి తాముగా ఏదైనా సహాయంచేస్తే మాత్రం వద్దనడు. సింగ్ ఎవరితోడూ లేకుండా ఒంటరిగా ఐరోపా దేశాలు పర్యటించి ప్రదర్శన లిచ్చాడు. కొన్ని దేశాలు అతనికి ప్రయాణం ఖర్చులిచ్చాయి. బెల్జియంలో ఒకసారి సింగ్ ఒక వాచీ కొని డబ్బులిచ్చేందుకు పర్సుని కాళ్ళతో తెరువగానే, షాపులోని సేల్సుగరల్



ఆశ్చర్యపోయి, డబ్బు వద్దనీ, తన బహుమతిగా ఆవాచీ ఉంచుకొమ్మనీ ఇచ్చేసిందట. దురదృష్టమేమిటంటే, మనదేశంలో మాత్రం అతనికి ఏ విధమైన సహకారమూ అందటంలేదు. పైగా తనకి టర్కిష్ ప్రభుత్వం కానుకగా ఇచ్చిన డబ్బుని, బొంబాయి రైల్లో ఎవరో కొట్టేశారుట కూడా.

మోహన్‌సింగ్ మారిషస్ దేశస్థుడు. 1965లో మాతృదేశాన్ని వదిలిపెట్టాడు. ప్రపంచ పర్యటన చెయ్యాలన్నది అతని ఆశయం.

# మరోప్రపంచం

ఫిలడెల్ఫియాలో ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు, మేధావి బెంజిమన్ ఫ్రాంక్లిన్ పేర ఓ మ్యూజియం స్థాపించారు. ఇందులో ప్రవేశించి బయటికి వచ్చేదాకా, మరోప్రపంచంలో విహరిస్తున్నట్లుగా వుంటుంది.

లోపల ఒక నమూనా కారువుంటుంది కారులో ఎక్కి కూర్చోండి, డ్రైవింగ్ రాదనే భయం మీకక్కర్లేదు. అంతలో లైట్లు ఆరిపోతాయి' స్టీరింగ్‌మీద చెయ్యి వెయ్యండి. ఎదురుగా చూడండి – తెర మీద ఓ సినిమా కనిపిస్తుంది. ఆ సినిమా చూస్తూ అందులోమీరు కూడా ఒకపాత్ర అని ఊహించుకోండి. అంతే ... మీరు కూర్చున్న సీటు వణకడం ప్రారంభిస్తుంది. మీకు కంగారు పుడుతుంది. గంటకి 100 కి మీ. వేగంతో కారు నడుపుతున్న థ్రిల్ మీకు లభిస్తుంది. కాసేపటికి లైట్లు వెలుగుతాయి. మీరు నమూనా కారులో బుద్ధావతారంలా కూర్చునివుంటారు. కారు డ్రైవర్లకి భయాన్ని పోగొట్టి ఆత్మ స్థైర్యం కలిగించడంలో ఈ పద్ధతి సమర్థవంతంగా ఉపయోగ పడుతున్నదట అక్కడ. మరో పెద్ద హాలులో గోడకి చాలా గాజు గొట్టాలు అమర్చివుంటాయి. అక్కడనీరు, హైడ్రోజన్,ఆక్సిజన్‌లుగా విడిపోవడం, తిరిగి సంయోజనం చెంది నీరుగా మారడాన్ని ప్రత్యక్షంగా మీరు చూడగలరు మరో గదిలోకి అడుగు పెట్టండి. ఇక్కడ పుస్తకాల్లో చదువుకు నే విజ్ఞానమంతా ప్రత్యక్షంగా

ప్రయోగాలద్వారా చూసి తెల్సుకోవచ్చు. వాన ఎలా కురుస్తుంది? ఒక బటన్ నొక్కండి. వెంటనే ఒక పాత్రలో నీళ్ళు



సలసలమసలడం ప్రారంభమవుతుంది. ఆ ఆవిరంతా పైకి లేస్తుంది, ఒక కృత్రిమ పర్వతానికి ఆ ఆవిరితగిలి వెంటనే వర్షంకురుస్తుంది.

అలాగే తక్కువ ఉష్ణోగ్రతలోతుఫాను లెలావస్తాయో కూడా ఆ గదిలో ప్రత్యక్షంగా చూడవచ్చు. ఈ ప్రత్యక్ష ప్రయోగాలని ఫ్రాంక్లిన్ ఇన్‌స్టిట్యూట్ ఏర్పాటు చేసింది. ఈ మ్యూజియంలో వినోదమూ వుంది, విజ్ఞానమూ వుంది.

# చర్చిల్ కోరిక

ఘనత వహించిన ఆనాటి ఇంగ్లండు ప్రధాన మంత్రి విన్‌స్టన్ చర్చిల్ తన శరీరాన్ని మరణానంతరం దహనం చేయవల్సిందిగా కోరాడు. 1965 లో ఆయన కన్ను మూశాడు. అయినా అప్పటి ప్రభుత్వం ఆయన కోరికని కప్పిపెట్టి,రాజలాంఛనాలతోసమాధిచేసింది

ఇంగ్లాండులో 'దహన సంస్కార సంస్థ' ఒకటి వున్నది చర్చిల్ తన మరణానికి ఇరవయ్యేళ్ళ పూర్వమే ఆ సంస్థలో తన పేరు నమోదు చేయించుకుని, ఆమరణాంతం అందులో సభ్యుడిగా కొనసాగాడు.

1943 ఫిబ్రవరి 12వతేదీన, చర్చిల్ దహన సంస్కార సంస్థకి రాసిన ఉత్తరం ఒకటి ఈ మధ్యనే బయట పడింది. ఆ వుత్తరంలో తననీ, తన భార్యనీ మరణానంతరం దహనంచెయ్యాలని రాసి వుంది. అందుకు అవసరమైన సభ్యత్వ దరఖాస్తులు కూడా వున్నాయి.



దానితో పాటు దహన సంస్కారానికి అయ్యే ఖర్చు నిమిత్తం ముందుగానే ఆయన తన పేర, తన భార్య పేర కొంత మొత్తాన్ని రుసుముగా చెల్లించాడట. క్రిందటి సంవత్సరం మరణించిన చర్చిల్ భార్యకు అభీష్టాను సారం దహన సంస్కారమే జరిగింది. కానీ చర్చిల్ కోరికే తీరలేదు పాపం!

వీరయ్య ఉదయమే కాఫీ, టిఫెన్లూ సేవించి, పంచలో వాలుకుర్చీలో కూర్చుని చుట్టకాల్చుకుంటున్నాడు.

ఒక పాతికేళ్ళ యువకుడూ, యాభై సంవత్సరాల స్త్రీ వీరయ్య వద్దకొచ్చి నిలబడ్డారు.

"ఎవరూ?" అని అడిగాడు వీరయ్య.

"నేను బాబూ! శేషమ్మను. నా గురించి రామయ్యగారు మీకు చెప్పి ఉంటారు."

"ఓ సువ్వా!..."

"అవునండి బాబుగారూ!" అని ఆ యువకుని వంక కొరకొరా చూసింది శేషమ్మ.

యువకుడు అయిష్టంగా వీరయ్యవంక చూసి, "నమస్కారమండీ!" అన్నాడు. వీరయ్య ఆ యువకుణ్ణి నిశితంగా పరిశీలించాడు. చాలా సన్నగా పొడుగ్గా ఉంటంతో తొడుక్కున్న పేంటూ, షర్టూ జండాబొంగుకు తగిలించినట్లున్నాయి దిష్టిబొమ్మకులాగా.

"బాబుగారూ! వీడే నా పెద్దకొడుకండీ! పేరు గోపీనాథ్. మీకు రామయ్యగారు మ్మా పరిస్థితులు చెప్పేఉంటారు వీడి నాయన పోయిన ఈ మూడు సంవత్సరాలనుండీ కుటుంబం జరుగక, చాలా కష్టాలు పడుతున్నాం. నేను వంటలు చేస్తున్నాను. ఈడొచ్చిన ఆడపిల్లలు విస్తళ్ళుకుట్టి, కాగితపు సంచులు అంటించీ నెట్టుకొస్తున్నారు. వీడు ఎం.ఎ. చదివాడు. మాకున్నదంతా వీడి చదువుకే అయిపోయింది వీడేమో ఎం.ఎ. లో క్లాసు తెచ్చుకోకుండా వచ్చాడు. నాలుగేళ్లైంది ఒక్క ఉద్యోగమూ రాలేదు. మీ కాన్వెంటులో ఓ చిన్న ఉద్యోగం ఇప్పించండి బాబూ! చచ్చి మీ కడుపున పుడతాను" అన్నది శేషమ్మ దీనంగా.

"శేషమ్మా! నీ గురించి రామయ్య చాలా చెప్పాడు. నా కాన్వెంటులో ఐదు క్లాసుల వరకే ఉంది. ఈ ఎం. ఎ. కుర్రాణ్ణి నేనేంచేసుకోను?"

"అంతమాట అనకండి బాబూ! ఏ పని అయినా చేస్తాడు! మీరు దయ దల్చాలి!"

"ఏమనుకోకు శేషమ్మా! మాకు ఇంత చదువుకున్న మేష్టారు అవుసరం లేదు. మేం ఇచ్చే జీతం ఈయనకు చాలదు."

"బాబ్బాబూ! అంతిమాట అనకండి— అందరితోపాటే ఇవ్వండి."

"లేదు శేషమ్మా! ఈ కుర్రాళ్ళు చాలా చిక్కులు పెడతారు. ఎక్కువ చదువుందిగదా! ఎప్పుడెప్పుడు మంచి ఉద్యోగాలు దొరుకుతాయా, వెళ్ళిపోదామా అన్న ధ్యాసతప్పించి పిల్లలకు చదువులు చెప్పరు."

"మావాడు అలాంటివాడు కాదండీ! ఒళ్ళు ఒంచి పనిచేస్తాడు. మీరే దయ దల్చి మీ కాన్వెంటులో ఉద్యోగం ఇవ్వాలి బాబూ! నిదానంగా రికమెండేషన్ చేసి ఏదైనా బ్యాంకులోగానీ, గవర్నమెంటులో గానీ ఉద్యోగం ఇప్పించాలి."

"రికమెండేషన్లకు ఉద్యోగాలు వచ్చే రోజులు పోయినాయి శేషమ్మా!"

"పోనీండి బాబూ! వాడి అదృష్టం! కనీసం మీ కాన్వెంటులోనైనా ఉద్యోగం ఇప్పించండి."

"పెద్ద చిక్కొచ్చిందమ్మా! అసలు

మా కాన్వెంటులో మగాళ్ళను చేర్చుకోం. మా కాన్వెంటులో అంతా ఆడవాళ్ళే!"

"బాబ్బాబూ! మా వాడు చాలా బుద్ధిమంతుడు. అల్లరి చిల్లరి వేషాలు వేసి ఎరుగడు."

"చాలా ఇబ్బంది తెచ్చిపెడుతున్నావ్ శేషమ్మా!"

"మీరు దయతల్చాలి" అంటూ శేషమ్మ వీరయ్య కాళ్ళు పట్టుకుంది.

"అరెరే! ఏంటిది శేషమ్మా!" అన్నాడు వీరయ్య. కానీ ఆశ్చర్యమేమీ లేదా మాటలో.

"బాబూ! మీకు తప్పదు" అంది శేషమ్మ.

గోపీనాథ్ ఒళ్ళంతా అవమానంతో ఒణికిపోయింది. కానీ పరిస్థితులకు తల వంచకతప్పదు అనుకుని ఊరుకున్నాడు.

"సరే కానీయ్ శేషమ్మా!"

"బాబ్బాబూ మీరు దయామయులు!"

వీరయ్య గోపీనాథ్ వంక చూసి, సర్టిఫికేట్లేవి?" అని అడిగాడు. గోపీనాథ్ సర్టిఫికేట్లనూ, టెస్టిమోనియల్స్‌నూ అన్నీ కలిపిన ఒక ఫైల్‌ను వీరయ్యకిచ్చాడు. వీరయ్య వాటి బరువు చూస్తూ హేళనగా గోపీనాథ్ వంక చూచాడు. గోపీనాథ్ తలవంచుకున్నాడు. వీరయ్య శేషమ్మతో అన్నాడు,

"చూడు శేషమ్మా! రామయ్య ముఖం చూచి మీ వాడికి ఉద్యోగం ఇస్తున్నాను. మా కాన్వెంటులో చాలా డిసిప్లిన్ ఉంటుంది. జాగ్రత్తగా పని చేసుకోమని చెప్పు."

"అలాగే బాబూ!"

"గోపీనాథ్! వెళ్ళి జాగ్రత్తగా పని చూచుకో. హెడ్‌మిస్ట్రెస్ నళినికి నేను చెప్పానని చెప్పు. ఆమె నిన్ను ఏక్లాసులో వేస్తుందో ఆ క్లాసుకు వెళ్ళు."

"అలాగేనండి."

"ఇక వెళ్ళండి."

శేషమ్మ బయలుదేరింది. గోపీనాథ్ వీరయ్య వంక చూస్తూ అలాగే నిలబడి ఉన్నాడు.

"మరి నా సర్టిఫికేట్లండీ!"

"మా దగ్గర ఉద్యోగం చేసేవాళ్ళ సర్టిఫికేట్లు నా దగ్గరే ఉంటాయి."

"మరి...నాకు..."

"నీకు సర్టిఫికేట్లు కావాలంటే నీవు మా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చిన తరువాత ఇస్తాం. అంతదాకా నా దగ్గరే ఉంటాయి."

గోపీనాథ్ తలలో లక్ష సందేహాలు పుట్టాయి.

ఈ సర్టిఫికేట్లు ఈయన పారేస్తే? తన గతి ఏం కావాలి? ఈయన దగ్గర సర్టిఫికేట్లు పెట్టుకొని ఏం చేస్తాడు? పోనీ సర్టిఫికేట్లు తీసుకున్నట్లు రశీదు ఇస్తాడా? రశీదు అడగొచ్చా? అడుగకూడదో?



## 2

గోపీనాథ్ వీరయ్య ఇంటి నుండి బయలుదేరి కాన్వెంటుకు చేరుకున్నాడు. ఒక పెద్ద ఆవరణలో తడికెలతో, కొష్టా

లుగా నిర్మింపబడి ఉన్నది కాన్వెంటు.

అందులో ఒక తడికెల గది హెడ్ మిస్ట్రెస్ రూం!

గోపీనాథ్ నేరుగా హెడ్‌మిస్ట్రెస్ రూంలోకి వెళ్ళాడు. ఆ రూంలో, ఐదుగురు ఆడవాళ్ళు కూర్చుని ఉన్నారు. టైం ఒకటిన్నర అయింది. మధ్యాహ్నపు బడి రెండు గంటలకు ప్రారంభం అవుతుంది. వాళ్ళంతా టీచర్లు అనీ, ఒక బల్ల వెనుకగా కుర్చీలో ఉన్నామె హెడ్ మిస్ట్రెస్ అనీ ఊహించాడు గోపీనాథ్.

గోపీనాథ్‌ను చూడగానే గదిలోని ఆడవాళ్ళంతా, నిశ్శబ్దంగా అయిపోయి గోపీనాథ్ వంక చూస్తున్నారు. గోపీనాథ్, వాళ్ళు ధరించిన చీరలను చూచి తన మాసిన పాంట్, షర్ట్‌ను ఊహించుకుని సిగ్గు పడ్డాడు. అయినా, మరో భావం వచ్చి సంతసించాడు. ఇంత ఖరీదైన చీరలు ధరించిన పంతులమ్మలకు జీతం బాగానే ముట్టూ ఉండాలి. తనూ ఒకనెల జీతంతో మంచి గుడ్డలు కుట్టించుకోవచ్చని అనుకున్నాడు గోపీ.

"ఎవరు కావాలండీ!" ప్రశ్నించింది హెడ్‌మిస్ట్రెస్.

"నా...పేరు... గోపీనాథ్ అండీ! నన్ను ఇక్కడ టీచర్‌గా వీరయ్యగారు అపాయింట్ చేశారండీ!"

పంతులమ్మలు, హెడ్‌మిస్ట్రెస్ ఆశ్చర్యంగా గోపీనాథ్ వంక చూసి తమలో తాము ముఖాలు చూసుకున్నారు.

"నన్ను, హెడ్‌మిస్ట్రెస్‌గార్ని కలుసుకో మన్నారండీ! నేను ఏం చేయాలో ఆమె చెబుతా రన్నారండీ!"

"కూర్చోండి!" అన్నది హెడ్ మిస్ట్రెస్. పంతులమ్మలంతా చిత్రంగా చూశారు గోపీనాథ్ వంక.

గోపీనాథ్ ఒక స్టూల్ లాక్కొని కూర్చున్నాడు. వినయంగా హెడ్ మిస్ట్రెస్ వంక చూచాడు.

"మీరు ఏం చదివారు?" హెడ్ మిస్ట్రెస్ ప్రశ్న.

"ఎం. ఎ.!"

పంతులమ్మలతో పాటు, హెడ్ మిస్ట్రెస్ గూడా ఉలిక్కి పడింది. ఆ గదిలో వాతావరణం పూర్తిగా మారిపోయింది.

హెడ్‌మిస్ట్రెస్ అన్నది. "నా పేరు నళిని, అన్నట్లు గోపీనాథ్‌గారూ! ఎం.ఎ. చదివి ఈ ఉద్యోగానికొచ్చారెందుకని?"

"ఖర్మ! క్లాసు రాని ఎం. ఎ.–బి ఎ. కంటే హీనం!"

"బి. ఎ.లో క్లాసు వచ్చిందా?"

"ఫస్ట్ క్లాస్ అండీ!"

"పోనీ! ఆ ఎం. ఎ. సర్టిఫికేటు దాచి బి. ఎ. ఫస్ట్ క్లాస్‌తోనే ఉద్యోగం సంపాదించగూడదా!"

"అది సాధ్యం కాదండీ! బి. ఎ. పాసైనాక ఎక్కడ ఉన్నావు? ఏం చేశావు? అని సవాలక్ష ప్రశ్నలు వేసి వ్రాతమూలకంగా అప్లికేషన్‌లు తీసుకుంటారండీ! అబద్ధం రాస్తే రేపది బయట పడితే ఇంటికెళ్ళాల్సిందే!".

ఇంతలో నళిని వాచ్ చూచుకుని, "అరెరే! రెండైంది. బాలమ్మా బెల్ కొట్టు" అన్నది. పంతులమ్మలంతా లేచారు

"ఇదిగో! విమలా! నీవు, వీరికి మూడో క్లాస్ చూపు! గోపీనాథ్ గారూ! మీరు మూడో తరగతి తీసుకోండి!"

విమల "రండి! గోపీనాథ్ గారూ! మీ క్లాస్ చూపుతాను" అంటూ తోవ తీసింది. గోపీనాథ్ ఆమె వెంట నడుస్తున్నాడు. విమల నేరుగా వెళ్ళి ఒక పెద్ద తడికెల గదిలో ప్రవేశించింది.

ఆ గదిలో ఒక వందమంది దాకా, పిల్లలున్నారు. పంతుళ్ళను చూచి ఒక్కసారి గోల ఆపేశారు. ఆ పిల్లలు యాభై మంది ఒకవైపు, యాభై మంది మరోవైపు తిరిగి కూర్చుని ఉన్నారు. అంటే అవి రెండు క్లాసులని అర్థం చేసుకున్నాడు గోపీనాథ్.

విమల ఒక వైపుగా నడిచి, ఒక క్లాసులో ప్రవేశిస్తూ "మీరు ఆ క్లాస్ తీసుకోండి" అన్నది. గోపీనాథ్ రెండోవైపు నడిచి, మరో క్లాసులో కూర్చున్నాడు. ఇద్దరూ పాఠాలు చెప్పడంలో మునిగి పోయారు

గోపీనాథ్‌కు కొత్తగా ఉంది. పిల్లలను-అబ్బాయిలూ, అమ్మాయిలూ గోల చేయకండి! అని పాఠం చెబుతున్నాడు. అయినా గోలగానే ఉంది. విమల క్లాసు ప్రశాంతంగా ఉంది. విమల గోపీనాథ్ వంక చూచింది, క్లాసును కంట్రోల్ చేయమన్నట్లుగా గోపీనాథ్ నిస్సహాయంగా విమలవంక చూచి, 'గోల చేయవద్దని' మరో మారు క్లాసుకు విన్నవించుకున్నాడు. అయినా గోపీనాథ్ క్లాసు లెక్క చేయడం లేదు.

విమల బెత్తం తీసుకువచ్చి గోపీనాథ్ క్లాసులో అల్లరిచేసే పిల్లలను గుర్తుపట్టి, ఒక పిల్లవాడి చెవి పట్టుకొని మెలిబెట్టింది. దాంతో ఆ పిల్లవాడు కీచుమని అరిచాడు. విమలనుచూచి మిగతా పిల్లలంతా నిశ్శబ్దంగా ఉన్నారు. విమల గోపీనాథ్ వంక చూచింది. గోపీనాథ్ తప్పుచేసిన విద్యార్థిలాగా, చూపులు తిప్పుకున్నాడు. విమల తన క్లాస్‌లోకి వెళ్ళింది గోపీనాథ్ క్లాసును కంట్రోల్ చేయవలసిన విధానం నేర్చుకున్నాడు.

కొంత సేపటికి ఇద్దరూ డిక్టేషన్ ఇచ్చి మౌనంగా కుర్చీల్లో కూర్చున్నారు. ఒక్కొక్క విద్యార్థి తను వ్రాసింది పంతుళ్ళకు చూపిస్తున్నారు. గోపీనాథ్, విమల వంక పరిశీలనగా చూస్తున్నాడు. అది గమనించి విమల సీరియస్‌గా, పిల్లలను గమనిస్తున్నది.

విమల చాలా సన్నగా ఉంది. చేతులు పుల్లలలాగా ఉన్నాయి. మెడలోని ఎముకలూ నరాలూ కనిపిస్తున్నాయి. దేహం మీద చీర, రవిక బ్రహ్మాండంగా ఉన్నాయి. మెడలో ఓ గొలుసు, చేతికి గాజులు

గోపీనాథ్, నలుగురు చెల్లెళ్ళు పల్లెటూళ్ళోనే ఉండి, ఏడో క్లాసుతో చదువులు ముగించారు.

తన చెల్లెళ్ళు చీరల డాబు మినహాయిస్తే, విమలలాగే ఉంటారు. అంటే, విమలగూడా పస్తులు-టున్నదా? అలా ఉండకుండా ఉంటే, మరి విమల బలహీనానికీ, బక్కచిక్కిన తనానికీ కారణాలు ఏంటి? విమల ముఖంలోకి నిశితంగా చూశాడు గోపీనాథ్ ఆమె ముఖంలో రోగ లక్షణాలు గోచరించడం లేదు. బహుశః జీతం డబ్బులన్నీ, చీరలకూ, సింగారాలకూ తగలేసి, తిండి తినదేమో? లేక బాధ్యతలున్నాయేమో? ఇంటికి డబ్బు పంపాలేమో?

ఇక్కడున్న అందరి పంతులమ్మల కంటే విమలే కాస్త రూపసి, ఇలాంటి పిల్లను, తను పెండ్లి చేసుకుంటే ?...

విమల, గోపీనాధ్, క్లాసు లో కొచ్చాక తన వంక ఒకటి, రెండు సార్లు నిశితంగా చూచినప్పుడు విసుక్కుంది. గోపీనాధ్‌ను చూచిన వెంటనే విమలకు జాలిలాంటిది పుట్టింది. ఇతడొక క్షయ రోగిఅనుకున్నది. ఆ తరువాత ఎం. ఎ చేశాడనీ, దరిద్రుడనీ నిర్లిప్తంగా ఉండి. గోపీనాధ్ తనవంక మొదటి సారిగా చూచినప్పుడు, విమలకు కోపం వచ్చింది. కానీ, క్రమంగా గోపీనాధ్ ఆలోచనల్లో పడడం, తనవంక చూచిన చూపులలో వికారం లాంటిది కనబడకపోవడంతో ధైర్యం తెచ్చుకుంది.

ఇంతలో గంట కొట్టారు. పిల్లలంతా గొల్లున గోల చేసుకుంటూ, వాకిట్లోకి వెళ్ళిపోయారు.

"బడి, అయిపోయినట్లేనా ?"

"అప్పుడేనా ? ! -ఇంకా చాలా తతంగం ఉంది ! సరోజ, ఇందుమతి, కనకం ఇప్పుడు ఈ పిల్లల చేత ఆటలు ఆడించాలి. ఒక గంట, ఆటలయ్యాక అందర్నీ లైనులో పెట్టాలి, ఆ తరువాత రిక్షాలొస్తాయి. రిక్షాలలో వీళ్ళను బాచెస్గా చేసి ఇండ్లకు పంపాలి. అందరూ వెళ్ళిపోయేప్పటికి ఒక్కోరోజు ఏడు గంటలౌతుంది !"

"ఉదయం బడి ఎన్నింటికి"

"ఏడున్నగంటలకు!"

"అంటే ఉదయం ఏడింటి నుండీ, సాయంకాలం ఏడింటి దాకా పని చేయాలా?"

"అవును!"

గోపీనాధ్ ఆలోచనలో పడిపోయాడు. విమల క్లాస్ రూంనుండి బయటకు వచ్చి హెడ్‌మిస్ట్రెస్ నళిని రూందగ్గర కెళ్ళున్నది. గోపీనాధ్ ఆమె వెంట వెళ్లాడు. విమల వెళ్ళి నళిని రూంలో ఒక కుర్చీలో కూర్చుంది. గోపీనాధ్‌కూ ఒక కుర్చీ ఇచ్చి కూర్చోమంది. గోపీనాధ్ కూర్చున్నాడు.

నళిని వాకిట్లో మిగతా పంతులమ్మలకు ఆ రోజున పిల్లలచేత ఏఏ ఆటలు ఆడించాలో చెప్పి, తన రూంలోకి వచ్చి కుర్చీలో కూర్చున్నది.

గోపీనాధ్ చివాలున లేచి నిల్చున్నాడు, నళిని గదిలో కాలు పెట్టగనే. నళిని బిత్తర పోయింది. విమల కిసుక్కున నవ్వింది. నళిని మందలింపుగా విమలను చూచి గోపీనాధ్‌తో అన్నది-

"గోపీనాధ్ గారూ ! కూర్చోండి ! ఇక్కడ ఇలాటి మర్యాదలు అనవసరం! మనమంతా ఒకటే ; ఎవరి పనులు వారు చూచుకొని వీరయ్యగారి నుండి మాట పడకుండా ఉండడమే మనకు కావాలి !"

గోపీనాధ్ కుర్చీలో కూర్చున్నాడు.

"మిమ్మల్ని ఎలా పిలవాలి ?" అడిగాడు గోపీ.

"నాపేరు నళిని! అలాగే పిలవండి!"

"చూడండి నళిని గారూ! ఇక్కడ టీచర్సుకు జీతం ఏమిస్తారు ?" ఆ మాటతో నళిని, విమలలు భయంగా చూచారు గోపీ వంక అయినా ఏం చెప్పలేదు.

"గోపీనాధ్ గారూ! మీ స్వగ్రామం ఇది కాదంటున్నారు. మరి ఎక్కడ ఉంటారు?"

"ఎక్కడైనా రూం చూసుకోవాలి!"

"ఆ ఆలోచనలు మానుకోండి! రూం తీసుకోవాలంటే ఖర్చు! హాయిగా ఈ స్కూల్‌లోనే ఉండిపోండి!"

గోపీ సంతోషంగా "అలాగే నండీ!" అన్నాడు

"మరి భోజనం ?"

"ఒండుకుంటాను !"

"వంట సామగ్రి ?"

"ఎంత సామగ్రి లెండి ! రెండు గిన్నెలూ, పళ్ళాలూ! అవీ తెచ్చుకున్నాను. వాటిని తెలిసిన వాళ్ళింట్లో పెట్టాను. బడి వదిలాక వెళ్ళి తెచ్చుకుంటాను!"

ఆ తరువాత స్కూలుకు సంబంధించిన వివరాలు నళిని, విమల మాట్లాడుకుంటూ ఉంటే గోపీ వాళ్ళ సంభాషణను, స్కూలు వివరాలను శ్రద్ధగా వింటున్నాడు.

ఇంతలో సంధ్య చీకట్లు అలుముకున్నాయి.

ఆటలకు తీసుకెళ్ళిన ముగ్గురు టీచర్లూ పిల్లలను తీసుకొచ్చి క్లాసులవారిగా నిలబెట్టారు. ఐదురిక్షాలు వచ్చాయి. తడవకు పది పదిహేను మందిని కుక్కి పంపుతున్నారు. రిక్షావాళ్ళు పిల్లలను తీసుకెళ్ళి వాళ్ల ఇండ్లదగ్గర దింపి మళ్ళీవస్తున్నారు.

ఆఖరి బాచ్ పంపడం ఏడుంబావుకు పూర్తి అయింది.

నళిని టీచర్లందర్నీ గోపీకి పరిచయం చేసింది. ఈ లోగా గోపీ వెళ్ళి తన వంట సామగ్రి తెచ్చుకున్నాడు.

గోపీ తన వంట సామగ్రిని సర్దుకుంటుంటే నళిని, విమల తప్ప మిగతా టీచర్లు వెళ్ళిపోయారు.

"గోపీగారూ! ఈ రోజు ఏం చేస్తున్నారు?" అన్నది నళిని గోపీ సర్దే సామాగ్రిని చూస్తూ.

గోపీ మూడు రాళ్ళను తెచ్చి పొయ్యిలాగా అమర్చాడు. ఆ ఆవరణలోని ఎండు కొయ్యలనూ, పాత పేపర్లనూ ఏరుతూ అన్నాడు. "ఈ రోజు బాగా ఆకలిగా ఉందండీ! ఒక అరసోల బియ్యం పెట్టుకుంటాను. ఇంటినుండి తెచ్చిన చింతకాయ పచ్చడి ఉంది"

నళిని తన గదికి తాళం వేసి వచ్చి విమలను కలుసుకుంది.

"జాగ్రత్తగా ఉండండి" అని చెప్పి నళిని విమలను కలుపుకొని వెళ్ళిపోయింది. గేటు వేసి వచ్చిన గోపీ ఇక వంట ప్రయత్నం చేయాలి అనుకున్నాడు.

ఒక గిన్నెలోకి బియ్యం తీసుకొని బావి దగ్గర కెళ్ళి బియ్యం కడుక్కొని వచ్చాడు. పొయ్యిలో, చెత్త కాయితాలు వేసి మంట చేశాడు. దానికి కట్టెలను తగిలించి ఆలోచిస్తూ కూర్చున్నాడు.

మొత్తానికి ఏదో ఉద్యోగం దొరికింది ఇక తిండికి దిగులు లేదు. జీతం ఎంత ఇస్తారో? జీతం సంగతి అడిగితే మాట మార్చిందెందుకు నళిని ? ఆశ్చర్యంగా ఉంది. ఏమైనా, నెలకు మూడొందలకు తగ్గదు. రోజుకు పన్నెండు గంటలు పని చేయించుకుంటారు. ఆ మాత్రం ఇవ్వరా ? మూడొందలొస్తే, తను వంద ఖర్చు పెట్టుకొని, రెండొందలు ఇంటికి పంపుతాను. పాపం చెల్లెళ్ళు, ఇంత అన్నమైనా కడుపునిండా తింటారు. పెళ్ళి కావలసిన పిల్లలు, కాస్త కంటికి అందంగానైనా, కనిపిస్తే ఎవడైనా చేసుకోవచ్చు.

ఇతా ఆలోచిస్తూ, గోపీనాథ్ అన్నం వండటం ముగించి గిన్నె క్రిందికి దింపాడు.

ఇంతలో, పంతులుగారూ" పంతులుగారూ !" అన్న శబ్దం వినబడింది. ఎవరా అని గోపీ వాకిట్లోకి వచ్చి, చూచి ఆ బడిలో ఉద్యోగం చేసే ఆయాగా ఆమెను గుర్తించాడు. గేటు తలుపు తీశాడు.



# 3

బాలమ్మ ఆ బడిలో ఆయా పని చేస్తుంటుంది. ప్రొద్దున్నే, పిల్లల ఇండ్ల కెళ్లడం, రానివారిని తీసుకొని రావడం, అందరూ మళ్ళీ ఇళ్ళకు వెళ్లేలా చూడడం ఆమె బాధ్యత.

"ఏంటి బాలమ్మా? ఇప్పుడొచ్చావు?"

"బాబుగారూ ! నళినమ్మగారు కూరా, మజ్జిగ పంపారండీ!"

నళిని దయార్ద్ర హృదయానికి పొంగిపోయాడు గోపీ.

బాలమ్మ క్యారేజీని గోపీ ఎదురుగా పెట్టింది. గోపీ క్యారేజీ తీసి చూచాడు. అందులో వేడివేడిగా వంకాయ కూర ఉంది ఒక గిన్నెలో. రెండో గిన్నెలో మజ్జిగ ఉన్నాయి. గోపీ అన్నాన్ని ఒక పళ్లెంలోకి ఒడ్డించుకుని, టిఫిన్ కారియర్ లోని కూరను తీసి కలుపుకొని ఆవురావురుమని కూర, అన్నం తింటున్నాడు.

బాలమ్మ ప్రశ్నల రూపంలో గోపీ సంగతులు తెలుసుకుంది.

"బాలమ్మా నీ సంగతి చెప్పు" అన్నాడు గోపీ, అన్నం తింటూనే. బాలమ్మ చెప్పింది.

"మా మావ రిచ్చా లాగుతాడు. రిచ్చా యీరయ్యా గోరిది. రోజుకు మూడు రూపాయలు అద్దె ఇస్తాడు ఈరయ్యా గోరికి. ఇక నేను ఈడ ఉద్యోగం జేస్తుంటిని. నాకు ముగ్గురు పిల్లలు"

"నీ కెంత జీతం ఇస్తారు బాలమ్మా"

బాలమ్మ సందేహంగా సమాధానం చెప్పడం ఇష్టం లేనట్టు చూచింది. గోపీకి ఇందాక నళిని వాళ్ళు గూడా ఇలాగే సందేహించడం జ్ఞాపకం వచ్చింది.

"బాలమ్మా ఏంటి ? ఎవర్నడిగినా ఎంత జీతమో చెప్పరు"

"చెబుతే ఈరయ్యా గోరు సంపుతారండి"

"అదేంటి ?" గోపీ ఆశ్చర్యానికి అంతులేదు.

"యాడా అన బాకండి"

"చెప్పు బాలమ్మా! ఎవరికీ చెప్పను! అయినా నా జీతం ఇంత అని చెప్పకోడానికి ఎందుకు భయపడాలి?"

"నా జీతం నెలకు యాభై రూపాయలు బాబూ!"

"ఇంతేనా? రోజుకు రెండు రూపాయలు గూడా లేదు!"

బాలమ్మ సిగ్గుపడుతూ తల వంచుకుంది.

"బాలమ్మా నీవు కాదు సిగ్గు పడవలసింది రోజుకు రెండు రూపాయలుగూడా ఇవ్వక రోజంతా పని చేయించుకున్న

వాళ్ళు సిగ్గు పడ్డాలి."

బాలమ్మ చిత్రంగా చూచింది గోపీ వంక.

"అదిగాదు బాబూ నా జీతం వంద రూపాయిలని రాసుకుంటారంట ఇచ్చేది యాభై!"

గోపీ ఆశ్చర్యపోయాడు." నళినమ్మగోరి జీతం మూడొందలని రాసుకుంటారుట. ఇచ్చేది నూటపాతిక. ఇక పంతులమ్మల సంగతీ అంతే. ఆళ్ళ కిచ్చేది వంద, రాసుకునేది రెండొందలయాభై"

గోపీ బిత్తరపోయాడు. ఇప్పుడిప్పుడే నిర్మించుకుంటున్న ఆశాసౌధాలు నేల కూలిపోతున్నాయి. అంటే తన జీతం కూడా నెలకు వంద. ఇందులో తనేం తినాలి? ఇంటికేం పంపాలి?

ఇక గోపీకి అన్నం సహించలేదు. అన్నం తినడం ముగించి గిన్నెలు మూతలు పెట్టాడు.

"బాబూ! నేను చెప్పానని ఎక్కడా అనబాకండి! ఆ ఇందుమతమ్మ, సరోజమ్మ ఈరయ్యగోరి మనుషులు. ఈడ శీమ శిటుక్కుమన్నా ఆడ ఈరయ్యగోరి చెవిదాకా ఎల్తాది."

గోపీ బాలమ్మ మాటలను జీర్ణంచేసుకుంటున్నాడు.

"బాలమ్మా! మరి వీళ్ళు మా కు నిండు జీతం కావాలని అడగరా."

"అడిగితే ఇంటికెళ్లాల్సిందే బాబూ ఆ గవర్నమెంటోడి బళ్ళో అయితే, బళ్ళో నిదరబోయినా, పాటం చెప్పినా ఆళ్ళ జీతం ఆళ్ళకొస్తదంట. ఈ ఎదవ బళ్ళింతే బాబూ! ఆ రెండో కాన్వెంటులోనూ అంతే. ఆ కిరస్తానోళ్ళ బడిలోనూ అంతేబాబూ!"

"బాలమ్మా! యాభై రూపాయలతో నీ కుటుంబం ఎలాగడుస్తుంది?"

"నా యాభై రూపాయలూ ఒక లెక్క లేదండీ. మా మావ రిచ్చా లాగుతాడు, రోజుకు పదరూపాయలొస్తాయి"

"అంటే నెలకు మూడువందలు. మరి బాలమ్మా! మీ ఆయన రిషా కూడా వీరయ్యదేగదా! మరి రోజుకు పదిరూపాయలూ ఖిమ్మల్ని తిననిస్తాడా!"

మా మావకాడ ఆ పప్పులేం ఉడకవండీ. ఆడు పార్టీ మెంబరు. ఈరయ్యగోరు మా మావతో పేశీకిదిగితే ఆళ్ళంతా కట్టుకడతారండీ."

"మరి మనమంతా కట్టుకడితే?"

"బాబూ! మీరు కొత్తోళ్ళు, ఇలాంటి ఆలోచనలు పెట్టుకోమాకండి ఈడ సమాకున్నోళ్ళు కట్టుగట్టలేరు. అరజీతంతోనే సగం బతుకులు ఈడ్చుకొత్తారు. మాకు అన్నాయం జరుగుతుందని శెప్పకోనుగూడా లేరండీ."

గోపీ ఆలోచనలో పడ్డాడు.

"ఈ బళ్లో ఎక్కువ రోజులు ఎవరూ ఉండరండీ. మరోగతీ, దోవా లేనివాళ్ళు తప్పిస్తే. సరోజమ్మ మొగుడికీ, ఇందుమతి మొగుడికీ వేరే ఉద్యోగాలున్నాయి. కనకమ్మను మొగుడ్డొదిలేశాడంట అండీ! ఆమెగారు పుట్టింట్లో ఉంటూ ఉద్యోగం చేస్తున్నారండీ. పాపం! నళినమ్మగారికి ఇద్దరు పిల్లలు గలిగాక మొగుడు సచ్చిపోయాడండీ."

"నళిని విధంతువా? ఇద్దరు పిల్లలున్నారా?"

"అవునండీ బంగారు తునకలు–

ఒకడు నాలుగోక్లాసు, ఇంకొకడు రెండో క్లాసూ సదువుతున్నారండీ మనబళ్ళోనే."

"మరి భర్త పోయాడు గదా! ఆస్తి పాస్తులు ఏమైనా?..."

"అవేం లేవండీ! బంధువులు గూడా దగ్గరికి రానీయరండీ. ఆమెగారు ట్రైనింగ్ కూడా అయ్యారంటండీ."

"మరి విమల?"

"విమలమ్మగారిదో మాలోకం అండీ. గంపెడు సంసారం, పెద్దపిల్ల, పెళ్ళి చేయలేక ఈ బళ్ళో చేర్పించారండీ, ఆమె చేరి గూడా ఇంకా నెలకాలేదండీ."

"ఊఁ!"

"ఒస్తానండీ బాబుగారూ! అంట్లగిన్నెలు ఇలాగియ్యండి రేపు పొద్దున్నే తోముకొస్తాను" అంటూ బాలమ్మ గిన్నెలన్నీ తీసుకొని వెళ్ళిపోయింది.

గోపీనాథ్ ఒక దిండును, దుప్పటినీ తీసుకొని రెండు బల్లలు దగ్గరికి లాక్కుని పడుకున్నాడు. బెడ్‌లైటు సన్నగా వెలుగుతున్నది. బల్లలపైన వెల్లకిలా పడుకొని పైకప్పువంక చూస్తున్నాడు.

జీతం వందరూపాయలేనా ! అన్న నిరుత్సాహం క్రుంగదీస్తుంటే కడుపు నిండాక నవ జీవితాన్ని గురించి ఆలోచించడం వ్యర్థం అనిపించింది. విమల అవివాహిత అట' బహుశః కట్నకానుక లిచ్చుకోలేని బీదకుటుంబమేమో ? సన్నగా ఉన్నా ముఖంలో కళా, కాంతీ ఉంది. విమలను చేసుకుంటే చెరో వంద రూపాయలు జీతం వస్తుంది. తామిద్దరూ హాయిగా బ్రతకొచ్చు. మరి తన చెల్లెళ్ల, అమ్మ వాళ్ళనెలా పోషించాలి?

ఊహుః లాభంలేదు. మంచి బ్యాంక్ ఆఫీసర్ ఉద్యోగం రావాలి! దాన్నడ్డం పెట్టుకొని పాతికవేల రూపాయల కట్నం గుంజాలి. ఆ డబ్బుతో చెల్లెళ్ళ పెళ్ళి చేయాలి.

ఊహుఁ' అదీ లాభంలేదు. పాతిక వేల రూపాయలతో ఒకరిద్దరి పెండ్లిండ్లు అవుతాయి. మిగతావాళ్ళ గతి ? ప్చ్ ! ఇదీలాభంలేదు. ఒక లక్షాధికారి కూతురు తనను ప్రేమించాలి, ఆమే తన చెల్లెళ్ళకు పెళ్ళిచేయాలి.

లక్షాధికారి కూతురు తనను ఏంచూసి ప్రేమిస్తుంది?

లక్షాధికారికూతురి వెనుక లక్షమంది ఉంటారు. ఆ పిల్ల తనను ప్రేమించి, లక్షరూపాయలు ఎత్తుకొని తన ఇంటికి వస్తుంటే వాళ్ళంతా చేతులు ముడుచుకొని కూచుంటారా?

అన్నీ వెధవాలోచనలు. పెండ్లీలేదూ గిండ్లీలేదు. ఈ బడిలో, ఈ ముష్టి ఉద్యోగం చేస్తూ బ్రతకడం,ఆ తరువాత మరో మంచి ఉద్యోగం సంపాదించి, అమ్మనూ, చెల్లెళ్ళనూ బ్రతికించడం, జీవితాన్ని దున్నపోతుల బండిగా లాగడం! ఛీ! ఏం బ్రతుకు? ఏం కాలం?



## 4

నళిని, విమల, బడి అయ్యాక ఇంటికొచ్చారు.

వారిద్దరూ ఒక చిన్న గదిని అద్దెకు

చతుర

తీసుకొని జాయింటుగా ఉంటున్నారు. నళిని కొడుకులు ఇద్దరూ బడి ఒదిలాక ఆడుకొని ఇల్లు చేరుకుంటారు. నళిని ఇంటి తలుపు తాళం తీసింది.

ఇద్దరు మొగ పిల్లలూ బిలబిలా వచ్చి ఆమె చుట్టూ మూగారు.

"ఒరే! రవీ వెళ్ళి బాలమ్మను పిలుచుకునిరా ; రామూ కొట్లోకెళ్ళి పావు శేరు వంకాయలు పట్రా!" అంది నళిని.

"ఎందుకు నళినీ ఇప్పుడు వంకాయలు ? అన్నంలో పొడి, చింతకాయ పచ్చడీ చాలదూ ఈ పూటకి ?" అన్నది విమల

"మనకు కాదోయ్ ; మన గెస్టుకు : గోపీనాథ్ పాపం వండుకోలేదు. కూరా నారా ఏమీ ఉన్నట్లులేదు. మనిషి తిండికి ముఖం వాచినట్లున్నాడు, నాలుగు వంకాయలు కూరచేసి పంపిద్దామని"—

విమల, నళిని గదిలోకొచ్చారు. విమల మంచం మీద వాలిపోయింది నీరసంగా. నళిని గది సర్దుతున్నది వంట చేసే ప్రయత్నంతో ఉన్నదంతా ఒకటే గది. అందులో రెండు మంచాలూ, ఒకి మూలన వంట సామాగ్రి ఉన్నాయి.

ఉన్నట్టుండి విమల అన్నది.

"నళినీ అన్నట్లు నీవు గ్రాడ్యుయేట్ కదా ! ఎక్కడైనా పర్మనెంటు ఉద్యోగం చూచుకోలేక పోయవా ?"

"హుం ; పర్మనెంటు ఉద్యోగమా ? ఎక్కడ చూచుకోవాలి ? ఎవర్నడిగినా మూడువేలు లంచం ఇస్తావా ? ఐదు వేలు లంచం ఇస్తావా అని అడుగుతున్నారు ? నా దగ్గర డబ్బేది ? ఒక చతుర

సారి మా పెద్ద బావగారూ, చాలాస్ట్రాంగ్ రెకమండేషన్‌తో ఒకచోట ఉద్యోగం ఇప్పిస్తానన్నాడు కానీ లంచం నాలుగు వేలు—పాపం.

ఆయనగారు రెండు మార్గాలు చెప్పాడు. ఒకటి చేరినచోట నూటపాతిక రూపాయలు మాత్రం జీతం తీసుకోవాలట. మిగతా జీతం వచ్చే నాలుగేళ్ళు దాకా లంచం కింద వాళ్లు మినహాయించుకుంటారట. ఆయనగారు చెప్పిన రెండో పద్ధతి ఏమంటే నెలకు నూటికి రెండు రూపాయల వంతున వడ్డీతో నాలుగువేలు నాకు అప్పుగా ఇప్పించి ఆ మొత్తం లంచంగా ఇస్తాడట. ఇక అప్పటి నుండీ నెలకు వడ్డీ కింద ఎనభై, అసలు కింద వందా ఇవ్వాలట. ఎటు తిరిగీ ఆ నూటపాతికే గదా నాకు దక్కేదల...

విమల ఆలోచనల్లో పడిపోయింది. రాము వంకాయలు తెచ్చాడు. నళిని వాటిని అందుకుని తరుగుతున్నది.

"అమ్మా! బాలమ్మకు చెప్పాను. వస్తానంది" అన్నాడు రవి

"సరే. కాళ్ళూ చేతులు కడుక్కుని చదువుకోండి" అన్నది నళిని.

పిల్లలిద్దరూ ఆ ప్రయత్నంలో పడ్డారు.

"నళినీ! మరి పిల్లలు ఎదిగి వస్తున్నారు. ఏంచేస్తావ్?"

"ఏముందీ చేసేందుకు? ఇలాగే జీవితం లాక్కురావాలి. ఈ మాత్రం అయినా ఆదరవు చిక్కినందుకు సంతోషంగా ఉంది. పిల్లలకు యస్. యస్. సి. దాకా చెప్పిస్తాను.''

ఇక విమల మాట్లాడలేదు. నళిని వంటప్రయత్నంలో పడిపోయింది. కొంత

సేపటికి బాలమ్మ వచ్చింది. నళిని ఒక సత్తుకేరేజీలో వంకాయకూరా, మజ్జిగ పెట్టి బాలమ్మను పంపించింది.

భోజనాలయ్యాక విమల మంచంమీద పడుకుంది. నళిని పిల్లలకు చదువుచెప్తూ ఉంది

విమల మనస్సంతా అల్లకల్లోలంగా అయింది.

తన తండ్రి జీతం ఇంటి ఖర్చులకు, సరీగా తింటే పదిహేను రోజులకురాదు. అరడజను మంది సంతానంలో తను పెద్దది. ఉద్యోగంచేసి కుటుంబాన్ని ఆదుకుంటానంటే ఒద్దంటాడు తన తండ్రి. పెండ్లిచేస్తానంటాడు. పోనీ, చేయగలడా? నాలుగువేలు చేతబట్టుకుని కూర్చుంటే పెండ్లి అవుతుందా? పాపం అవుతుందనే ఆయన ఆశ. ఎలా అవుతుంది? ఆఖరుకు నెలకు వంద రూపాయలు జీతం తీసే గోపీనాథ్ గూడా ఎం. ఎ. చదివాడు గనుక కట్నం పదివేలుతెమ్మంటాడేమో? ఒకవేళ గోపీనాథ్ కట్నం అడక్కపోయినా వాళ్ళమ్మ అడక్కుండా ఉంటుందా? పైగా నలుగురు చదువులేని చెల్లెళ్ళు.

తన తండ్రి పెండ్లిచేస్తాను, పెండ్లి చేస్తాను అంటాడు గానీ ఈ గోపీనాథ్ వంటి సంబంధమైనా తేగలడా? తెస్తే తను చేసుకుంటుందా ? చేసుకోక చేసేదేముంది? ఎన్నాళ్ళు ఈ వంద రూపాయల జీతంతో మోడుగా బ్రతుకగలదు తను?

అయితే తన తండ్రి తెచ్చే సంబంధం కంటే ఈ గోపీనాథే తనను ఇష్టపడితే కనీసం కట్నకానుకల బెడదైనా తప్పుతుంది. గోపీనాథ్‌ను పెండ్లి చేసుకుంటే, తనకు ఒరిగేదేమిటి? రెండొందల రూపాయలతో బ్రతకాలి; పైగా గోపీనాథ్ చెల్లెళ్లూ, అమ్మ!

ఛీ! ఏదైనా దరిద్రపు జీవితమే! ఎటు చూచినా మరో మార్గం లేదు. ఇంత విషం తింటే?...



## 5

గోపీనాథ్ బడిలో చేరి పదిరోజులు అయింది.

గోపీ వేకువ ఝామునే లేచి, కాలకృత్యాలు తీర్చుకొని ప్రొద్దుటికీ, మధ్యాహ్నానికీ అన్నం వండుకొని, పప్పు చేసుకొనే వాడు. తెల్లవారగనే వేడివేడి అన్నం, పచ్చడి, పప్పు, మజ్జిగతో అన్నం తినేవాడు. బాలమ్మ ప్రొద్దున్నే పెరుగు పోసే అమ్మిని మాట్లాడి పెట్టింది.

ఏడింటి నుండీ పదకొండింటి దాకా బడి చూచుకుని, గోపీ పన్నెండింటికి అన్నం తినేవాడు. ఆ తరువాత మళ్ళీ బడి పని చూసుకోవడం, రాత్రికి అన్నం తిని పడుకోవడం. మూడుపూటలాఅన్నం తినడంతో రాత్రిళ్ళు హాయిగా నిద్ర పట్టేది.

ఈ పదిరోజులలో గోపీలో నూతనోత్సాహం కలిగింది. దానికి తోడు, రోజూ విమల ఎదురుగా కూర్చొని పిచ్చాపాటి మాట్లాడ్డం ఉత్సాహాన్ని కలిగించింది. విమలతో మాట్లాడుతుంటే గోపీకి

క్రమంగా చనువు ఏర్పడింది. విమల గూడా హుషారుగా గోపీతో మాట్లాడు తున్నది.

రేపు సముద్ర స్నానానికి మన టీచర్లు అంతా వెళుతున్నారు. ఇందుమతి, సరోజ వాళ్ళ భర్తలూ పిల్లలతోటి వస్తు న్నారు. అంతా కలిసి వెళ్దాం అని నిర్ణ యించుకున్నాం! మీరూ వస్తారా?"

"ఓ యస్! తప్పకుండా. ఇంతకూ ప్రోగ్రాం ఏమిటి?"

"ఏముందీ ? తలా ఐదు రూపాయలు ఇచ్చుకోవాలి. బస్ ఛార్జీలు ఎవరివి వారే పెట్టుకోవాలి. రేపు సముద్ర తీరానికి వెళ్ళడం, స్నానం చేయడం. అక్కడి తోటలలో వండుకుని తినడం, సాయం కాలం దాకా కాలక్షేపం చేసి ఇంటికి చేరు కోవడం"

"ఐదు...రూపాయలా...?"

"ఇప్పుడు ఇవ్వనవసరం లేదు, అంద రికీ ఇందుమతి పెట్టుబడి పెడుతున్నది. జీతాలొచ్చినపుడు ఇవ్వొచ్చు! ఏంటి ? వస్తారా?"

"రమ్మంటావా?" అంటూ భావ గర్భి తంగా చూచాడు గోపీ విమల వంక. విమల చటుక్కున తలవంచుకొని నేల మీద గీతలు గీస్తున్నది సిగ్గుగా, "తప్పక వస్తాను విమలా" అన్నాడు గోపీ ఆవే శంగా.

విమల జవాబివ్వకుండా లేచింది. "రేయ్ పిల్లలూ! ఇక ఆటలు చాలించి బడికి బయలుదేరండి" అన్నది.

విమల, గోపీ పిల్లలను రెండు వరుస లుగా నిలిపి బడిదగ్గరకు తీసుకొని వచ్చారు! జట్లు, జట్లుగా విభజించి పిల్లలందర్నీ రిక్షాల్లో ఇండ్లకు పంపేశారు.



# 6

సముద్రం ఒడ్డుకు ఏడు గంటలకల్లా చేరారు కాన్వెంటు టీచర్లూ, వారి కుటుంబాలూ.

ఇందుమతి భర్త కొండల్రావు, సరోజ భర్త వేణు గుడ్డలువిప్పి డ్రాయ ర్లతో మొట్టమొదట సముద్రం దగ్గర కొచ్చారు. ముందు నీవు దిగు అంటే ముందు నీవు దిగు అని వాదించుకుంటు న్నారు ఇద్దరూ.

గోపీ డ్రాయర్‌తో సముద్రం దగ్గరి కొచ్చాడు. కొండల్రావూ, వేణూ ఇంకా వాదించుకుంటూనే ఉన్నారు.

గోపీ గుండెలలోతు నీళ్ళలో నిలబడి "వస్తారా ఇక్కడదాకా!" అన్నాడు. వేణు. కొండల్రావు 'రాం' అన్నట్లు చూశారు.

"గోపీనాథ్‌గారూ ! మీ వెనుక పెద్ద అల వస్తున్నది" అంటూ పెద్దగా కేక పెట్టాడు కొండల్రావు అడుగులు వెనక్కు వేస్తూ.

గోపీ చటుక్కున క్రీగంట తన వెనుక చిన్న సైజు పర్వతంలా లేచి మీదకు వస్తున్న అలను చూచాడు. మరు క్షణం వెల్లికిలాదూకాడు. వెంటనే అతని

దేహం దూలంలా నీటిమీద తేలియాడి తల, వక్షం, మోకాళ్ళు, పాదాలవేళ్ళు అందరికీ కనబడ్డాయి. గోపీనాధ్ దేహం అలతోపాటే పదడుగుల ఎత్తుకులేచింది. మరుక్షణం గోపీ ఒడ్డున ఉన్నవాళ్ళకు కనబడలేదు.

"గోపీనాధ్‌గారూ!"అన్న బ్రహ్మాండమైన కేక నళిని గొంతులోనుండి వెలువడింది. "గోపీగారూ! గోపీనాధ్‌గారూ" అని అంతా అరిచారు.

గోపీని వదిలిన అల మరుక్షణం నురగలు గ్రక్కుతూ మోకాళ్ళలోతులో ఉండి అరుస్తున్న కొండరావూ, వేణూల ముఖాల్ని భీషణంగా తాకింది. ఆ తాకుడుకు ఇద్దరూ గింగిరాలు తిరుగుతూ వెనుక నిల్చున్న పిల్లలమీద పడ్డారు. అంతా పల్టీలుగొట్టి నీళ్ళు త్రాగి ఒడ్డువైపు పరుగు లంకించుకున్నారు.

అల వెళ్ళిపోగానే దూరంగా గోపీనాధ్ కనిపించాడు. అంతా ఆశ్చర్యంగా గోపీని చూస్తున్నారు. గోపీ పద్మాసనం వేసుకొని నీళ్లమీద పడుకున్నాడు. అలలకు లేస్తూ, అల పోగానే కనబడకుండా పోతూ అలలమీద ఊయల ఊగుతున్నాడు.

దాంతో అందరికీ ధైర్యం కలిగింది.

"గోపీనాధ్‌కు చాలా ధైర్యం ఉన్నట్లుంది" అన్నది విమల చెంబుతో నీళ్ళను ముంచి భుజంమీదపోసుకుంటూ.

"ఏం ప్రాణాలకు తెచ్చుకుంటాడో ఖర్మ!" అన్నది నళిని.

"ఏం ఫరవాలేదులెండి, బాగా ఈత వచ్చినవాడిలాగా ఉన్నాడు" అన్నారు మిగతా ఆడవాళ్ళు.

నళిని అసహనంగా గోపీవంక చూచి పెద్ద గొంతుతో ఆర్డర్ వేస్తున్నట్లుగా హెడ్‌మిస్ట్రెస్ హోదాతో అన్నట్లుగా అన్నది.

"గోపీగారూ! వెంటనే ఒడ్డుకు వచ్చేయండి."

గోపీ నళిని మాటలను విన్నట్లుగా చెయ్యిపైకెత్తాడు. వెంటనే పద్మాసనంలా ఉన్న కాళ్లను విదలించి బోర్లాతిరిగాడు. అల తోసుకుంటూ గోపీనాధ్‌ను మోసుకొనివచ్చి ఆడవాళ్ళు స్నానంచేస్తున్న చోటుకు తెచ్చి పడేసింది.

ఆడవాళ్ళు గబగబా గుడ్డలను సవరించుకున్నారు.

గోపీనాధ్ లేచి. ఒడ్డు వైపుగా నడిచి తుండు గుడ్డ తీసి తలతుడుచు కుంటున్నాడు.

"రవీ! రామూ!" నళిని వేసిన బ్రహ్మాండమైన కేక విని గోపీనాధ్ ఉలిక్కి పడ్డాడు. ఆ కేక వెంటనే "అయ్యో! అయ్యో!" అన్న కేకలు వినబడ్డాయి.

గోపీనాధ్ తుండు గుడ్డను తల మీద నుండి తీసి సముద్రంలోకి చూశాడు. కొండరావూ, వేణూ మిగతా పిల్లలూ ఒడ్డువైపు సంభ్రమంగా పరుగిడుతున్నారు. "అన్నయ్యా! అన్నయ్యా!" అంటూ-రామూ - కాబోలు సముద్రంలోకి వెళ్తున్నాడు. అలా వెళ్తుండే రామూను, ఒక పెద్ద నురుగులు కక్కే అల ముంచి పారేసింది. ఆ అల దెబ్బకు, రామూ కాళ్లూ, తలా గిర్కీలుకొట్టాయి. అల వెళ్ళి పోగానే దూరంగా లోపలికి పోయే నీళ్ళలో ఒక తల, కొట్టుకుంటున్న చేతులూ సముద్రం లోపలికి పోతూ కని

పించాయి.

ఈ దృశ్యాన్ని చూచిన వెంటనే గోపీ నాథ్ అతి వేగంగా సముద్రం వైపు పరుగెత్తాడు. అడ్డం వచ్చిన అలలోకి బాణంలా డైవ్ చేస్తూ క్షణంలో— ముందుకు వెళ్ళడానికి ప్రయత్నించే రామూను చంక సందున ఇరికించు కున్నాడు. వాడ్ని లాక్కొచ్చి నడుముల లోతున నిలబెట్టాడు. రామూ ఒడ్డుకేసి పరుగెట్టాడు. గోపీ మళ్ళీ సముద్రంలోకి దూసుకెళ్ళాడు. లోపలికి లోపలికి వెళ్ళి పోయే రవి జుట్టుపట్టుకొని ఆపాడు ఇందాకటి అల లాంటి ఒక పెద్ద అలను చూచుకొని ఆ అలను దాటి పోనివ్వక రవిని ఒకచేత పట్టుకొని ఈదుతూ, అల కంటే ముందొచ్చి ఒడ్డునపడ్డాడు కొండల్రావు, వేణూ, నళినిలు మోకా ళ్ళలోతుకు ఎదురొచ్చి, రవిని పట్టు కున్నారు. కొండల్రావూ వేణూని రవిని, మోసుకొచ్చి ఒడ్డుమీది ఇసుక పైన పడుకోపెట్టారు.

మూర్ఛపోయిన రవిని చూచి నళిని అతని మీద పడి గోడుగోడున పెద్ద పెట్టున ఏడ్వ సాగింది. గోపీ నీళ్ళల్లో నుండి, నీరసంగా లేచి నళిని దగ్గరకొచ్చి, నళినిని అడ్డం లెమ్మని రవిని బోర్లాపడుకోబెట్టాడు. తలను ఒకవైపు త్రిప్పి, బుగ్గలు నొక్కి నోటిని బలవంతంగా తెరిచి రవి నోట్లో ఉన్న నాలుకను నోటి బయటకు లాగాడు. ఆ నాలుక జారి పోకుండా పట్టుకోమనగానే కొండల్రావు ఆ నాలు కను పట్టుకున్నాడు. గోపీ, రవి వీపుమీద చేతులుపెట్టి బలంగానొక్కగా రవి ముక్కు వెంటా, నోటి వెంటా నీళ్ళు బాగాపోయాయి. అలా ఐదు నిముషాలు చేశాక గోపీ ఆపాడు. రవి స్వతంత్రంగా గాలి పీల్చుకుంటున్నాడు.

అప్పుడు లేచాడు గోపీ రవి మీద నుండి.

కొద్ది సేపటికి రవి బోర్లపడుకున్న వాడల్లా వెల్లికిలా తిరిగాడు.

మరో ఐదు నిమిషాలకల్లా "అమ్మా" అంటూ లేచి బిత్తరబిత్తరగా అందరి వైపూ చూచాడు.

నళిని ఏడుస్తూ రవిని కౌగిలించు కొంది.

గోపీనాథ్ ఫ్లాస్కులోని కాఫీ గ్లాసులో పోసి నళిని కందించి, "రవికి ఇవ్వండి" అన్నాడు.

నళిని రవికి నెమ్మదిగా పట్టింది.

రవి కాఫీ త్రాగి దగ్గుతూ, తుమ్ముతూ లేచి నిల్చున్నాడు.

ఇద్దరి బిడ్డలను చెరో చేతి క్రింద ఉంచుకొని "గోపీనాథ్‌గారూ! మీమేలు జన్మ, జన్మలకూ మరువను! ఈ రోజున మీరు మూడు ప్రాణాలను కాపాడారు!" అన్నది.

గోపీ చిత్రంగా చూచాడు నళిని వంక.

నళిని తలవంచుకొని అన్నది. "నా బిడ్డ లిద్దరూ సముద్రంలో నుండి వెలు పలికి రాకపోయినట్లైతే... నేనూ... ఈ సముద్రంలో పడి ఉండేదాన్ని!"

వాతావరణం భారంగా అయ్యేప్పటికే అంతా మౌనంగా ఇసుకలో నడిచి అర మైలు దూరంలో ఉన్న మామిడి తోట లోకి చేరారు.

తోటలోకి ప్రవేశించగానే కొండ ల్రావు అందర్నీ ఉద్దేశించి అన్నాడు.

"ఏంటి ? అంతా ఆముదం త్రాగినట్లు డల్‌గా ఉన్నారు ? జరిగిందేదో మంచే జరిగింది. ప్రమాదం తప్పిపోయింది ! హాయిగా ఎంజాయ్ చేద్దాం !"

దాంతో పార్టీలో చైతన్యం వచ్చింది. ఆడవాళ్ళంతా హడావిడిగా వంట ప్రయత్నాలు మొదలెట్టారు. కొండ రావూ, వేణూ, గోపీలు ఒక మామిడి చెట్టుకింద చేరి పేకాట మొదలెట్టారు. చిన్న పిల్లలంతా, ఆటలలో పడ్డారు. రవి మాత్రం పిల్లలతో ఆడకుండా, దూరంగ కూర్చుని ఆటలను గమనిస్తున్నాడు.

విమల నడుమ నడుమ గోపీ వంక చూస్తున్నది. గోపీ గూడా విమలను చూస్తున్నాడు. ఇందాక సముద్రం దగ్గర జరిగిన సంఘటన తరువాత విమలలో చాలా మార్పు వచ్చినట్లు గమనించాడు గోపీ. విమల దృక్కులలో తనంటే గౌరవం ఆరాధనా కనబడ్డాయి.

పన్నెండింటికల్లా మగవాళ్లూ, పిల్లలూ "ఆకలి ! ఆకలి !" అంటూ గలభా మొదలెట్టారు. వంటతో నళిని, సరోజ, కనకాలు సతమతమౌతున్నారు.

ఆఖరుకు ఒంటిగంటకల్లా నళిని, సరోజ, కనకం తప్ప అంతా భోజనాలకు కూర్చున్నారు. రకరకాల హాస్యాలతో, చమత్కారాలతో భోజనాలు పూర్తిచేశారు.

భోజనాలవగానే గోపీ, విమలతో రహస్యంగా "అలా తిరిగొద్దాం ! రాగూడదు ?" అన్నాడు.

విమల గోపీ మాటలను విననట్లే ఉంది.

కొంచంసేపుండి గోపీ చిరాకుగా తోటలోకి బయలుదేరాడు.



**7**

గోపీ మర్రిచెట్టు క్రింద చల్లగా, ప్రశాంతంగా ఉన్న వాతావరణాన్ని గమనిస్తూ కూర్చున్నాడు.

ఈరోజు ఎందుకనో తన మనస్సు సముద్రం వలెనే ఉరకలు వేస్తున్నది. విమల! ఎంత అందంగా కనబడ్డది ఈ రోజున? గత రెండు, మూడు రోజులుగా విమల తనను ప్రత్యేకంగా చూస్తున్నట్లనిపించింది. ఈరోజు మట్టుకు విమల, తనను ప్రేమగా చూచింది; బహుశః తన సాహసం ఆమె హృదయాన్ని చూరగొన్నదేమో? అలా తిరిగొద్దాం! రమ్మంటే లెక్క లేనట్లుగా చూచింది! ఒక్కసారి విమల ఇక్కడికొస్తే ఎంత బావుండును ?

విమల కోసం చుట్టూరా చూశాడు గోపీ. విమల జాడలు కనపడక పోవడంతో కోపంగా తన చుట్టూ మొలిచిన గడ్డిని పీకుతున్నాడు.

ఒక పావుగంట గడిచాక గాజుల సవ్వడి విని గోపీ ఉలిక్కిపడి తలెత్తి చూశాడు. ఎదురుగా విమల నిలబడి ఉంది. గోపీ గుండె తీవ్రంగా కొట్టుకుంది. ఒక్క క్షణం ఎదురుగా వున్న విమల, మర్రి చెట్టూ, దాని క్రింద ఉన్న దొరువూ అన్నీ అబద్ధమేమోనన్న భావం కలిగింది గోపీలో.




తనను చూచి గూడా అలా స్తబ్దుగా గోపీ ఎందుకు ఉన్నాడో అంతుబట్టక విమల అన్నది "ఎందుకు రమ్మన్నారు?"

ఆ మాటలతో గోపీలోని జడత్వం వదిలింది. చివాలున లేచి మెరుపు లాగా విమల దగ్గరి కెళ్ళి విమల చేతిని పట్టుకున్నాడు.

విమల ఒళ్ళు జలదరించింది. గోపీ పట్టుకున్న చేతిని వదిలించు కుందాం, అన్న భావన కలిగినా ఆ భావం క్రియా రూపంలో పరిణమించక హృదయంలో పెరుగుతున్న ఆవేశం ముందు ఆవిరై పోయింది.

గోపీ, విమల చేతిని పట్టుకొని నడిపించుకుంటూ చెట్టు క్రిందకు తీసుకొని వచ్చాడు.

"కూర్చో... విమలా!..."

విమల మంత్రముగ్ధవలె కూర్చుంది. గోపీ ప్రక్కనే కూర్చుని ఆమె భుజం మీద చేయి వేశాడు. విమలకు ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఎక్కువయ్యాయి. గుండె అతివేగంగా కొట్టుకుంటున్నది. వక్షం ఎగిరెగిరి పడుతున్నది. గోపీ మెల్లగా విమలను తన ఒళ్లోకి లాక్కున్నాడు. విమల ప్రాణంలేని బొమ్మలాగా గోపీ ఒడిలోకి వాలిపోయి గోపీ ముఖాన్ని చూస్తున్నది గోపీ విమలను ముద్దు పెట్టుకున్నాడు. విమల దేహం వణికి పోయింది.

అలా ఓ ఐదు నిమిషాలు ఇద్దరూ

ఆలింగనం చేసుకున్నారు. గోపీ విమల పైటను తొలగించి రవికె హుక్సును తప్పించడానికి శ్రమ పడుతున్నాడు.

"నాకు భయంగా ఉంది" అన్నది విమల.

"నాకూ... అలాగే... ఉంది!" అన్నాడు గోపీ.

అయినా ఇద్దరికీ ప్రథమానుభవం అవడంతో ఆవేశం తప్ప మరేమీ కనిపించ లేదు.

అరగంట అయ్యాక ఇద్దరిలోనూ ఆవేశం చల్లారింది. గోపీ తప్పు చేసిన వాడిలా తలవంచుకుని కూర్చున్నాడు. విమల ఎక్కిళ్ళు పెట్టి ఏడుస్తున్నది. ఆమెదేహం, మనస్సూ పచ్చి పుండులా సలుపు తున్నది.

"ఏమండీ! నన్ను రేపు ఉదయమే పెండ్లి చేసుకోండి!"

"పెండ్లా?!"

"ఏం? పెళ్ళి చేసుకుందామని అనుకోనివారు నన్నిక్కడికి ఎందుకు పిల్చారు?"

"సా... రీ...! విమలా! నా పరిస్థితులు నీకు తెలుసు! చెల్లెళ్ళూ, అమ్మా ఉన్నారు... సరైన ఉద్యోగం లేదు.. మళ్ళీ...! ఏదైనా... బ్యాంక్‌లో ఉద్యోగానికి అప్లై చేద్దామను కుంటున్నాను. ఉద్యోగం... వచ్చాక..."

విమల వెక్కిళ్ళు పెడుతూ ఏడ్చింది. ఆమెకు ఉక్రోషం వచ్చింది. తనేదో బంగారు కొండను త్రవ్వి గోపికి ఇచ్చినట్లుగా భావించింది. అలాగే గోపీ కూడా ఈ ప్రథమానుభవాన్ని ఎటూ అంచనా వేసుకోలేక పోయాడు. ఇది ఆనందమా? ఆవేశమా? బాధా? సుఖమా? తేలలేదు గోపీకి. ప్రథమానుభవాన్ని గురించిన వర్ణనలను నవలలో చదివాడు. సినిమాలలో చూశాడు. దానిని గురించి కొన్ని అభిప్రాయాలను ఏర్పరచు కున్నాడు. కానీ నేటి అనుభవం తను ఊహించిన ఊహలకు అసలు సరిపో లేదు. ఏదో ఎటూ తేలని అనుభూతిలా హఠాత్తుగా నూట ఆరు డిగ్రీల జ్వరం దేహాన్ని ఊపిపారేసి, హఠాత్తుగా మాయం అయినట్లు అన్పించింది.

"ఏంటి? సమాధానం చెప్పరు?"

"చెప్పాను గదా! విమలా! మంచి ఉద్యోగం చూసుకోనీ, ఆ తరువాత తప్పక పెండ్లి చేసుకుంటాను!"

గోపీ అలా నిమ్మకు నీరెత్తినట్లు మాట్లాడగానే విమల రెచ్చి పోయింది.

"హుఁ! నాకు తెలుసు! నీవూ అందరి మగాళ్ళలాటి దుష్టుడవే! ఏరు దాటి తెప్ప తగలెయ్యడం మీ మగజాతి లక్షణం! నీవేదో ఒక పెద్ద మహావీరుడవని భ్రమించాను. ఛీ! ఛీ! సముద్రంలో నుండి ఇద్దరినీ బయటకు తీసినంత మాత్రాన ధైర్యవంతుడివి అవుతావా! నీవూ అందరిలాగా దుర్మార్గుడివి. నన్ను పాడుచేసి తప్పుకో దల్చుకున్నావ్!" అంటూ భోరున ఏడ్చింది విమల.

"నా మాట విను విమలా నిన్ను పెండ్లి చేసుకోను అని అనలేదు గదా! కాస్త ఆగు! కొంచెం ఊపిరి సలుపు కోనివ్వు, ఉద్యోగం రాగానే..."

విమల చీత్కారం చేస్తూ లేచి నిల బడింది. గోపీ ఆమె చేతులను పట్టుకొని ప్రాధేయ పడుతున్నాడు. విమల గోపీ చేతులను విదిలించి పారేసి పెద్ద అంగలతో ఏడుస్తూ వెళ్ళిపోతున్నది.

"విమలా!..."

"ఇంకా ఏం మాట్లాడాలి? చేసింది చాలదూ?"

"నా మాట...విను విమలా! ఉద్యోగం వచ్చేదాకా ఆగు! అప్పటి దాకా ప్రేమికులుగా ఉందాం!"

"ఈ కల్ల బొల్లి మాటలకు నేను లొంగను. ఎందుకు, ఇంకా కొంతకాలం ప్రేమ - పేరు జెప్పి వాడుకుందామను కున్నారా? మీకు ఇన్నాళ్లూ రాని ఉద్యోగం ఇక వచ్చేనా?" అంటూ ఏడుస్తూ చెకచెకా నడిచి వెళ్ళిపోయింది విమల.

గోపీ దిగ్భ్రాంతుడై అలాగే చెట్టు క్రింద నిలబడ్డాడు.

విమల అలా గోపీతో తగూలాడి తోటలోకివచ్చేసిన తరవాత ఒకగంటకు, గోపీ తోటకు చేరాడు. విమల గోపీ వంక కన్నెత్తి చూడలేదు. తిరుగు ప్రయాణంలో గోపీ ఒకటి రెండు సార్లు చనువుగా విమలతో మాట్లాడడానికి ప్రయత్నించినా విమల గోపీని ఖాతరు చేయలేదు.

ఇంటికి రాగానే విమల మంచం మీద ముసుగు తన్నుకుని పడుకుంది తల నొప్పి అంటూ.

నళిని 'కాఫీ, టాబ్లెట్ అంటూ' హడావిడి చేసింది. తనక్షేం అవసరం లేదని మొరటుగా సమాధానం చెప్పింది విమల. నళిని కొద్దిగా చిన్న బుచ్చుకున్నా అనర్గళంగా గోపీనాధ్ గురించే మాట్లాడుతున్నది.

"నీవు గోపీగార్ని గూడా రమ్మందాం? అని అనకపోతే?, గోపీగారు ఈ రోజు పిక్నిక్‌కు రాకుంటే?... ఆ సముద్రంలో నా బిడ్డలు!...గోపీగారు నిజంగాదేవుడు. నన్ను గర్భశోకం నుండి రక్షించిన అవతార పురుషుడు! ప్రతిరోజూ వారి పేరు తల్చుకొని దీపారాధన చేసుకున్నా నా రుణం తీరదు..."

"అబ్బా! నళినీ! అలాగే ఆ మహాపురుషుణ్ని ఆరాధించుకో! నా తల బద్దలై పోతున్నది! కాస్త విశ్రాంతిగా పడుకోనీ తల్లీ" అన్నది.

నళిని చిన్న బుచ్చుకుంది. అయినా ఆతృతగా విమల నుదుటిపై చేయివేసి చూచి ఏం ఫర్వాలేదు! జ్వరం లేదు! అని తృప్తి పడింది.

విమల గోడవైపుగా తిరిగి పడుకున్నది. ఆమె హృదయంలో భావ తరంగాలు సురుగులు గక్కుతూ సముద్రానికి మించి ఘోష పెడుతున్నాయి.

గోపీ మహాపురుషుడా? తనూ ఇలాటి భ్రమలో పడింది. ఏ పల్లె వాడైనా, అక్కడుంటే రవీ, రాములను రక్షించ లేడా?మరి ఈయన గొప్పతనం ఏమిటి? వంద రూపాయల సంపాదన గూడా లేదు. దానికి తగ్గట్లు నలుగురు చెల్లెళ్లూ, అమ్మా. అసలు ఈయనకు పిల్లనిస్తానని వచ్చే దౌర్భాగ్యుడుంటాడా? తనుగాబట్టి సిగ్గు విడిచి, పెండ్లి చేసుకోమని అడిగింది.దానికి ఆయన సమాధానం ఏమిటి? అసలు తను పెండ్లి చేసుకోమని అడగ్గానే ఎగిరి గంతువేయాలి? 'అలాగే మై డియర్' అంటూ తన్ను కౌగిట చేర్చుకోవాలి కానీ గోపీ చేసిందేమిటి? సారీ అంటాడా? సారీ అట. తనను చెప్పు తీసుకొని కొట్టినట్లైంది ఆ మాటతో.

ఛీ! ఛీ! ఇక వీడి ముఖం చూడ గూడదు!



# 8

మరునాడు బడిలో గోపీ చాలా రిజర్వ్‌డుగా కనబడ్డాడు.

విమల గూడా ఒక్కసారయినా గోపీ వంక కన్నెత్తి చూడలేదు.

రెండురోజులపాటు పెదవి బిగింపుగా ఉన్నాడు గోపీ. అనుక్షణం ఎదురు చూచాడు. విమల వచ్చి 'క్షమించండి ఆవేశంతో ఏదో వాగాను' అంటుందనుకున్నాడు. అలా అనగానే భవిష్యత్తును గురించి ఆమెకు నచ్చ చెప్పాలనుకున్నాడు. తనైనా, విమలను అన్యాయం చెయ్యాలని ఎప్పుడూ అనుకోలేదు. ఇంతవరకు మొదటి నెలజీతం అయినా తీసుకోలేదు. ఇంటి దగ్గర అమ్మా చెల్లెండ్లు తిండికి అవస్థ పడుతున్నారు. ఇంత తొందర్లోనే పెండ్లి చేసుకొని ఏం చేయాలి? పెండ్లి చేసుకోవాలంటే కనీసం వంద రూపాయలైనా చేతిలో ఉండొద్దా?

ఇలా అనుకుంటూ రెండు రోజులు విమల రాజీ పడుతుందేమోనని ఎదురు చూచాడు గోపీ. విమలలో అలాటి లక్షణాలేవీ కనబడలేదు గోపీకి.

మూడో రోజున తనే సమాధానపడి ప్రొద్దుటి బడి వదలగానే విమలతో మాట్లాడబోయాడు.

"విమలా!..." అన్నాడు గోపీ.

విమల నిప్పులు గ్రక్కే కండ్లతో చూచింది గోపీ వంక.

గోపీకి ఒళ్ళుమండి పోతుండే విమల సమాధానం చెప్పకుండా నళిని రూం దగ్గర కెళ్ళింది. గోపీ ఆమె వెనక నళిని రూం దగ్గరకు చేరాడు.

సరీగా అదే సమయంలో ఓ పాతికేళ్ళ యువకుడు వచ్చి నేరుగా నళిని రూంలోకెళ్ళి నిలబడ్డాడు. నళినీ, టీచర్లూ అంతా సంభ్రమంగా లేచి నిలబడ్డారు. నళిని తను కూర్చుని ఉన్న సీట్‌ను ఆ కుర్రవానికి చూపింది.

ఆ కుర్రవాడు దర్పంగా నళిని కుర్చీలో కూర్చున్నాడు.

గోపీ ఆ కుర్రవాణి ఆశ్చర్యంగా చూస్తూ ప్రక్కన ఉన్నవాళ్లతో రహస్యంగా "ఎవరు?" అని అడిగాడు

"వీరయ్య గారి అబ్బాయి అమర్‌నాథ్"

గోపీ అమర్‌నాథ్ వంక ఆశ్చర్యంగా చూచాడు.

అమర్‌నాథ్ రంగురంగుల పూల టెరిలీన్ షర్ట్ వేసుకొన్నాడు. స్ట్రెచ్‌లాన్ పాంటూ, ఫుల్ బూట్‌నూ ధరించాడు. చేతికి బంగారు స్ట్రాప్‌తో వాచీ, వ్రేళ్లకు ఉంగరాలున్నాయి. మెడలో సన్నని బంగారు గొలుసు. తలంతా గుబురుగా పెరిగి ఉన్నది. సన్నటి మీసం దర్పాన్ని తెలుపుతున్నది. ఒక చేతిలో స్టెయిన్‌లెస్‌స్టీల్ గాగుల్సున్నాయి. మరో చేతిలో ఓ తెలుగు నవల ఉంది.

అమర్‌నాథ్ గాగుల్సును షర్టుకు విలాసంగా తగిలించి ఏమేమిటో మాట్లాడుతున్నాడు. అతని మాటలకు

అంతా వినయంగా సమాధానం చెబుతున్నారు. ఆఖరుకు అమర్‌నాథ్ తన చేతిలోని నవలను అందరికీ చూపుతూ "ఇది చదివారా" అన్నాడు.

ఎవ్వరూ చదవలేదన్నారు.

"ఈ నవలను రాసింది మా బంధువు. నిన్ననే రిలీజ్ అయింది. దీన్ని చదివి మీ అభిప్రాయాన్ని చెప్పాలి" అని విమల వంక ప్రత్యేకంగా చూచి "తీసుకోండి" అంటూ నవలను విమలకు ఇచ్చాడు.

విమల నవలను సంభ్రమంగా అందుకుంది.

"ఈ నవలను చదివి మీ అభిప్రాయం చెప్పాలి" అన్నాడు అమర్‌నాథ్. విమల సిగ్గుతో, నవలను పట్టుకొని తలవంచుకొని "అలాగేనండీ" అన్నది. వచ్చిన పని అయిపోయినట్లుగా అమర్‌నాథ్ వెళ్ళిపోయాడు.

అతడు వెళ్ళిపోగానే అందరూ తలో మాట అన్నారు

"విలాస పురుషుడు"

"డబ్బు విచ్చలవిడిగా ఖర్చు పెడతాడు"

"ప్రొద్దుగూకులూ కార్లోనే షికార్లు"

మధ్యాహ్నం క్లాసులో విమల సరిగా పాఠాలు చెప్పలేదు. నవలను చదువుతున్నది. నవల చదువుతూంటే విమల ముఖం సంతోషంతో వెలిగిపోయింది.

గోపీకి ఉత్సాహం పుట్టి ఆ నవలను అడుగుదామనుకున్నాడు. కానీ విమల గోపీవంక చూచినప్పుడల్లా ముఖం మొటమొట లాడించేది. విమల చదవడం అయ్యాక ఆమే నవలను ఇంకెవరికైనా ఇస్తుంది గదా అప్పుడు వాళ్ళనే అడుగుదాం అనుకున్నాడు గోపీ.

మరుసటి రోజున విమలకు ఒక కవర్ వచ్చింది. విమల కవర్‌ను అందుకున్నది మొదలు గోపీ విమలనే పరిశీలిస్తున్నాడు.

విమల కవర్ విప్పి లోని కాగితాన్ని తీసి ఒక్కసారి చూచి గతుక్కుమన్నది చుట్టూరా భయంగా చూసి కుర్చీలో కూర్చుని చదువుకున్నది. కాగితాన్ని కవర్‌లో పెట్టి ఆలోచనలోపడ్డది మళ్ళీ కవర్‌లోని కాగితాన్ని చూచింది. మళ్ళీ కవర్‌లో పెట్టింది.

విషయం ఏమిటో అర్థంగాక గోపీ ఆతృతగా అడిగాడు.

"విమలా! కవర్ ఎక్కణ్ణుంచి?" అని.

విమల గోపీ వంక కొరకొర చూచి చూపులు త్రిప్పుకుంది.

"ఇంటినుంచా?" అని గోపీ మళ్ళీ అడిగాడు.

విమల తలఎత్తి గోపీని చూడలేదు జవాబు చెప్పలేదు.

"కొంపదీసి నీకు పెండ్లి సంబంధం కాని కుదిరిందా?" అని దాదాపు ఏడుపు ముఖం పెట్టుకుని అడిగాడు గోపీ.

విమల ఛర్రున లేచింది. గోపీ వంక కండ్లతో నిప్పులు కురిపించింది. కవర్ తీసి పుస్తకంలో పెట్టుకొని చరచరా క్లాసులో నుండి బయటకు నడిచింది.

అరగంట తరువాత కనకం వచ్చి విమల క్లాసులో కూర్చున్నది.

"విమల రాలేదేం?" అని అడిగాడు గోపీ కనకాన్ని ఆశ్చర్యంగా చూస్తూ.

"విమలను నా క్లాసుకు వేసి, నన్ను ఈ క్లాసుకు వేసింది హెడ్‌మిస్ట్రెస్." అన్నది కనకం.



# 9

నళిని, విమల ఉండే గదికి అద్దె ఇరవై రూపాయలు. విమల కాన్వెంటు ఉద్యోగంలో చేరిన క్రొత్తలో రూం దొరికేదాకా నళిని గదిలో ఉంటానంది. ఆ తరువాత విమలకు సరైన గది దొరక్క పోవడంతో నళినిదగ్గరే ఉంటానంది. నెలకు అరవై రూపాయలు నళినికి ఇస్తానంది.

నళిని గూడా సంతోషంగా అంగీకరించింది. ఉదయంపూట వంటా, వార్పూ విమల తీసుకుంది. సాయంకాలం డ్యూటీ నళినిది. ఇలా కలిసి ఉండడం ఉభయులకూ లాభసాటిగా, హాయిగా ఉంది.

నళిని వంటచేస్తూ విమలను అడిగింది.

"విమలా! ఏంటి ఈ రోజు, ఇంత హఠాత్తుగా క్లాసు మార్పించాలని పట్టు బట్టావు?"

"......"

విమల మ్యాగజైన్ చూస్తూ కూర్చుంది.

"గోపీనాధ్‌గారు ... నిన్నేమైనా ... అన్నారా?"

"అలాంటి దేమీ లేదు."

నళిని ఎన్నిసార్లు అడిగినా విమల ఇలాగే సమాధానం చెప్పింది. నళినికి విమల ప్రవర్తన బొత్తిగా అర్థంకాలేదు. పిక్‌నిక్‌కు వెళ్ళేదాకా విమల గోపీనాధ్ అంటే చాలా ఇష్టంగా మాట్లాడింది. వారిద్దరూ పరస్పరం ఆకర్షింపబడుతున్నారని ఊహించి ఈడూ, జోడూ అవుతారని అనుకుంది మొత్తానికి ఏదో జరిగింది. అదికూడా తోటలోనే జరిగి ఉండాలి. గోపీనాధ్ ఒంటరిగా వెళ్ళడం, ఆ తరువాత విమల వెళ్ళిపోవడం అంతా గమనించారు.

అక్కడే ఏదో జరిగింది. ఏంజరిగి ఉంటుంది? గోపీ అసభ్యంగా ప్రవర్తించాడా?

విమల ఆలోచనలు మరో మార్గంలో నడుస్తున్నాయి. అమర్‌నాధ్! ఎంత చక్కటి పేరు? ఎంత అందగాడు? ఎంత బలిష్టంగా ఉంటాడు! అసలు అతడు తనలాటి వారిని పలుకరిస్తాడని తను ఊహించిందా?

అతడు తనను చూచిన చూపు పంచయం ఉన్న అంతమందినీ వదిలి తనకే ప్రత్యేకంగా నవలను ఇవ్వడంలోని విశేషం, ఏంటో అర్థంగాక నిన్న అంతా బుర్ర బ్రద్దలుకొట్టుకుంది. ఆ నవలను హడావిడిగా అటూఇటూ చూచింది అందులో ఏమైనా...జాబు ... లాంటిది ఉందేమోనని. ఏదీ కనబడక పోవడంతో తను సిగ్గుతో చితకిపోయింది.

ఆ నవలలోని ప్రత్యేకత ఏంటా అని రాత్రంతా చదివింది.

కథ సామాన్యంగానే తోచింది. ఒక పిల్ల ఉంటుంది. చాలా పేదది. అవివాహిత. ప్రైవేట్లు చెప్పుకుని బ్రతుకుతుంటుంది. ఆ పిల్లను ఒక ధనికుడు ప్రేమిస్తాడు ఆ పిల్ల ఆ ధనికుని ప్రేమను మొదట్లో అంగీకరించదు. ఆ ధనికుడు చతుర

ఆమెను వెంటాడుతాడు. బ్రతిమలాడు తాడు, ప్రాధేయపడుతాడు. చివరకు గడ్డాలూ, మీసాలూ పెంచుకొని విషాద యోగంలో పడిపోతాడు. అప్పుడు ఆ పిల్ల అతన్ని కరుణిస్తుంది. కథ సుఖాంతం అవుతుంది. ఆ కథచదివినంతసేపూ కథానాయిక మూర్ఖత్వానికి తనకు భలేకోపం వచ్చింది. అంత ఇదిగా తన ప్రేమను వెల్లడించుకొనే కథానాయకుడిని అన్ని తిప్పలు పెట్టడం అన్యాయం:

'ఈ రోజు అమర్‌నాథ్ తనకు ప్రేమ లేఖ వ్రాశాడు. ఆ లేఖను అనేకసార్లు చదివింది. కంఠస్థం అయిపోయింది. ఎంత అందంగా,సున్నితంగా వ్రాశాడు'

అమర్ అలాంటి నవలను ఇవ్వడంలో ఉద్దేశ్యం! ఇప్పుడు అర్థమయింది. అతను రాసినట్లు తను ఈరోజు శివాలయానికి పోవాలా వద్దా అని కొట్టుమిట్టాడింది. ఆఖరుకు పోకుండా ఉండాలనే నిర్ణయించుకుంది అవును! అడగంగానే వెళ్తే లోకువ అవుతుంది

అమర్ దృష్టి తన మీద పడడం నిజంగా అదృష్టం. అమర్‌కు తన మీద గల ప్రేమ నిజమే అయితే తను ఎంతో అదృష్టవంతురాలు.

గోపీకి ప్రేమించడం తెలియదు. స్త్రీ మనస్సును అర్థంచేసుకోలేడు. ఒక్క ప్రేమ మాటా లేదు, పలుకూ లేదు ఏకాంతంగా చిక్కగానే తనను మోసంచేశాడు అతడంతడతను పెండ్లి సంగతి ఎత్తలేదు. పైగా తనే పెండ్లి చేసుకోమని అర్థిస్తే ఎంతలెక్క లేకుండా మాట్లాడాడు! ఛీ! ఛీ! గోపీతోటి తన బుద్ధి తక్కువ పని ఒక పీడకల!

ఇన్నాళ్ళూ ఎంతో జాగ్రత్తగా ఉన్న తను గోపీ చేతిలో ఎంత సులభంగా మోసపోయింది? గోపీతోటి తన అనుభవం ఒక పీడకల. మర్చిపోవాలి. తప్పదు.

కానీ ఈ అమర్. ఇతనూ మగవాడే అమర్‌తో తను జాగ్రత్తగా ఉండాలి! పెళ్ళి అయ్యేదాకా ముట్టుకోనివ్వగూడదు.

ఇలా అనుకుంటూ, రాత్రి చాలా పొద్దుపోయాక విమల నిద్ర పోయింది.



# 10

ఆ రోజున కాన్వెంటులో జీతాలు ఇస్తారు

పదకొండింటికల్లా పిల్లలను పంపేసి టీచర్లంతా నళిని రూంలో సమావేశం అయ్యారు. కొంత సేపటికి వీరయ్య గుమస్తా సోమయ్య ఒక మనీ బాగ్ పట్టుకొచ్చాడు.

నళిని లేచి సోమయ్యకు తన కుర్చీ ఇచ్చింది. టీచర్లు అంతా నళిని గదిలో నుండి బయటకు నడిచారు. ఆ తరువాత సోమయ్య ఒక్కో టీచర్‌నూ వరుసగా పిల్చాడు ఒక్కో టీచర్ లోపలికెళ్ళి ఒక కవరును పట్టుకొని బయటకు వచ్చారు.

సోమయ్య గోపీనాథ్ పేరును గూడా పిల్చాడు.

గోపీనాథ్ లోపలి కెళ్ళాడు.

సోమయ్య ఒక రిజిష్టర్‌ను గోపీ



ముందుకు త్రోసి సంతకం పెట్టమన్నాడు ఒక కవర్‌ను గోపీ చేతిలో పెడ్తూ.

గోపి కవర్లోని డబ్బును లెక్కపెట్టుకుంటున్నాడు.

"ఎనభై రూపాయలే ఉన్నాయేంటండీ!"

"ఎనభై గాక ఎంతుంటుందనుకున్నావ్ ?"

"నాకు నెల జీతం ఎంత ?"

"వంద!"

"వందరూపాయలా ?" తెలీనట్లు అన్నాడు గోపీ.

"అవును."

"వందరూపాయలతో ఎలా బ్రతకాలి సార్!"

"చాలా మంది ఇంకా తక్కువతే బ్రతుకుతున్నారు. నీ జీతం నెలకు వంద. నీవు పని చేసింది ఇరవై ఐదు రోజులు. కనక నీ జీతం ఎనభై నాలుగు అవుతుంది. అందులో గుమాస్తా మామూలు నాలుగు రూపాయలే మినహాయించుకున్నాను. అందరి దగ్గరా ఐదు మినహాయించుకుంటాను. పూర్తి జీతం నీకు చాలేదని నాలుగే మినహాయించుకున్నాను. ఊఁ. సంతకం పెట్టు!"

గోపీనాథ్ రిజిష్టర్ పంక చూచి అన్నాడు. "ఈ రిజిష్టర్లో పేర్లూ సంతకాలే ఉన్నాయి. ఎవరికెంత ఇచ్చారో వ్రాయరేం ?"

"అబ్బాయీ! నీవు చాలా అనవసరపు ప్రశ్నలు వేస్తున్నావు! అందరి లాగా

ఇచ్చింది తీసుకొని చెప్పినచోట సంతకం పెట్టు. లేకుంటే సంచీ సర్దుకుని మీ ఊరెళ్ళిపో" అన్నాడు సోమయ్య కటువుగా.

గోపీనాథ్ పొంగి వచ్చే క్రోధాన్ని దిగమింగు కున్నాడు. సంతకం పెట్టడానికి రిజిష్టర్ దగ్గర కొచ్చి సంతకం పెట్టబోయి వెనక పేజీలను త్రిప్పి చూడబోయాడు. సోమయ్య చివాలున రిజిష్టర్ పైన చేయిని పెట్టి గోపీనాథ్ వెనక పేజీలు చూడకుండా అడ్డుపడ్డాడు.

గోపీనాథ్ మౌనంగా తన పేరు ఎదుట సంతకం పెట్టాడు.

"సోమయ్య గారూ! ఇలా బ్లాంక్ పేపరు మీద సంతకాలు పెట్టించుకున్నారు. తరువాత ఎంత ఇచ్చినట్లు వ్రాసుకుంటారు?"

సోమయ్య గోపీనాథ్ వంక ఉరిమి చూస్తూ అన్నాడు. "ముట్టె పులుసు చాలానే ఉందే. అవన్నీ నీ కనవసరం నీ జీతం నెలకు వందరూపాయలని ఎవ్వరికీ చెప్పగూడదు."

"మరి ఎంతని చెప్పాలో ?"

"రెండు వందలయాభై అని"

గోపీనాథ్ హేళనగా, ద్వేషంగా సోమయ్య వంక చూచాడు.

"అలా చెప్పకుంటే..." అన్నాడు సోమయ్య

"ఇంటి కెళ్ళి పోవాలంటారు" పూరించాడు గోపీ.

"అంతే"

సోమయ్య అందరికీ డబ్బులు ఇచ్చేసి కోపంగా సంచీ, రిజిష్టర్ తీసుకొని వెళ్ళి పోయాడు.

రూంలో నళిని గోపీనాథ్ మిగిలారు.

"గోపీనాథ్‌గారూ! సోమయ్యతో వాదానికి దిగడం మంచిది కాదు. ఆ వీరయ్యగారికి ఈ సోమయ్య ఎంత చెబితే అంత!"

"ఊఁ!" అంటూ గడ్డం నిమురు కుంటూ కూర్చున్నాడు గోపీ.

"జీతం సంగతి ఎక్కడా చెప్పకండి. లోకం అంతా తెలిసినా ఏదో గుట్టు అని ఏడుస్తారు. మనమే జీతం తక్కువ ఇచ్చారని ఎవరిదగ్గరన్నా అంటే ఉన్న ఈ కాస్త ఉద్యోగం ఊడుతుంది!"

"నాకు తెలీక అడుగుతాను నళిని గారూ! ఎన్నాళ్ళిలా సగం జీతంలో బ్రతకాలి?"

"బ్రతికినంత కాలం!"

"అంతేనా?!"

"అంతేనండీ!"

"మరి మనకు జరిగే అన్యాయాన్ని ఎదుర్కొని మనమంతా సమ్మె చేస్తే ?"

నళిని భయంగా గోపీనాథ్ వంక చూచింది.

"అలాటి ఆలోచనలు మానుకోండి! ఉన్న ఉద్యోగం పోగొట్టుకోకండి! స్ట్రైక్ అంటే ఎవరూ కలిసిరారు. అనవసరంగా బయటపడి పోతారు" అంటూ నళిని వెళ్ళి పోయింది.

ఆలోచనలో పడ్డాడు గోపీ.

ఈ ఉద్యోగం తను ఎక్కువ కాలం చేయలేడు. దానివల్ల తన కుటుంబపోషణ జరుగదు. వీరయ్యగారితో మాట్లాడి జీతం పెంచమని అడగాలి! ఈ రోజే

వీరయ్యగారి ఇంటికెళ్ళాలి! తను ఆవేశంగా మాట్లాడ గూడదు వీరయ్యతో. అయినా ఈ వెధవ ఉద్యోగం తను ఎక్కువ రోజులు చేయడు. ఎలాగైనా కష్టపడి చదివి బ్యాంక్ పరీక్షలో నెగ్గుకొని రావాలి పస్తులు ఉండి అయినా సరే పుస్తకాలు కొని ఈ తడవ బాగా రాయాలి. కొద్ది కాలంలో తనకు ఏజ్ బార్ అవుతుంది. ఈ కాస్త అవకాశం పోతే బ్రతికినంత కాలమూ ఇంతే.

సాయంకాలం ఆరుగంటలకు వీరయ్య ఇంటికి బయలు దేరాడు గోపీ. వీరయ్యతో ఇలా అర్ధ జీతాలు ఇవ్వడం బాగా లేదని చెప్పాలి! అయినా వీరయ్యకేం రోగం? ఒక్కో పిల్లవాడి దగ్గర నెలకు పన్నెండు రూపాయల ఫీజు తీసుకొంటున్నారు. బడిలో నాలుగు వందల మంది పిల్లలున్నారు. అంటే దాదాపు ఐదువేల రూపాయలు నెలకు వస్తాయి అందులో టీచర్లకిచ్చేది ఆరొందలపాతికా?! అదిగాక టరం ఫీజు అని మూడేసి నెలలకు పదేసి రూపాయల పంతున తీసుకుంటాడు. ఇవన్నీ గాక. గవర్నమెంటు దగ్గర గ్రాంటు అంటూ ఏదో కొంత వస్తుందట!

ఏమైనా వీరయ్య చేసేది పట్టపగలు దోపిడీ! దీనిని అంతం చేయాలి! ఎలా? టీచర్లు కలిసిరారు! తనొక్కడే బయట పడితే ఉన్న ఈ కాస్త ఉద్యోగం ఊడుతుంది. ఏం చెయ్యాలి?

ఇలా అనుకుంటూ వీరయ్య ఇల్లు చేరాడు గోపీ.

వీరయ్య ఇల్లు మూడు అంతస్తుల మేడ. పెద్ద కాంపౌండ్ వాల్; దానిలోపల రకరకాల పూల మొక్కలతో దర్జాగా ఉంది. గోపీ నేరుగా ఇంట్లోకి ప్రవేశించాడు. వరండాలో కొన్ని కుర్చీలు ఉన్నాయి. ఎవ్వరూ కనిపించలేదు.

"వీరయ్యగారు ఉన్నారా?" అని బిగ్గరగా కేకవేశాడు గోపీ.

ఎవ్వరూ పలుకలేదు. కొన్ని క్షణాలు ఆగి వరండాలో నుండి ముందు గది దాకా వచ్చి మళ్ళీ కేకవేశాడు గోపీ.

మళ్ళీ ఎవరూ పలుకలేదు.

ముందుగదిలోకి చూశాడు. దాని నిండా సోఫాలున్నాయి. నేలమీద ఒక రంగు రంగుల కార్పెట్ ఉంది. గోడలకంతా వైనోలియం ఉంది. ఒక పెద్ద టేబుల్, దానిమీద రంగురంగుల ఫ్లవర్ వేజులూ ఉన్నాయి. ఆ ఇల్లు సినిమా సెట్టింగులా ఉంది.

గోపీ మరోమారు కేకవేశాడు 'వీరయ్యగారు ఉన్నారా?' అని. ఆ కేకతో ఓ ఇరవై సంవత్సరాల యువతి లోపలి నుండి వచ్చింది

గోపీ కండ్లు జిగేల్ మన్నాయి.

ఆ యువతి సౌందర్యం అపురూపంగా కనిపించింది గోపీకి. పైనుండి క్రింది దాకా బంగారం తొడుగు తొడిగినట్లుంది. చేతులకు రాళ్ల గాజులు జబ్బలకు రాళ్ళ వంకీలు మెడలో రాళ్లనెక్లెస్సూ ఉన్నాయి. కట్టుకున్న టెరిలిన్ చీర నెమలి పింఛం రంగులో మెరుస్తున్నది. రవికె నల్లగా, అందులో నుండి దిగిన చేతులు లావుగా పచ్చగా కాంతులీనుతున్నాయి. అంత పసిమిగల పిల్లను గోపీ ఇంతకుముందు చూడలేదు.

ఆ పిల్ల గోపీని చూచి సన్నగా నవ్వింది. నీలాంటి కుర్రాళ్ళు నా అందాన్ని చూచి విస్తుపోవడం నాకు



మా మూ టే అన్నట్లుగా ఆమె అలా నవ్వితే ఆమె పండ్లు తళుక్కున మెరిశాయి. ఆ పండ్లనుండి ప్రతిఫలించిన కాంతి తళుక్కున మెరిసి ఒక వింత సోయగాన్ని గోపీకి చూపాయి. ఆమె చెవులకున్న కమ్మలు–అవ్వేంటోగాని–రంగురంగుల కాంతి కిరణాలను, గోపీ దెసగా వెదజిమ్మాయి. ఆమె విశాలమైన కన్నులు ఆమె తెల్లని పండ్లతో ధగధగ మెరిసే కమ్మలతో పోటీ పడ్డాయి.

"వీరయ్య....గారు....ఉన్నారా ?"

"లేరండీ!" అన్న ఆ పిల్ల కంఠ స్వరం వీణా నాదంలా వినబడింది గోపీకి. కానీ గోపీ కదలలేదు.

"మీరు...ఎవరు ? నాన్న గారొస్తే చెబుతాను!"

"నా పేరు గోపీనాథ్ అండీ! మీ కాన్వెంటులో టీచర్ని!"

ఆ పిల్ల ముఖంలో ఒక్క క్షణం నిరసన కనిపించి మరుక్షణంలో మాయం అయింది. ఆ ఒక్క క్షణంలో తన అంతస్తు ఏమిటో జ్ఞప్తికి వచ్చి క్రుంగిపోయాడు గోపీ. ఆ సన్నివేశం గోపీకి దుర్భరంగా తోచింది. ఆమె! ఒక దేవత తనొక క్షుద్ర కీటకం అని అనుకున్నాడు.

"కూర్చోండి!" అన్న ఆ పిల్ల మాటలకు గోపీ దిగ్భ్రాంతు డయ్యాడు.

క్షణంపాటు ఏమీ తోచక అలాగే నిలబడ్డాడు.

"కూర్చోండి!" అంటూ ఆపిల్ల ఒక సోఫాను చూపింది.

గోపీ బెరుకుగా కూర్చున్నాడు.

"నా పేరు భువనమోహిని! వీరయ్యగారు మా నాన్నగారు!"

గోపీ ఇందాకట్నుంచీ వీరయ్యను మనస్సులో తిట్టుకున్నాడు. భువనమోహిని మాటలతో 'శభాష్ వీరయ్యా! నీ కూతురుకు ఇంత చక్కటి పేరు పెట్టావ్ గాబట్టి నిన్ను క్షమిస్తున్నాను' అనుకున్నాడు మనస్సులో.

భువనమోహిని లోపలికెళ్ళి మరుక్షణం తిరిగివచ్చి గోపీ ఎదురుగా సోఫాలో కూర్చుంది. ఆమె అలా దగ్గరకు రాగానే కమ్మని సెంటు వాసన గుప్పుమని గోపీని ఆక్రమించింది. ఈ పిల్ల ప్రతి మాట, ప్రతి కదలిక గోపీలో సెంటు సువాసనలను మరిపించే అనుభూతిని కలిగిస్తున్నాయి. చీర కుచ్చెళ్ళ మాటున తొంగి చూచే భువన మోహిని పాదాల వంక చూచాడు గోపి.

ఎర్రని ముఖమల్ స్లిప్పర్స్‌లో పచ్చని పాదాలు! లేచిగురు టాకులతో పోల్చేవారు కవులు, కరెక్ట్, ఆమె త్తని పాదాలకు సన్నగా వ్రేళ్ళు, ఆ వ్రేళ్ళకు ఎర్రని రంగు వేసిన గోళ్ళు! గోపీ అలాగే భువనమోహిని పాదాల వంక చూస్తూంటే అవి చటుక్కున చీరకుచ్చెళ్ల మాటుకు తప్పుకున్నాయి

గోపీ నిరాశగా భువనమోహిని కండ్లలోకి చూచాడు. నవ్వుతున్న భువన మోహిని ముఖ సౌందర్యం ఆమె కమ్మల నుండి బాణాల వలె వలె దూకుతున్న కాంతి కిరణాలు ఆమె కండ్లనుండి వెలువడుతున్న వెలుగు రేఖలు చూశాక గోపీ మతి స్థిరం తప్పిపోయింది. అలా కండ్లప్పగించి చూస్తున్నాడు.

గోపీని ఈ అవస్థలో చూచిన భువనమోహిని ఇక తనే మాట్లాడాలి అనుకుంది.

"మీరు ఎం. ఎ. చేశారటగా!"

"అవునండీ."

"ఉద్యోగం ఏమీ రాలేదా?"

"రాలేదండీ!"

ఇంతలో పనిమనిషి రెండు ప్లేట్లలో బిస్కెట్లు పట్టుకొచ్చి భువనమోహిని, గోపీల నడుమ ఉన్న చిన్న బల్లమీద పెట్టింది.

"తినండి" అన్నది భువనమోహిని

గోపీ మరోమాట మాట్లాడకుండా బిస్కెట్లు అందుకుని తింటున్నాడు. మెల్లగా తన ప్లేటులో బిస్కెట్లు అన్నీ తిన్నాడు. పనిమనిషి మంచినీళ్ళిచ్చింది. అవి త్రాగాడు. భువనమోహిని తన ప్లేట్ లో ఉన్న బిస్కెట్లనూ గోపీ ప్లేట్‌లో ఉంచింది. గోపీ ఏమీ అడ్డు చెప్పలేదు. మరో చోటయితే బెట్టుగా 'ఎందుకండీ చాలు!' అనేవాడే. కానీ ఈమె భువనమోహిని! ఈ మహా సౌందర్యరాశి ఎదుట సర్వ చేతనా ప్రపంచం, అచేతనంగా ఉండిపోవాల్సిందే. ఈమె కనుసన్నల నుండి వెలువడిన ఆజ్ఞలను సర్వప్రపంచం స్వీకరించాలి. ఈ సౌందర్యదేవత ఆజ్ఞకు ఎదురులేదు. ఇందాక పనిమనిషి తెచ్చిపెట్టిన బిస్కెట్లు చప్పగా ఉన్నాయి. ఈ భువనమోహిని చేతి బిస్కట్లు ఏమిటబ్బా? ఇంత రుచిగా ఉన్నాయి? అనుకుంటూ



చతుర

భువనమోహిని చేతులను చూశాడు. భువనమోహిని చేతులు పదహారు వన్నెల బంగారంలా మెరిసిపోతున్నాయి. సున్నగా పాలీష్ చేయబడిన దంతంలాగా నవనవలాడుతున్నాయి. మోచేతుల దగ్గర ఖిమలకులా పొడుచుకొని వచ్చిన ఎముకలు కనబడలేదు. రెండు చేతులకూ రెండేసి రాళ్ళగాజుల నడుమ ఓ అర డజను బంగారు గాజులున్నాయి. వ్రేళ్ళు గోరింటాకు పెట్టినందువల్ల ఎర్రగా ఉన్నాయి. వ్రేళ్ళకు సన్నగా పొడవుగా గుమ్మడిగింజల ఆకారంలో దొండపండు రంగులో గోళ్ళు మెరుస్తున్నాయి. రెండు చేతుల వ్రేళ్ళకూ ఉంగరాలు ఉన్నాయి. ఆ ఉంగరాలలోని రాళ్లుగూడా కమ్మలలోని రాళ్ళవలె కాంతికిరణాలను గుప్పిస్తున్నాయి.

ఆ చేతులను చూస్తూ భువనమోహిని పెట్టిన బిస్కెట్లను తిన్నాడు. గోపీ ప్లేట్ ఖాళీఅయింది.

"ఇంకా కాసినిబిస్కెట్లు తెప్పిస్తాను"

గోపీ ఆశ్చర్యంగా భువనమోహిని మాట్లాడుతుంటే లాస్యం చేస్తున్న ఆమె పెదవుల వంక చూస్తున్నాడు. ఆ పెదవులు లాస్యంచేస్తున్న సమయం అపూర్వమైంది. వాటి సొగసును ఒక లిప్త కాలంగూడా మిస్‌కాకూడదు. ఇలా గోపీ అనుకుంటుండగా మళ్ళీ ఆ పెదవులు లాస్యంచేశాయి! ఆ పెదవులనుతప్పించుకొని ఒకమధురస్వరం వచ్చింది. రెండు క్షణాలయ్యాక ప్లేట్‌లో మళ్ళీ కొన్ని బిస్కెట్లొచ్చిపడ్డాయి. భువనమోహిని పెదవులు మళ్లీ లాస్యంచేశాయి. అందులో నుండి "తినండి" అన్న తియ్యని ఆజ్ఞ వచ్చింది. గోపీ చెయ్యి యాంత్రికంగా ప్లేట్‌లోని బిస్కెట్‌ను గోపీ నోట్లో పెట్టింది.

"నాన్నగారితో పనిఉందా?"

"ఉహుఁ అబ్బే!...ఏం...లేదు"

"ఏమైనా చెప్పాలని ఉంటే నాతో చెప్పండి, నాన్నగారితో చెబుతాను."

"ఏమీ...లేదు."

ప్లేట్‌లో బిస్కెట్లు అయిపోయాయి. పనిమనిషి కాఫీ తెచ్చిచ్చింది. గోపీ కాఫీ త్రాగాడు. పనిమనిషి వక్కపొడి డబ్బా అందించింది డబ్బాతీసుకొని అందులో నుండి వక్కపొడి తీసుకొని నోట్లో వేసుకున్నాడు. డబ్బాను చేతపట్టుకొని లేచి వస్తానండీ!" అన్నాడు గోపీ.

"అలాగే" అన్నది భువనమోహిని.

పాదాలు ముందుకూ, మనస్సు వెనక్కూ లాగుతుంటే బయలుదేరాడు గోపీ. వాకిట్లోకి వెళ్లాక భువనమోహిని సమ్మోహనాస్త్రం గోపీ నుండి వదిలిపోయింది. బజార్లోకొచ్చాక గోపీకి బాహ్యస్ఫురణ వచ్చింది. చేతిలో చూచుకుంటే వక్కపొడి డబ్బా ఉన్నది 'చచ్చాం!' అనుకుని రివ్వున పరుగెత్తి, వీరయ్య ఇంట్లోకెళ్ళాడు.

భువనమోహిని సోఫాలో కూర్చుని గడ్డంక్రింద మోచేతిని ఆన్చుకొని ఆలోచిస్తున్నది. మరోమారు గోపీ నేలకంటుకొనిపోయాడు. భువనమోహిని అందాన్ని చూచి.

"ఏమిటండీ?" అన్న ప్రశ్నతో ఉలిక్కిపడి గోపీ వక్కపొడి డబ్బాను భువనమోహిని ఎదుటఉన్న బల్లపైన పెట్టాడు దానిని చూస్తూ భువనమోహిని నవ్వింది. గోపీ అయిష్టంగా తిరిగి వెళ్ళిపోయాడు.



# 11

"సినిమాకె ళ్తున్నాను నళినీ!" అంది విమల.

నళిని ఆశ్చర్యంగా వాచీ చూచుకున్నది.

"అరె! అరున్నర కావస్తున్నది. మొదలుపెట్టి ఉంటారేమో"

"అప్పుడే మొదలు పెట్టరులే!" అంటూ విమల చకచకా టాయిలెట్ అవుతున్నది.

"ఈరోజు ఆదివారం గదా! కాస్త ముందు అని ఉంటే అన్నం వండిపడేసి నేనూ వచ్చేదాన్ని గదా విమలా!"

"ఏదీ ఏం తోచటంలేదు నళినీ! సినిమా కెళ్ళాలనిపిస్తుంది. ఈ తడవ ఇద్దరం వెళ్దాంలే" అని పెట్టెలోనుండి కొత్తచీరను తీసి కట్టుకోవడం మొదలెట్టింది విమల.

కొద్ది రోజులుగా విమల పద్ధతిలో ఏదో మార్పు వచ్చినట్లు కనబడింది నళినికి. విమల ఎప్పుడూ గలగలా మాట్లాడేది, ఈ నడుమ మౌనంగా ఉంటున్నది. ఈ రోజూ ఒక్కర్తే సినిమాకు బయలుదేరింది. విమల ఈ ఊరు వచ్చింది మొదల్లు ఒంటరిగా సినిమాకు ఇంతవరకూ వెళ్ళలేదు. అలంకరించుకుంటున్న విమల వంక చూస్తూఉండి పోయింది నళిని.

"వస్తాను నళినీ!" అంటూ వాకిట్లో కొచ్చింది విమల.

విమల బజారులో నడుస్తున్నది. అలా నడుస్తూ వీరయ్య ఇంటి ముందుగా వెళ్ళింది. వెళ్తూ ఒక్కసారి వీరయ్య ఇంట్లోకి చూచింది. పంచ అంతా నిర్మానుష్యంగా ఉంది. అమర్ జాడ కనబడలేదు.

అమర్ మొదటి రోజున ప్రేమలేఖ పంపాడు. ఆ తరువాత వరుసగా మూడు రోజుల పాటు ఉత్తరాలు పంపాడు. ప్రతిలేఖలోనూ ప్రేమను ఘాటుగా ప్రదర్శించాడు. శివాలయంలో కలవమని ప్రాధేయపడ్డాడు. ఆఖరు ఉత్తరంలో సినిమా హాలుకు రమ్మన్నాడు.

విమలకు పోవాలని ఉన్నా 'అయినా చూద్దాం!' అని ఆగింది. ఆ తరువాత విమలకు మరునాడు ఉత్తరం రాలేదు. ఆ మరునాడు కూడా రాలేదు. విమలకు గాభరా పట్టుకుంది. మరీ తెగిందాకా లాగుతున్నానేమో అనిపించింది. అమర్ విసుగుబుట్టి మానుకున్నాడేమో? ఛీ! ఛీ! ఎంతటి గొప్ప అవకాశం జారిపోతున్నది? వేయి జన్మలెత్తినా అమర్‌లాటి అందగాడితో తనకు పొత్తు కలుస్తుందా? బంగారంలాంటి అవకాశం చేయి జారిపోతుందా? అమర్ తనని పెండ్లి చేసుకుంటానని వ్రాసిన ఉత్తరాలు నాలుగు తన చేతిలో ఉన్నాయి

విమల చకచకా నడుస్తున్నది బజారు వెంట.

"హల్లో విమలా"

విమల తల త్రిప్పి చూచింది. గోపీ జిడ్డు ముఖం, మాసిన లాల్చీ, పైజామా

కనుపించాయి! తక్కున తల త్రిప్పు కొని, చకచకా నడుస్తున్నది విమల.

"సినిమాకా ?" అన్నాడు గోపీ చకచకా నడిచివచ్చి విమల ప్రక్కగా నడుస్తూ. "మార్కెట్ కెళ్తున్నా" ను అంది విమల.

"విమలాదేవిగారూ! మార్కెట్ త్రోవ ఇదిగాదు. వెనక్కు తిరిగి వెళ్ళాలి!"

"మిస్టర్ గోపీనాథ్‌గారూ! మీ పని మీరు చూచుకోండి! అనవసరగా నన్ను వాగించకండి!"

"అలాగే విమలా! అయినా ఒక్కసారి, నీతో మాట్లాడాలి! ఎన్నిసార్లు ప్రయత్నించినా త్రోసిపారేస్తున్నావు మాట్లాడనీకుండా... పెండ్లి..."

"ఆ సంగతులు మాట్లాడే అవకాశం పోయింది, అయినా... ముందు... ఒక ఉద్యోగం చూసుకోండి"

ఆ మాటతో గోపీ ముఖం నల్లగా మాడిపోయింది. నడిచేవాడల్లా తక్కున ఆగిపోయాడు. విమల వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

విమల అలా కొంత దూరం నడిచి, ఒక పూల కొట్టు దగ్గరకెళ్ళింది. ఒక మూరెడు కదంబం కొని తల్లో పెట్టుకుంటూ, ఓరగా వెనక్కు తిరిగి చూచింది. గోపీ కాళ్ళీడ్చుకుంటూ వెళ్తున్నాడు.

ఎంత ప్రమాదం తప్పింది? తను పెండ్లిచేసుకోమనగానే, ఈ జిడ్డు ముఖంగాడు సరే, అని ఉంటే, తను మూర్ఖంగా ఇతడ్ని చేసుకుని ఉండేది. ఇక ఈ జీవితాంతం, ఈ దరిద్రుడితో బ్రతకాల్సిందే! తప్పిపోయింది. ఏ గ్రహచారం వల్లనో? అక్కడ! ... సముద్రం ... దగ్గర ...! అలా జరిగిపోయింది! తను కొన్నాళ్ళు భయంతో వణికి చచ్చింది. ఆ కాస్త పరిచయాన్ని అడ్డం పెట్టుకొని వచ్చి, వాకిట్లో కూర్చుంటాడేమోనని హడలిపోయింది. గోపీ దరిద్రుడే గాక, పిరికివాడూ, ఆవేశశూన్యుడూ కావడం కూడా ఒక విధంగా మంచిదైంది.

ఇలా ఆలోచించుకుంటూ, సినిమా హాలు దగ్గరకు వచ్చింది విమల. ఈ సినిమా హాలు దగ్గర కలుసుకోమనే అమర్ వ్రాశాడు. కానీ, అతడు చెప్పిన రోజు తను రాలేదు. ఈ రోజు ఇక్కడ ఉంటాడా? ఎందుకుంటాడు? అయినా ఆశ. లేకుంటే, ఈ వెధవ సినిమా తను చూడలేదు కొంచెంసేపు సినిమా హాలు దగ్గరుండి, అతను కనబడకపోతే ఇంటికి వెళ్ళిపోదాం! అనుకుంది విమల.

నేల, బెంచీ కౌంటర్లు రష్‌గా వున్నాయి. విమల ఆడవాళ్ళల్లో నిలబడి, మగవాళ్ళ కౌంటర్ల వంక చూచింది. అమర్ జాడ లేదు.

బుకింగ్ కౌంటర్ల దగ్గర జనం టిక్కెట్లు తీసుకొని లోపలికి వెళ్తున్నారు.

సినిమా మొదలైనట్లుంది. సబ్బుల అడ్వర్‌టైజ్‌మెంట్లు విమలకు వినబడుతున్నాయి. విమల టికెట్ తీసుకోకుండా హాల్లోకి పోకుండా, కౌంటర్ దగ్గర తచ్చాడడాన్ని, మగవాళ్ళ కౌంటర్ దగ్గర ఉన్న నలుగురు యువకులు చూచారు వాళ్ళకు విమల ఏదో 'కేస్' లాగా తోచినట్లుంది. నలుగురూ తలా ఒక మూలను నిల్చుని, విమల వంక చూస్తూ కాలర్లెత్తారు! విమల వీళ్ళను చూచి విసుక్కుంటూ వున్నది. అమర్ జాడ కనిపించక పోవడంతో, ఇక సినిమాకు వెళ్లే ప్రయత్నం మానుకుని,

ఇంటి ముఖం పట్టింది విమల.

విమల బయట కాలుపెట్టగానే అమర్ ఎదురుగా వచ్చాడు. విమల సంభ్రమంగా అతని వంక చూసింది.

"విమలా!"

"ఊఁ!"

"సినిమా కొచ్చావా?"

"ఊఁ!"

"వెళ్ళిపోతున్నావేంటి?"

"రష్‌గా ఉంది"

అమర్ క్రీగంట, ఖాళీగా వున్న లేడీస్ కౌంటర్ చూస్తూ అన్నాడు.

"పద! వెళ్దాం!"

అమర్ త్రోవ తీయగా విమల అతడి వెంట నడిచింది.

అమర్ నేరుగా మెట్లెక్కి రిజర్వుడు లోకి వెళ్ళాడు. విమల గూడా అతని వెంట లోపలికి వెళ్ళింది.

"కూర్చో విమలా!" అన్నాడు అమర్.

విమల రిజర్వుడు క్లాసునంతా పరిశీలించింది

అక్కడక్కడా ఒకరూ, ఇద్దరూ కన బడ్డారు చీకటిలో. విమల ఒక కుర్చీలో కూర్చుంది.

అమర్ రెండు కూల్ డ్రింకులను చేతబట్టుకొని, హాల్లో కొచ్చి కూల్ డ్రింకును అందించాడు. మరుక్షణం దానిని, గటా గటా తాగేసింది విమల.

అమర్, తనూ కూల్ డ్రింక్ తాగి, విమల చేతిలోని సీసాను అందుకొని, తనచేతిలోని సీసాతో కలిపి క్రింద పెట్టాడు.

"నేను ఇచ్చిన నవల చదివావా? విమలా?"

"చదివాను!"

"ఎలా ఉంది?"

"చాలా అసహజంగా ఉంది!"

"అందులో నీకు కనిపించిన, అసహజత, ఏమిటి?"

"ఒక కోటీశ్వరుడు, ఒక పేద పిల్లను చేసుకోవడం!"

"ఇష్షు!" అంటూ విసుక్కున్నాడొక ప్రేక్షకుడు.

అమర్, విమల మౌనంగా కొంచం సేపున్నారు. సినిమా దాని పాటికి అది వెళ్ళిపోతున్నది.

"విమలా! నీతో ఏకాంతంగా చాలా విషయాలు మాట్లాడాలి? ఎక్కడ కలుసుకుందామో చెప్పు!"

విమల ఆలోచించింది. సరియైన ఆలోచన స్ఫురించలేదు?

"సముద్రం ఒడ్డుకు వెళ్దామా?"

"అహఁహాఁ! అక్కడి కొద్దు!"

"మరెక్కడి కెళ్దాం?"

"బెజవాడ"

"అంతదూరమా?"

"నా కార్లో వెళ్దాం!"

"మరి బడి? రేపు వర్కింగ్ డే"

"సెలవు పారెయ్"

"నళిని ఏమంటుందో"

"విమలా! ఇక నీవు నళినికీ, సోమయ్యకూ భయపడడం మానెయ్యాలి. వాళ్ళే నిన్ను చూచి భయపడే రోజులు వస్తాయి"

విమలకు అమర్ మాటలు మధురంగా తోచాయి. నళిని, సోమయ్యా చేతులు కట్టుకొని ఎదుట నిలబడినట్లే ఉంది!

"అందుకని రేపు ఉదయం ఏడు

గంటల

గంటలకల్లా పెట్రోల్ బంక్ దగ్గర ఉండు, కారు తీసుకొని వస్తాను: ఏం?"

"అలాగే"

"ఇష్షూ!" అని మరోసారి విసుక్కున్నాడు, వెనుక కూర్చున్న ప్రేక్షకుడు.

"వెళ్దాం పద!" అన్నాడు లేస్తూ అమర్.

విమల అయిష్టంగా లేచింది.

వాకిట్లోకి రాగానే "మర్చిపోకు ఏడు గంటలకు" అని వెళ్ళిపోయాడు అమర్.

విమల నడిచి ఇంటికి చేరింది.

విమల ఇంట్లో కాలు పెట్టగనే, పిల్లలకు అన్నం పెడుతున్న నళిని ఆశ్చర్యంగా విమల వంక చూసింది.

"సగంలో వచ్చేశాను !"

"ఏం సినిమా బాగాలేదా ?"

"మనస్సే బాగాలేదు !"

"ఏమైంది విమలా ?"

"సినిమా హాల్లో మా ఊరి వాళ్ళు కనబడ్డారు !"

"కనబడి ?..."

"అమ్మకు సుస్తీగా ఉందట !"

"అరెరే! ఏం సుస్తీ ? ఎలా ఉందట ?"

"మంచం మీది నుండి లేవడం లేదట !"

"వెళ్తావా విమలా ?"

"వెళ్లాలనే ఉంది ! రేపు ప్రొద్దున్నే వెళ్దామనుకుంటున్నాను, ఒక రోజు సెలవు పెట్టి !"

"అలాగే వెళ్ళు విమలా ! అమ్మగారికి నిమ్మళించే దాకా దగ్గరుండి జాగ్రత్తగా మీఁదూ మాకూ చూడు !" అన్నది నళిని ఆందోళనగా.

విమల తెల్లవార్లూ కలత నిద్రలో మంచం మీద అటూఇటూ పొర్లింది.

తెల్లవారగానే ఏడు గంటల కల్లా పెట్రోలు బంక్ దగ్గరకు చేరింది విమల.

పెట్రోలు బంక్ దగ్గర ఒక అంబాసిడర్ కారులో కూర్చుని ఉన్నాడు అమర్‌నాథ్. విమలను చూడగానే అమర్‌నాథ్ ఫ్రంట్‌డోర్ తలుపు తీసి రమ్మన్నట్లు తలఊపాడు. విమల అటూ ఇటూ బిత్తరగా చూచి నేరుగా వచ్చి ఫ్రంట్ సీటులో కూర్చుంది.

మరు క్షణంలో కారు బయలుదేరింది.

విమల హృదయం గాలిలో తేలిపోయింది. మెత్తని పరుపుమీద కూర్చొని అద్దంలో నుండి రోడ్డు మీదకు చూస్తుంటే ఏవో తెలియని విచిత్రభావాలు గుంపులు గుంపులుగా ఆమె అంతరంగం చుట్టూ మూగాయి జీవితంలో మొదటిసారి కారులో ప్రయాణం. చాలా థ్రిల్లింగ్‌గా ఉంది విమలకు. క్రీగంట అమర్‌ను చూచింది. అమర్ ఉత్సాహంగా విమలను చూచాడు. మళ్ళీ చూపులు బలవంతంగా త్రిప్పుకొని కారు డ్రైవింగ్ చేస్తున్నాడు

త్రోవలో ఆగి అమర్, విమల హోటల్‌కెళ్ళాడు టిఫెన్, కాఫీలు సేవించారు. మళ్ళీ ప్రయాణం సాగించారు. పది గంటల ప్రాంతంలో అంబాసిడర్ కారు చాలా అంతస్తులు గల హోటల్ ముందు ఆగింది. హోటల్‌లో నుండి బాయ్ వచ్చి స్మార్ట్‌గా అమర్‌ను విష్ చేశాడు.

"డిక్కీలో లగేజ్ తీసుకొనిరా !" అంటూ అమర్ ముందుకెళ్లాడు విమలతో

రిసెప్షన్ కౌంటర్ దగ్గర ఉన్న అతనితో అమర్ అన్నాడు

"అమర్‌నాథ్ నా పేరు. రూంరిజర్వు అయిందా ?"

"అయిందండీ" అంటూ బాయ్‌ని పిలిచి రూం తాళం చేతులు ఇచ్చాడు.

హోటల్‌లోని ప్రతి అంగుళం విమలని ఆశ్చర్యానందాతిరేకాలలో ముంచి వేస్తున్నది.

లిఫ్ట్ నాలుగో అంతస్తులోకి వెళ్ళి ఆగింది. బాయ్ ఒక రూం తాళం తీసి లోపలికెళ్ళి సూట్‌కేస్ క్రిందపెట్టాడు.

గదిలోకి ప్రవేశించగానే విమల ఒక్కసారి వణికింది

అమర్ నవ్వుతూ "ఎయిర్ కండిషన్డ్ రూం" అన్నాడు.

విమల గదినంతా పరిశీలించింది రూం విశాలంగా ఉంది. డబుల్ బెడ్ పైఒక తెల్లటి దుప్పటి పరుపబడి ఉంది. గదినిండా సోఫాలూ నిలువుటద్దాలూ, డ్రాయర్లూ ఉన్నాయి.

"గది చాలా బాగుంది ! ఎంత ?"

"యాభై రూపాయలు ! రోజుకు !"

విమల ఒక సోఫాలో కూర్చున్నది. అమర్ ఆమెకు ప్రక్కగా వచ్చి కూర్చున్నాడు. విమల కొద్దిగా ప్రక్కకు జరిగింది. అమర్ విమల చేతులను రెంటినీ తన చేతులలోకి తీసుకున్నాడు.

విమల ఇబ్బందిగా ముఖంపెట్టింది. తనలో అనుకుంది. 'ఏంటిది ? జాబులలో అంత ప్రేమను వర్ణించి తీరా ఇక్కడికి రాగానే తననే మాటా పలుకూ లేకుండా తాకుతున్నాడు. అమర్ తాకగానే తన దేహంలో... అప్పుడు... సముద్రం దగ్గరిలాగా... నిస్సత్తువ ప్రవేశిస్తున్నది.

"విమలా ?"

"ఏమిటి ?"

"ఐ లవ్ యూ!"

"......"

"నీవు నన్ను ప్రేమించడం లేదా ?"

"ఆడవాళ్ళకు ప్రేమకంటే పెండ్లి ముఖ్యం !"

"ఆడవాళ్ళకు పెండ్లి ధ్యాసతప్పించి మరేం ఉండదు !"

"ఆహా ! చాలా మంది ఆడవాళ్ళు మిమ్మల్ని ఇలాగే అడిగారా !"

అమర్‌నాథ్ గతుక్కుమన్నాడు.

"విమలా! ఏమో ననుకున్నాను. నీవు చాలా గడుసు దానవు సుమా !"

"గడుసుదనం లేకుంటే ఆడవాళ్ళు బ్రతకడం కష్టం!"

"ఓకే ఒప్పుకున్నాను. ఇంతకీ పెళ్ళి సంగతి తేల్చమంటావు. నీకు జాబులో వ్రాశాను గదా! నిన్ను తప్పక పెండ్లి చేసుకుంటాను విమలా!" విమల కండ్లు మిలమిలా మెరిశాయి.

"అయితే కొంచం టైం పడుతుంది"

విమల ముఖం వెల వెలా పోయింది.

"విమలా కొంచెం అర్థం చేసుకోవాలి. నీకు తెలుసుగా మా నాన్న చండప్రచండుడు. నిన్ను పెండ్లిచేసుకోవాలని నేను అనుకుంటున్నట్లు అయనకు తెలిస్తే ఇక మన చేతిలో పైస ఆడదు. కారూ గీరూ ఉండదు. మనకెలాగూ ఉద్యోగం రాదు. ఆఖరుకు ఆ గోపీలాగా ఏ ముష్టి ఉద్యోగమో చేసుకుని బ్రతకాలి !"

"మరి ఎలాగ నన్ను పెండ్లి చేసుకోగలరు?"

"అందుకే కాస్త టైం కావాలి. మా

నాన్న సినిమాహాలు ఒకటి బేరం చేస్తున్నాడు. నిన్న మనం వెళ్ళిన సినిమా హాలే. పదిలక్షల రూపాయిలు చేస్తుంది. డబ్బు నాలుగు లక్షలు తగ్గింది. మా నాన్న ఆ డబ్బును కూడదీయడంలో తంటాలు పడుతున్నాడు. ఆ డబ్బు జమ కాగానే మా నాన్న సినిమాహాలు కొంటాడు. ఇప్పటికే ఆయన పేరున బోలెడంత ఆస్తి ఉంది. ఇన్‌కంటాక్సుల గొడవలతో సతమత మౌతున్నాడు. అందుకని ఆ హాలు కొని నా పేరున పెడతాడు. ఆ కొంచం పని జరిగి పోగుందంటే ఇంక ఎవర్నీ లెక్క చేయను. ఆ తరువాత మన ఇష్టారాజ్యం. అందుకనే అప్పటిదాకా మనం ఆగాలి"

"నిజంగా నన్ను పెండ్లి చేసుకుంటారా ?"

"విమలా అనుమానం ఎందుకు ? అయితే నీవు నన్ను ప్రేమించాలిగా"

"అమర్ ! నిన్ను ప్రేమిస్తున్నాను అమర్" అన్నది విమల.

అమర్ విమలను కౌగిట చేర్చుకున్నాడు. విమల గోముగా అమర్ కౌగిటిలో ఒదిగి పోయింది. అమర్ లాఘవంగా ఆమె రవికను విప్పుతున్నాడు.

"అమర్ మనం పెండ్లి అయ్యేదాకా చాలా పవిత్రంగా ఉండాలి. పిచ్చివేషాలు వెయ్యగూడదు. పెండ్లి అయ్యాక చిలుకా గోరింకల్లా ఉందాం"

"అలాగే అలాగే" అంటూనే ముందుకు ముందుకు వెళ్తున్నాడు అమర్.

"అమర్ మనం ఒక చిన్నఇల్లు తీసుకుందాం."

"అలాగే."

"అబ్బ అమర్ ఏంటీ పనులు"

"అబ్బే ఏం లేదు"

"వద్దు అమర్" అన్నది విమల ఆశ్చర్యంగా - అమర్ రవిక, బ్రాను ఊడదీసిన లాఘవం గమనించి.

అలా మాట్లాడుతూనే అమర్ విమను బెడ్ మీదకు చేర్చాడు. విమల 'వద్దు' అంటూనే ఉంది! 'అలాగే' నని అమర్ అంటూనే ఉన్నాడు. మెల్లగా గది అంతా నిశ్శబ్దం అలుముకుంది.



# 12

విమల చేత చీవాట్లు తిని గోపీనాధ్ ఊసురో మంటూ బడికి చేరుకున్నాడు. అరు బయట ఒక కుర్చీ వేసుకుని కూర్చున్నాడు. కడుపులో అకలిగా ఉన్నా అన్నం వండుకునే ఓపిక లేదనిపించింది. అంత మరీ అకలయితే ఏ హోటల్ కన్నా వెళ్ళి చపాతీ తినవచ్చుననుకున్నాడు

బడి అంతా చీకటి అలుముకొని ఉంది. చంద్రుడు ఎక్కడా కనబడ లేదు. బడి ఆవరణలో ఉన్న పెద్ద పెద్ద చెట్లు చీకటిలో మునిగి వింత వింత రూపాలతో కనబడుతున్నాయి గోపీకి.

గోపీకి విమల కొరకరాని కొయ్య అయింది. విమల తన పైన ఎందుకింత అసహ్యాన్ని పెంచుకుందో అంతు పట్టి

చతురు

లేదు. తన తప్పేమైనా ఉందా? అని తరచి తరచి చూసుకున్నాడు. ఆనాడైనా ఆమె సంపూర్ణమైన మనస్సుతోనే తనకు లొంగింది. ఆమె ఏ మాత్రం అయిష్టం చూపినా తను అడుగు ముందుకు వేయలేకపోయేవాడే గదా.

ఆవేశంలో విమల తనకు దూరమైంది అనుకున్నా మరి పెండ్లి సంగతి మాట్లాడబోతే ఎందుకు కసిరి కొట్టింది? పెండ్లి ఆమెకు ఇష్టమే గదా! అసలు ఒక మగవాడితో ఒకసారి అనుభవం కలిగితే ఇక ఆ ఆడది ఆ మొగవాడిని వదలిపోదంటారు గదా ! మరి విమల తనను ఎందుకు ఖాతరు చేయనట్లు ?

"గోపీగారూ! గోపీగారూ!" అంటూ ఎవరో పిలిచారు.

"ఎవరూ?" అంటూ లేచి గోపీ గేటు దగ్గరికెళ్లాడు.

ఆ వచ్చింది వీరయ్యా ఇంట్లో పనిచేసే నౌకరు.

"అయ్యాగారు మిమ్మల్ని రమ్మంటున్నారు!" అన్నాడు నౌకరు.

గోపీ గుండెల్లో రాయి పడ్డది.

"ఎ ం దు కు ట?" అనుమానంగా భయంగా అడిగాడు.

"నాకు తెల్దండీ!" అంటూ నౌకరు వెళ్ళిపోయాడు

గోపీ హడలి పోయాడు. వీరయ్యాగారు తనన్నే ఎందుకు పిలిచినట్లు ? ఆ సోమయ్యే తన గురించి ఏమైనా వీరయ్యకు చెప్పాడా? లేక...లేక... భువనమోహిని...తనమీద వీరయ్యకు... ఏమైనా చెప్పిందా? తరువాత ఆలోచిస్తే భువనమోహిని ఎదుట తన ప్రవర్తన అసభ్యంగా ఉన్నట్లు తోచింది. నిజమే, చతుర తన కష్టుడు అనిపించలేదు. ఆమె సౌందర్యానికి తను దిగ్భ్రాంతి చెందాడు అంతేగాని తనేమీ అనలేదు. ఆవిడను గురించి కనీసం ఆలోచనలలో గూడా కాంక్షించలేదు. అపురూపమైన సౌందర్యాన్ని చూచి తను భ్రమించాడు...

సోమయ్యా తన మీద ఏమైనా చెప్పి ఉంటే ఆ విషయంలో తను ధైర్యంగా వీరయ్యతో వాదించగలడు! కానీ భువనమోహిని సంగతే అయితే?

గోపీ ఇలా వ్యాకులపడుతూ తాళాలు వేసుకొని అదిరే గుండెతో వీ ర య్యా ఇల్లు చేరాడు.

వీ ర య్యా పంచలో కూర్చుని ఉన్నాడు. అతని ఎదుట ఎవరోకూర్చుని మాట్లాడుతున్నారు. గోపీ వీ ర య్యా దృష్టిలో పడినా వీరయ్యా గోపీని గమనించక తన ఎదురుగా ఉన్నవారితో ఏమేమిటో మాట్లాడుతున్నాడు. గోపీ వీరయ్యా ముఖంలోకి నిశితంగా చూచాడు. అయినా ఏమీ కనిపెట్ట లేకపోయాడు.

పంచ నిండా ఖాళీ కుర్చీలు చాలా ఉన్నాయి. వీరయ్యా గోపీని కూర్చోమనలేదు. గోపీకి ఒళ్లుమండినా అలాగే నిలబడిపోయాడు గోపీ దాదాపు ఒక అరగంట అలా నిలబడ్డాడు. ఆఖరుకు ఆ మాట్లాడుతున్న వ్యక్తి వీ ర య్యా దగ్గర సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయాడు. వీరయ్యా గోపీ వంక చూచి "ఏం గోపీ" అన్నాడు.

"పిలిపించారట!"

"ఆఁ ఆఁ పిలిపించాను!"

"..................."

"చూడు గోపీ? ఉద్యోగం ఎలా ఉంది?"

"........."

గోపీ మౌనాన్ని ఖచ్చితంగానే ఊహించాడు వీరయ్య. "చూ డ బ్బా య్! మా బళ్ళో చదువు చెప్పడానికి ఎం.ఎ,లు అనవసరం, మెట్రిక్ చదివిన ఆడవాళ్ళు సరిపోతారు. అయినా నీకూ వాళ్ళతో సమానంగా జీతం ఇస్తున్నాను గదా?"

వీరయ్య వేసిన ముందు కాళ్ళ బంధంతో గోపీ మౌనంగా ఉన్నాడు.

"అసలు చిన్నపిల్లలకు చదువు చెప్పడానికి మగాళ్ళు పనికి రారోయ్! మరీ ఒకటి రెండు క్లాసులకైతే ఇక చెప్ప నక్కరలేదు. ఒకటి రెండు క్లాసుల పిల్లలను ఆడవాళ్ళే సమర్థవంతంగా నిర్వహించగలరు. ఆ పిల్లలు చెడ్డీలు ఖరాబు చేసుకుంటారు! ఏడుస్తారు! వాళ్ళను అనునయించడం ఆడవాళ్ళకే చెల్లును!"

గోపీ మనస్సులో కనకం మెదిలింది! కనకం పిల్లల్ని చెండుకుని తింటుంది. ఒక్కోక్కప్పుడు తనకనిపించేది. ఈ పిల్లలంతా కలిసి ఆ కనకం మొగుడెవడో వాణ్ణి పట్టుకుని కనకాన్ని, వాణ్ణి ఏకం చేస్తే కనకం ఉక్రోషం తగ్గిపోయి పిల్లలను బాగా చూస్తుందేమోనని కనకం పిల్లలను కొట్టే దెబ్బలూ. తిట్టే తిట్లూ చూస్తే ఆ పిల్లలే తన కాపురం పాడవ్వడానికి కారణం అని ఆమె అభిప్రాయమేమో అనిపిస్తుంది.

"అందుకనే మీ అమ్మ ముఖం చూచి వాళ్ళతో సమానంగా నీకూ జీతం ఇస్తున్నాను"

"అన్నట్లు! నిన్నెందుకు పిలిచానో తెలుసా? నాకో ఒకే ఒక అమ్మాయి ఉంది."

గోపీ గుండె దడదడ లాడింది! ఇలాటి విషయం వస్తుందనే తను ఇందాకటినుండీ వీరయ్యతో పేచీకి దిగక మౌనంగా ఉన్నాడు.

"అ మ్మా యి ఇంటర్ తప్పింది నాలుగేళ్ళ క్రిం ద ట' అప్పట్నించి ఆ ఇంటర్ పరీక్ష పూర్తి చేయాలని అమ్మాయి ఆశయం! ప్చ్! ఆ ఒక్క పరీక్ష, అదే ఇంగ్లీషు, అమ్మాయి పాస్ కాలేక పోతుందోయ్! ఇప్పటికి నలుగురు మాస్టర్లను పెట్టాను. అందరూ ఒట్టి బడుద్ధాయిలే! ఒక్కరూ అమ్మాయిని పాస్ చేయించ లేకపోయారు".

గోపీ భయాలన్నీ పటా పంచలై పోయాయి. వీరయ్య ఏం చెప్పబోతున్నాడో ఊహకు అంది, గోపీ మనస్సు ఉరకలు వేయసాగింది.

"అందుకని అమ్మాయికి నీవు ప్రైవేట్ చెప్పి ఇంటర్ పాస్ చేయించాలి. పోయిన నలుగురి మాస్టర్లకూ నెలజీతం ఇచ్చాను. నీకు మాత్రం అలాంటిది లేదు. అమ్మాయిని పాస్ చేయించగలిగావా? మంచి బహుమానం ఉంటుంది. లేకుంటే నీకు ఇస్తున్న జీతమే సరిపోతుంది."

"అలాగేనండీ."

"ఏంటో వెధవ చదువులు! వీటివల్ల ఏంలాభం? పొట్టకూడు పెట్టలేని చదువులు ఎందుకయ్యా? డబ్బుఉండాలిగానీ."

"అవునండీ! చ దు వు లు పరమ దండుగ."

"నాకు నచ్చినమాట చెప్పావు గోపీ! అమ్మాయికి వచ్చే ఎండాకాలంలో పెండ్లి చేద్దామనుకుంటున్నాను. పెద్ద సంబంధమేలే! రెండు లక్షలు కట్నంపారేస్తాను. అయినా ప్రతి వెధవా, 'పిల్ల కనీసం ఇ ం ట ర్ పాస్ కాకపోతే ఎలాగండీ?'

చతుర

అంటాడు. అందుకని అమ్మాయిని బాగా తయారుచెయ్, ఇంటర్ పాస్ అయ్యేటట్లు చూడు! అమ్మాయి పాస్ అయితే బహుమానం ఇస్తాను."

"అలాగేనండీ"

"సరే! రేపట్నుంచి సాయంకాలం ఐదు గంటలకు ఇంటికి రా! నళినితో చెప్తాను నిన్ను అయిదు గంటలకే పంపమని."

"అలాగేనండీ."

"సరే వెళ్ళు!"

గోపీ మారుపలుకు లేకుండా వాకిట్లో కొచ్చాడు.

గోపీ మనస్సు ఆనందంతో కేరింతలు కొడుతున్నది. భువనమోహినికి తను ప్రైవేట్ చెప్పడమా? అంత అపురూప సౌందర్యరాశి ఎదుట రోజూ ఒక గంట గడపడం ఓహ్! ఎంత అదృష్టం!



## 13

సాయంకాలం ఐదు గంటల ప్రాంతంలో గోపీ నళిని రూంకెళ్ళాడు. మిగతా టీచర్లు వాదిస్తున్నారు.

"సారీ! ఇందూ! ఏంచేయనుమరి? విమల ఏమో వాళ్ళమ్మకు సుస్తీగా ఉందని శెలవుపెట్టింది. గోపీనాధ్‌గార్ని వీరయ్య తమ ఇంటికి పిల్చాడు వాళ్ళమ్మాయికి ప్రైవేట్ చెప్పడానికి. అందువల్ల పిల్లలను ఆడించే డ్యూటీ నీకూ, కనకానికీ వేయక తప్పలేదు."

నళిని మిగతా టీచర్లతో ఇలా అంటూంటే గోపీ నళిని రూంలోకెళ్ళాడు. ఇందుమతి, సరోజ, కనకంలు ఈర్ష్యగా, కోపంగా చూచి మూతులు త్రిప్పుకుంటూ వెళ్ళిపోయారు.

"ఏమిటండీ నళినిగారూ?..."

"ఏముందండీ? ఈ రోజు పిల్లలను ఆడించే డ్యూటీ మీదిగదా? విమలేమో సెలవు పెట్టిందాయె. మరి మీరు ఇక ఈడ్యూటీకి రారుగదా! అందుకని మిగతా వాళ్ళకు ఈ డ్యూటీ వేస్తే సణుగుతున్నారు."

"ఊఁ!" అంటూ గోపీ ఒక కుర్చీని లాక్కొని కూర్చున్నాడు

"విమల ఎన్నాళ్లు సెలవు పెట్టిందండీ?"

"ఈ రోజుకు సెలవుచీటీ ఇచ్చింది. బహుశః ఇంకో రెండు మూడు రోజులు రాదేమో?"

"ఊఁ!"

"గోపీగారూ! మిమ్మల్ని వాళ్ళ అమ్మాయికి ప్రైవేట్ చెప్పమన్నారటగదా వీరయ్యగారు?"

"అవునండీ!"

నళిని కొంచంసేపు మౌనంగా ఉన్నది.

"గోపీగారూ, మీరు మరోలాభావించకుంటే ఒక్కమాట చెప్పనా? మీరు వీరయ్యగారి అమ్మాయికి ప్రైవేట్ చెప్పడం నాకు ఇష్టంలేదు. వీరయ్య ఏమీ ఇవ్వడు."

"అది నిజమే. వాళ్ళ అమ్మాయి పాస్ అవుతే ఏదో బహుమానం ఇస్తానన్నాడు. ఆ బహుమానంతో అమ్మకూ,

చెల్లెళ్లకూ తలా ఓ చీర కొనివ్వాలని నా ఆశ! ఇంతవరకూ వాళ్ల కష్టార్జితమే తిన్నాను నా చదువుకు డబ్బు తగలెయ్యకుండా ఉంటే నా చెల్లెళ్ళకు ఒకరిద్దరికైనా పెండ్లి అయ్యేది. కనీసం అంత తిండి అయినా తినగలిగేవాళ్ళు !

నళిని సానుభూతిగా గోపీ వంక చూచింది.

"మరేం చెయ్యాలి! వీరయ్య ప్రైవేట్ చెప్పమంటే, కాదనడం సబబుగా ఉంటుందంటారా?" అన్నాడు గోపీ.

నళిని దీర్ఘంగా నిట్టూర్పు విడిచి, "నిజమే"నని ఒప్పుకుంది. ఆఖరుకు అన్నది

"కానీ, ఒక్కమాట"

"చెప్పండి?"

నళిని భయంగా చుట్టూరా చూచింది. బడి అంతా ఖాళీగా ఉంది. టీచరూ, పిల్లలూ గ్రౌండ్‌లోకి వెళ్ళిపోయారు.

"వీరయ్య కూతురి కారెక్టర్ మంచిది గాదు"

"చూడండి నళిని గారూ ! ఆమె కారెక్టర్ ఆమె పర్సనల్ ఎఫైర్ ! మనకేం సంబంధం ఉంది? మనం ప్రైవేట్ చెప్పి, మన బహుమతేంటో, మనం పనూలు చేసుకుందాం? — కొంప తీసి, నన్ను ... షాడు ... చేస్తుందని మీ భయమా? డోంట్ వర్రీ ఆమె రెండు లక్షలు పోసి, తన కిష్టమైన మొగుణ్ని, కొనుక్కోగలదు ? నాలాంటి బక్కవాడూ, దరిద్రుడూ ఆమె దృష్టిలో ఒక మనిషి అనిపించడు."

నళిని ఏదో చెప్పాలని ఆరాటపడింది. అయినా, ఏమీ మాట్లాడలేకపోయింది. "గోపీ గారూ, అన్నట్లు మీకేమీ పెండ్లి సంబంధాలు రావడం లేదా?" "నాకా? పెండ్లి సంబంధాలా? భలే జోక్ వేశారు నళిని గారూ?"

"మీకేమండీ ? ఎం. ఎ. చదివారు! ఈనాడు గాకున్నా, ఏనాడైనా మీ కాళ్ల మీద మీరు నిలబడగలరు! అంతెందుకు. నన్ను చూడమన్నారా? మీకు పెండ్లి సంబంధం"

"చూడండీ, అయినా ఇంకోసారి బ్యాంక్ ఉద్యోగానికి ట్రై చేద్దామనుకుంటున్నాను. అప్పటిదాకా పెండ్లి సంగతి, ఆలోచించగూడదనుకున్నాను"

"పోనీ! అప్పుడే చేసుకోండి! ఈ లోపల ఒక సంబంధం చూస్తే తప్పేముంది?"

"చూడొచ్చు"

"విమలను గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

గోపీ ఉలిక్కిపడ్డాడు. పరిశీలనగా నళిని ముఖంలోకి చూశాడు. నళిని భావం ఏమయిఉంటుందా? అని. అయితే, నళినిని చూడగానే ఆమె భావాల్ని గ్రహించడానికి బదులు, మరో ఆలోచన వచ్చింది. నళినికి తనంత వయస్సు ఉండొచ్చు. విమలకంటె చక్కగా ఉన్నది.

నళిని, తల దించుకొని అన్నది "విమలను గురించి, మీ అభిప్రాయం చెప్పండి! నేను ఆమెతో మాట్లాడుతాను. అవసరం అయితే వాళ్ళ పెద్దలనూ అడుగుతాను. అయితే వాళ్ళు అంతగా కట్నం ఇచ్చుకోలేరు."

"కట్న కానుకలతో, నాకు సంబంధం లేదండీ! ఈ బ్యాంక్ ఉద్యోగం సంగతి తేల్చుకొని, పెండ్లి సంగతి ఆలోచించా

లని వుంది."

"కట్నం కానుకల ఆశ లేదు. విమల గూడా మీకు నచ్చి ఉంటుంది. ఇంక ఆలశ్యం దేనికి? పెళ్లి చేసుకుంటే పోలా? ఒకరికొకరు తోడుగా వుండ వచ్చు. విమల వేళపట్టున, ఇంత అన్నం వండి పెడుతుంది. మీరు మాత్రం ఎన్నాళ్ళని చేతులు కాల్చుకుంటూ బడి చెబుతూ బ్యాంక్ పరీక్షలకు ప్రిపేర్ కాగలరు? హాయిగా విమలను పెండ్లి చేసుకోండి

"నళినిగారూ! సరే, ప్రయత్నించండి అయినా మీకు శ్రమ" "భలేవారే, శ్రమేమిటండోయ్! పెండ్లి సంబంధాలు కూర్చడంలో ఎంత ఆనందముందో మీకు తెలియదు. మీరు...మీరు ..మా వంశాంకురాలను నిలిపారు. నన్ను ఎన్నటికీ విముక్తిలేని రుణగ్రస్తురాలిని చేశారు.

"సరే, కానివ్వండి. మీరు ఎప్పుడు చెబితే, అప్పుడు విమలమెడలో తాళిబొట్టు కడతాను మీరు నా గార్డియన్"



## 14

వీరయ్య ఇల్లు ఊళ్ళో నడిబొడ్డున ఉన్నా ఏకాంత ప్రదేశంలా ఉంటుంది. గేటు తీసుకొని లోపలికెళ్ళగానే ఒక అందమైన అరణ్యంలోకి వెళ్ళినట్లుంటుంది. రకరకాల పూల మొక్కలు, గుబురుగా పెరిగిన కొబ్బరి, వేప చెట్లూ ఉంటాయి ఇంటి ముందు. పంచలో ఒక చిన్న సైజు మీటింగ్ పెట్టుకో డానికి వీలైనన్ని కుర్చీలు ఉంటాయి. లంకంత ఇంట్లో నరసంచారం అసలు ఉన్నదా ? అన్న భ్రమ కలిగిస్తుంది వీరయ్య ఇల్లు.

గోపీ, వీరయ్య ఇంటి వాకిటి గేటును తోసి పంచను దాటి ఇంట్లోకి ప్రవేశించాడు. ఒక సోఫాలో భువనమోహిని చక్కగా అలంకరించుకొని కూర్చుని ఉంది. గోపీని చూడగానే భువనమోహిని దిగ్గున లేచింది. "రండి రండి గోపీనాథ్ గారూ" అన్నది. గోపీ దిగ్భ్రాంతిగా భువనమోహిని వంక చూశాడు. పోయిన సారికంటే ఇంకా అందంగా ఉన్నట్లు కనిపించింది భువనమోహిని...అయినా ఈమె తనకు స్టూడెంట్ మాత్రమే. విమల కాబోయే భార్య. ఇక నుంచీ విమలలోనే తను అందాలు చూడాలి అని అనుకున్నాడు. ఆ భావన రాగానే గోపీకి పైత్యప్రకోపం కొద్దిగా తగ్గినట్లుంది.

"రండి పైకెళ్దాం" అన్నది భువనమోహిని!

భువనమోహిని ముందు వెళ్తుంటే గోపీ అనుసరించాడు.

"ఇల్లంతా నిర్మానుష్యంగా ఉంది" అన్నాడు గోపీ.

"అవునండీ. అందుకే నాకీఇంట్లో ఏమీ తోచదు మా నాన్నగారు ప్రొద్దుగూకులూ వ్యవహారాలు, వ్యాపారాల మీద తిరుగుతుంటాడు. నాకు ఒక అన్న ఉన్నాడు. అన్ని పనులు వాడివే ఇంటి పట్టున క్షణం ఉండడు. ఇక మా

అమ్మ ఉన్నదంటే ఆమకు ఎప్పుడూ ఏదో జబ్బు. క్రింద అంతస్తులో ఒక రూంలో ఉంటుంది. ఇక నౌకర్లూ నేనూ ఈ ఇంట్లో ఉండేది. నౌకర్లు అయినా వాళ్ళ డ్యూటీ ప్రకారం వాళ్ళు పని చేసుకొని వెళ్తూంటారు."

ఇలా అంటూ భువనమోహిని గోపీని పైఅంతస్తుకి తీసుకెళ్ళింది. అక్కడ ఒక గది, వరండా ఉన్నాయి. వరండాకు ఎదురుగా రెండు గార్డెన్ ఛైర్స్, ఒక చిన్న బల్ల. బల్లమీద ఆపిల్, దానిమ్మ, చక్రకేళీ పండ్లూ, కొన్ని పేకెట్లూ. పిట్ట గోడ మీద రకరకాల మొక్కలూ, చెట్లూ ఉన్న పూలకుండీలు వరసగా ఉన్నాయి. అది ఒక పార్కులా ఉంది చూసేందుకు.

భువనమోహిని, గోపీని కుర్చీల దగ్గరకు తీసుకొని వచ్చి కుర్చీ చూపించి తనూ కూర్చున్నది. గోపీ టేబిల్ మీద సరంజమా చూచి ఇది టీ పార్టీయా? లేక ప్రైవేట్ క్లాసా? అనుకున్నాడు. భువనమోహిని పుస్తకాలు ఏమీ కనబడలేదు

"మాస్టరుగారూ ఈ రోజున మనం పరిచయాలు కానిచ్చు కుందాం. రేపటి నుండీ పాఠాలు మొదలు పెడుదురు గాని"

"మీ ఇష్టం"

భువనమోహిని టేబిల్ మీద ఉన్న పేకెట్స్‌లోనుండి బిస్కెట్లను దీసి ఒక ప్లేట్‌లో గోపీ ఎదురుగా పెడ్తూ "మీకు బిస్కెట్లంటే బాగా ఇష్టమా ?"

"అదేం లేదు. అట్లని అయిష్టమూ లేదు. మొన్న మీ ఇంటికి వచ్చినప్పుడు బిస్కట్లు చాలానే తిన్నాను. ఏమైనా అనుకుంటారన్న భావం కూడా లేకుండా."

"ఫరవాలేదు. ఎవ్వరూ ఏమీ అను కోలేదు, పైగా మీరలా మొహమాట పడకుండా మా ఆతిథ్యాన్ని స్వీకరించి నందుకు చాలా సంతోషించాను."

గోపీ బిస్కెట్ ఒకటి తీసుకొని తింటున్నాడు. భువనమోహిని ఆపిల్ పండును ముక్కలుగా తరిగి ప్లేట్‌లో పెడుతున్నది.

"హోటల్ భోజనమా?"

"లేదండీ బడిలోనే వండుకుంటు న్నాను"

భువనమోహిని ఆశ్చర్యంగా గోపీ వంక చూచింది.

"వంట చేయడం అలవాటు ఉన్నదా?"

"లేదండీ ఇక్కడ కొచ్చాక నేర్చు కున్నాను"

భువనమోహిని తరువాత ప్రశ్న వేయలేదు. ఎందుకంటే ఆమెకు తెలుసు. తన తండ్రి వారికిచ్చే జీతం వందరూపా యలు అని.

గోపీ మెల్లగా ఒక బిస్కట్ పేకెట్‌ను ఖాళీ చేశాడు, నడుమ నడుమ ఆపిల్ ముక్కలను నంజుకుంటూ. భువనమోహిని మరో పేకెట్‌ను తీసి అందులోనుండి బిస్కట్‌లను గోపీ ప్లేట్‌లో పెడుతున్నది. గోపీ "ఇక చాలండీ" అన్నా ఆమె విన లేదు. ఈ క్రొత్త పేకెట్‌లోని బిస్కెట్లు చాలా రుచిగా ఉన్నాయి. గోపీ బిస్కెట్లను పట్టిస్తూనే ఉన్నాడు. నడుమ నడుమ పండ్లు అంచుకుని తింటున్నాడు.

గోపీ అలా ఏడింటిదాకా బిస్కట్లూ,

పండ్లూ సమిలాడు. భువనమోహిని గోపీని చిన్నచిన్న ప్రశ్నలేవేసింది— గోపీ పెద్ద ఉపన్యాసం ఇచ్చే అవసరం లేనివి.

గోపీ ఏడింటికి కుర్చీలో నుండి లేచి "వస్తానండీ! రేపు మళ్ళీ ఐదింటికి వస్తాను. పుస్తకాలు, రెడీగా పెట్టుకోండి" అని బయలుదేరాడు. భువనమోహిని గోపీని వెంబడించి పంచదాకా వచ్చి "ఇక ఉంటానండీ" అన్నది.

గోపీ హుషారుగా నడిచి బడికిచేరాడు. ఈరోజున చేతులు కాల్చుకోనవసరం లేదనుకొని సంతోషపడుతూ.

మరునాడు ఉదయం గోపీ బడికి హాజరయ్యాడు. విమల ఆనాడుగూడా రాలేదు. గోపీ క్లాసుకెదురుగాఉన్న క్లాస్ కనకం కండక్ట్ చేసింది. అయితే ఈ రోజు కనకం గోపీ వంక చిర్రుబుర్రు లాడుతూ చూడలేదు. మౌనంగా తన పాఠం తాను చెప్పుకుపోయింది.

సాయంకాలానికి యథాప్రకారంగా గోపీ వీరయ్య ఇంటికెళ్ళాడు. వీరయ్య ఇల్లు, నిన్న ఎలాగుందో ఈరోజునా అలాగే ఉంది. భువనమోహిని మళ్ళీ గోపీని మేడ మీదకు తీసుకెళ్ళింది బిస్కెట్ పొట్లాలు, పండ్లూ, తయారుగా ఉన్నాయి. ఈ రోజు అదనంగా లడ్డూలు కూడా ఉన్నాయి పుస్తకాలు మటుకు ఎక్కడా కనబడలేదు.

గోపీ కొద్దిసేపు పిచ్చాపాటి మాట్లాడాడు. భువనమోహిని వినయంగా సమాధానాలు చెప్పింది. గోపీ లడ్డూలూ, బిస్కట్లూ తినడం మొదలెట్టాడు. "భువనమోహినిగారూ! ఈ రోజు పుస్తకాలు తేలేదండీ మీరు"

"కానివ్వండి, మాస్టారూ తొందర ఏముంది"

"అలా అంటే ఎలాగండీ అసలు మీకు ఎంత వరకూ తెలుసో ఇంకా ఎంత చెప్పాలో ఒక అంచనా అంటూ ఏర్పడితే ఆ తరువాత మీరన్నట్లు స్లోగానో, స్పీడ్‌గానో పాఠాలు చెప్పుకొని పోవచ్చు"

"నిజమేననుకోండి నాకు ఈ పరీక్షలకు వెళ్ళి వెళ్ళి విసుగొచ్చింది. పాసవుతానన్న నమ్మకం పోయింది. మా నాన్న 'ఎలా అయినా ఈ ఇంటర్ గట్టెక్కించు తల్లీ' అంటాడు

గోపీ నీరుగారి పోయాడు. ఇలాంటి విద్యార్థికి తనేం చదువు చెప్పగలడు? ఈమె ఏం చదువుతుంది? ఏం పాస్ అవుతుంది?

భువనమోహిని గోపీ ఆలోచనలు గ్రహించింది నవ్వుతూ గోపీతో అన్నది.

"గోపీనాథ్‌గారూ నాకు ప్రైవేట్ చెప్పినందుకు నాన్నగారు ఏమిస్తా నన్నారు?"

"ఏమీలేదండీ"

భువనమోహిని ఆశ్చర్యంగా ప్రశ్నార్థకంగా గోపీ వంక చూచింది.

"అవునండీ జీతం అంటూ ఏమీ ఇవ్వరట. మీరు గనుక పాస్ అయితే, బహుమానం ఇస్తామన్నారు. మీమాటలు చూస్తుంటే..."

"అలాగా నండీ నాకు తెలియదు సుమండీ"

"సరే పోనీండి. అయినా మీరు కష్టపడి చదివితే మీకూ లాభమే నాకూ లాభమే?"

"అలాగే ప్రయత్నిస్తానండీ!"

అని భువనమోహిని కొన్ని ఆపిల్ ముక్కలను తిరిగి గోపీ చేతిలో బల వంతంగా ఉంచి 'తినండి' అన్నది.

గోపీ ఆపిల్ ముక్కలను నిరుత్సాహంగా నములుతున్నాడు. భువనమోహిని మెల్లగాలేచి మేడగదిలోకి పోయి కొద్ది క్షణాలుండి మళ్ళీ తిరిగివచ్చింది.

తిరిగివచ్చిన భువనమోహిని బల్లమీద ఒక వందరూపాయల నోటును పెట్టి దానిపైన ఒక బిస్కెట్ల పొట్లాన్ని పెట్టింది అది ఎగిరిపోకుండా.

గోపీ ఆశ్చర్యంగా ఆ నోటువంక చూచి, భువనమోహినివంక చూచాడు.

"తీసుకోండి!"

"అబ్బే ఎందుకండీ !" అన్నాడు గోపీ. ఒకప్పుడు యూనివర్శిటీలో ఉండగా ఇలాంటివి చూచేవాడు గోపీ. ఆ తరువాత ఇలాటి కాగితాలు బొత్తిగా దర్శనం ఇవ్వలేదు.

"తీసుకోండి!"

"వద్దండీ! మీరు శ్రద్ధగా చదవండి! నాన్నగారి దగ్గర బహుమతి తీసుకుంటాను... ఆ తరువాత... మీకూ... ఇవ్వాలని ఉంటే...చూద్దాం!"

గోపీ ఒక ఆడపిల్లదగ్గర డబ్బును తీసుకోడానికి బిడియపడ్డాడు. అది జీతం అని అనుకోవడానికీ మనస్కరించలేదు.

ఇంతలో ప్రొద్దుగూకడంతో "వస్తానండీ" అని లేచాడు గోపీ. భువనమోహిని విషాదంగా వందరూపాయల నోటువంక చూచి, గోపీవంక చూచింది.

"మీరు ఏమీ బాధ పెట్టుకోకండి, బాగా చదివి మీరు పాసవ్వండి. అప్పుడు మీదగ్గర సంతోషంగా పుచ్చుకుంటాను."

గోపీని యథాప్రకారంగా పంచదాకా సాగనంపింది భువనమోహిని. గోపీ గేటు తెరుచుకుని వాకిట్లోకి వస్తుంటే ఎదురుగా కారు ఆగింది. అందులోనుండి అమర్‌నాథ్ దిగి—

"ఎవరు నువ్వు?" అని తీక్షణంగా అడిగాడు గోపీని.

అమర్‌నాథ్ ప్రశ్న గోపీకి చురుక్కుమన్నా తమాయించుకొని సమాధానం చెప్పాడు గోపీ. "నేను మీ కాన్వెంటులో టీచర్‌గా ఉంటున్నానండీ, అమ్మాయి గారికి ప్రైవేట్ చెప్పమని నాన్నగారన్నారు. ప్రైవేట్ చెప్పి వెళ్ళిపోతున్నాను."

"ఓహో ప్రైవేట్ మాష్టారా! సారీ సార్, మీ పేరేంటి?"

"గోపీనాథ్."

"ఎలా ఉంది మా చెల్లి స్టాండర్డ్?"

"ఫరవాలేదు."

"బాగా చెప్పండి సార్."

"అలాగే."

అమర్‌నాథ్ నేరుగా ఇంట్లోకెళ్లాడు. గోపీనాథ్ బడికి చేరుకున్నాడు.



## 15

ప్రొద్దుగుంకబోతున్నది. నళిని బడి నుండి వచ్చి ఇంటి తలుపుతీసి వంటి

ప్రయత్నాలు చేస్తున్నది

ఒక సూట్‌కేస్ తీసుకొని విమల ఇంట్లోకొచ్చింది.

"హాయ్ విమలా! ఎప్పుడూ రావడం?"

అర్థంలేని ప్రశ్న అనుకుని విమల సమాధానం చెప్పకుండా సూట్‌కేస్‌ను అవతలపెట్టి మంచంమీద కూర్చుంది.

నళినివచ్చి విమలప్రక్కగా కూర్చుని విమలను పరిశీలిస్తున్నది. విమల కట్టుకున్న చీర, చాక్లెట్ రంగులో క్రొత్తగా కనబడింది నళినికి చీరను పట్టుకొని, "ఇదేం చీర? చాలాబావుంది" అన్నది.

"ఇది బిన్నీ జార్జెట్."

"ఎంత?"

"నూట పాతిక."

నళిని ఆశ్చర్యంగా విమల చేతినున్న వాచీనీ, వ్రేలికిఉన్న ఉంగరాన్నీ, మెడలో ఉన్న బంగారునెక్లెస్‌నూ చూచింది. విమల నళిని ఆశ్చర్యాన్ని గమనించి అన్నది.

"నిన్న అమ్మ బలవంతంమీద నాన్నగారు కొన్నారు. నాకు పెండ్లిసంబంధాలు చూస్తున్నారు పెండ్లి కావలసిన పిల్ల బోసిగా ఉండటం బాగాలేదని అమ్మ అన్నది."

"విమలా, అన్నట్లు అమ్మకెలా ఉంది?"

"బాగానే ఉంది."

"పత్యం తీసుకున్నదా?"

"ఆఁ"

"పెండ్లిసంబంధాలేమైనా చూశారా?"

"ఇంకా లేదు."

"కనీసం ఏ ఒకటైనా దృష్టిలో ఉందా?"

"ఇంకా లేదు."

"నేనో సంబంధం చెబుతాను, చేసుకుంటావా?"

విమల విస్మయంగా నళినివంక చూచింది.

"నీకూ తెలిసిన సంబంధమే."

విమల కండ్లు ఇంకా పెద్దవిచేసి నళినిని చూడసాగింది.

"గోపీనాథ్" అన్నది నళిని.

విమల ఆశ్చర్యపడింది. అయిష్టంగా ముఖంపెట్టింది. మళ్ళీ నళిని అన్నది, "నేను గోపీనాథ్‌ను అడిగాను. కొన్నాళ్ళు ఆగాలన్నాడు. మంచి సంబంధం చిక్కితే అలా అనడం మంచిదికాదని చెప్పాను. పెండ్లిచేసుకొని ఉద్యోగ ప్రయత్నం చేయమన్నాను. సరేనన్నాడు. ఏంటి చెప్పు ? నీకూ ఇష్టమేనా?"

గోపీమీద విమలకు చెప్పరానంత అసహ్యం పుట్టింది. అయినా నళిని గమనిస్తుందేమోనని, చివాలునలేచి ఏదో పని ఉన్నట్లు వాకిట్లోకి వచ్చింది. బాత్‌రూమ్‌కి వెళ్లి ముఖం కడుక్కొని వచ్చి నళిని ప్రక్కన కూర్చుంది.

మళ్ళీ నళిని తగులుకుంది.

"చెప్పు విమలా! ఊఁ అను! మిగతా సంగతులు నేను మాట్లాడుతాను. గోపీ పైసా కట్నం పుచ్చుకోరు. సింపుల్‌గా పెండ్లి చేసేస్తే సరి! మీ వాళ్లకు ఒక బాధ్యత తీరుతుంది. నీకు గూడా చక్కని భర్త లభిస్తాడు. ఏమంటావు ?"

"నాకు గోపీనాథ్‌గార్ని చేసుకోవడం ఇష్టం లేదు."

నళిని నమ్మలేనట్లుగా ఆశ్చర్యంగా విమల వంక చూచింది.

"అవును నళినీ! ఇక ఆ విషయం మర్చిపో"

"విమలా నా మాట విను. మంచి అవకాశాన్ని పోగొట్టు కుంటున్నావు తెలుసుకో. గోపీ ఈనాడు నిరుద్యోగి కావచ్చు! కానీ ఎం.ఎ. చదివాడు. ఏనాడో ఒకనాడు అతడు మంచి ఉద్యోగం సంపాదిస్తాడు.నీ జీవితం మూడు పువ్వులు ఆరు కాయలుగా ఉంటుంది?"

"అబ్బా నళినీ చెబుతుంటే నీకు కాదూ? నాకు గోపీ అంటే ఇష్టం లేదు"

"విమలా ఎన్ని జన్మలు ఎత్తినా గోపీ లాటి సంబంధం నీకు దొరకదు గోపీ కూడా నీ వంటే అభిమానంగా ఉంటున్నాడు.

"ఏం ఫరవాలేదు ప్రపంచం గొడ్డు పోలేదు"

"విమలా నా మాటవిను నువ్వు ఎంత అదృష్టాన్ని కాలదన్ను కుంటున్నావో నీకు తెలియదు. గోపీ పేదవాడే బాధ్యతలు గూడా ఉన్నాయి. అయినా నీ సంగతీ ఆలోచించుకో ఏ విధంగా ఆలోచించినా గోపీ సంబంధం మనకంటే గొప్పదే గోపీ మంచివాడు,బుద్ధిమంతుడు నీకు ఈడూ జోడూ విమలా నీ సంగతి కూడా నీవు ఆలోచించుకో నిష్పాక్షికంగా ఆలోచిస్తే గోపీ కన్నా నీకు ఎక్కువ అందంలేదు"

విమల కోపంతో ఘూర్ణిల్లింది.

గోపీ అందగాడంటావు మహా పురుషుడంటావు గొప్ప వాడంటావు విజ్ఞాని అంటావు అతను నీ పిల్లల్ని సముద్రంలో నుండి రక్షించినప్పటి నుండీ అతడంటే నీకు ఆరాధన పెరిగింది అతడంటే నీకు ఇష్టం. హాయిగా నీవే అతడ్ని పెండ్లి చేసుకో కూడదూ? మధ్య నాదుంప తెంపడం దేనికి?"

నళిని విమల మాటలకు బాణం దెబ్బ తిన్న లేడి పిల్లలాగా గజగజా వణికి పోయింది. విమల వంక ఆశ్చర్యంగా చూచింది. ఆవేశంతో కోపంతో నోట మాట రాలేదు.

"అవును నళినీ, నా కంటే నవు అందంగానే ఉంటావు. ఆ గోపీ అ పే నీకూ ఆరాధనా గౌరవం ఉన్నాయి. నీవూ గోపీ సమాన వయస్కులు నీవే గోపీని పెండ్లి చేసుకోరాదూ ?"

నళిని మంచం మీద నుండి చివాలున లేచింది దూరంగా వెళ్ళి కుంపటి ముందు కూర్చుంది. విమలను చూడడానికిగానీ, ఆమె మాటలు వినడానికిగానీ తనకు శక్తి లేదనిపించింది.

నళిని విమల వంక చూసింది విమల గోడవైపు తిరిగి పడుకున్నది. నళిని యాంత్రికంగా వంట పనులు చూసు కుంటున్నది. నళిని మనస్సు మనస్సులో లేదు.



# 16

ఆరోజూ, మరుసటి రోజూ నళిని, విమల మాట్లాడుకోలేదు. మౌనంగా ఎవరి పని వాళ్ళు చూసుకున్నారు. మరునాడు ఉదయం బడికి పోయేప్పుడు నళిని ఆఖరిసారిగా అన్నట్లు విమలను భయ

పడుతూనే అడిగింది.

"విమలా, రాత్రి నీవన్నదే ఆఖరు మాటా? గోపీనాథ్..."

"నళినీ, ఇక ఆయన సంగతి నా దగ్గర ఎత్తకు" అంటూ విసవిసా బడికి వెళ్ళిపోయింది.

నళిని చిన్నబుచ్చుకుంది.

విమల బడిలోకి రాగానే గోపీ అడిగాడు.

"విమలా! ఎలా ఉంది, మీ అమ్మకు?"

విమల సమాధానం చెప్పకుండా ముఖం త్రిప్పుకొని, నళిని రూంలోకి వెళ్ళి రిజిష్టర్‌లో సంతకం చేసింది. గోపీ గూడా రూంలోకి వెళ్ళాడు.

"కోపం వచ్చిందా ?" మెత్తగా అడిగాడు గోపీ.

విమల సంతకంచేసి, గోపీ వంక కన్నెత్తి చూడకుండా రూంలో నుండి, చర చరా నడిచి క్లాసుకెళ్ళిపోయింది.

గోపీకి మండుకొచ్చింది. "ఎంత పొగరు" అనుకొని, పండ్లు నూరుకున్నాడు. మిగతా టీచర్లు కూడా వచ్చి సంతకం పెట్టి గోపీని పలకరించి వెళ్ళిపోయారు.

కనకం మట్టుకు గోపీ వంకచూసి మందహాసం చేసి "క్లాసుకు రారా?" అని అడిగింది.

గోపీ ఆశ్చర్యంగా కనకాన్ని చూచి "వస్తున్నాను" అన్నాడు.

కనకం వెళ్ళిపోయింది.

నళిని రూంలోకొచ్చి, ఒక్కసారి గోపీ వంక చూచి తల వంచుకొని, కుర్చీలో కూర్చున్నది. విమల గుర్తుకొచ్చి సిగ్గుపడిపోయింది నళిని.

"ఊఁ! అంటే, విమలకు నన్ను చేసుకోవడం ఇష్టం లేదన్నమాట"

నళిని తల ఎత్తకనే "అవును" అన్నది.

"నళిని గారూ, మీరెందుకండీ బాధపడుతారు? పోనివ్వండి తనకు ఇష్టమైన వాడినే చేసుకోనివ్వండి? ఇందులో బలవంతం ఏముంది? ఏదో మీరు చెప్పబట్టి...అలా ... నిర్ణయించుకున్నాను. మీరు అనవసరంగా బాధ పడకండి."

నళిని, ధైర్యంగా గోపీ ముఖంలోకి చూచింది.

"గోపీనాథ్ గారూ, నన్ను క్షమించండి. ముందు విమల మనస్సును, తెలుసుకోకుండా ఏదో మీ దగ్గర వాగాను"

"పోనీండి! ఫర్వాలేదు. ఇప్పుడు పెండ్లి కావాలని నేనేం ఏడవటం లేదు."

"అసలు విమలలో ఏదో మార్పు, వచ్చిందండీ! ఏమైనా, విమల పూర్వపు విమల కాదు."

గోపీ మౌనంగా లేచి, తన క్లాస్‌కు వెళ్ళాడు.

సాయంకాలం ఐదు గంటలు కాగానే గోపీ క్లాసులో నుండి నేరుగా వీరయ్య ఇంటికి బయలుదేరాడు, నళినిని చూడకుండానే. వీరయ్య ఇంటికెళ్ళగనే భువనమోహిని రోజులాగా ఎదురు రాలేదు. లోపలికి వెళ్ళాలా? వద్దా? అని గోపీ అనుకుంటుండగనే పని మనిషి గోపీతో "అయ్యగారూ, అమ్మాయి గారు మేడమీద ఉన్నారండీ! తమర్ని రాగానే పైకి రమ్మన్నారు" అంది.

గోపీ ఆమె మాటలు విని నేరుగా మూడో అంతస్తులోకి వెళ్ళాడు. భువన

మోహిని విలాసంగా ఒక కుర్చీలో కూర్చుని వుంది.

ఆరోజు చేతులులేని జాకెట్ ను ధరించి వుంది. తెల్లని చీరను కట్టుకుని తల నిండా పూలు పెట్టుకుంది. గోపీ కనబడగానే జడ ముందుకు తీసుకుని సవరించుకుంటున్నదల్లా జడను వెనక్కు వేసుకుని—

"రండి" అన్నది.

గోపీ భువన మోహినిని గమనించకుండా వచ్చి, ఆమె ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు భువన మోహిని గోపీవంక ఆశ్చర్యంగా చూచి, బిస్కట్ల ప్లేట్ ను గోపీ ముందు పెట్టింది.

అయినా గోపీ, బిస్కట్ల వంక చూడలేదు.

"ఆరోగ్యం బాగాలేదా? మాష్టారూ?"

"బాగానే...వుంది"

"ఏమిటి? అదోలా ఉన్నారు"

"ఏమీలేదండీ మనసు బాగా లేదు. ఈరోజు కూడా పాఠం మొదలయ్యేట్లుగా లేదు"

"జ్వరం కానీ రాలేదు గదా?" అంటూ ఆతృతగా వచ్చి గోపీ నుదుటిని తాకి చూచిరది.

గోపీ ఒళ్ళు ఝుల్లుమన్నది ఆ స్పర్శతో.

భువన మోహిని గోపీ నుదుటినీ. చెంపలనూ, మెడనూ తాకి చూచింది, గోపీ చక్కిలిగిలి పెట్టినట్లుగా, మెలికలు తిరిగి పోయాడు.

''అబ్బే...ఏమీ...లేదండీ"

"అలా కాదు ... రండి ... అమృతాంజనం రాస్తాను...కాస్సేపు విశ్రాంతి తీసుకుందురుగాని" అంటూ గోపీని రెక్కపట్టుకొని లేపింది భువన మోహిని. గోపీ భువన మోహిని వెంట నడుస్తూ, ఇబ్బందిగా ఫీలౌతూ "జ్వరం లేదూ... ఏమీ లేదు" అని గొణుగుతూనే వున్నాడు.

భువన మోహిని గోపీని మేడ మీది రూంలోకి తీసుకెళ్ళింది గోపీ సణుగుడును లెక్కచేయకుండా. గోపీని బెడ్ మీదకు చేర్చి పడుకోబెట్టింది. గోపీ మీదుగా ఒక చేయివేసి, రెండో చేత్తో గోపీ నుదుటిని సర్దుతూ ముఖంలో ముఖం పెట్టి అడిగింది "ఎలా ఉంది?"

గోపీకి అప్పటికిగాని సంగతి అర్థం కాలేదు. అర్థం అయ్యాక కొంటెతనం పుట్టుకొచ్చింది.

"చాలా బాగా వుంది" అని భువన మోహినిని గాఢంగా కౌగిలించుకుని మీదకు లాక్కున్నాడు గోపీ.

భువన మోహిని నిశ్శబ్దంగా గోపీ కౌగిలిలో ఒదిగిపోయింది.

రాత్రి ఎనిమిది గంటలకు గోపీ గదిలో నుండి వెలుపలికొచ్చి ఆరుబయట ఉన్న కుర్చీలో కూర్చున్నాడు. ఎదురుగా బల్లమీద ఉన్న టిఫెన్లూ, పండ్లూ ఆవురావురుమంటూ తిన్నాడు.

భువనమోహిని, గదిలో నుండి వచ్చి ఒక కుర్చీలో కూర్చోబోయింది. గోపీ ఆమెను చెయ్యి పట్టుకొని లాగి తన ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు. ఒకఆపిల్ ముక్కను ఆమె నోటికి అందించాడు. భువనమోహిని, ఆ ముక్కను తినక "అబ్బా ! ఉండండి ! నాకు చచ్చేసిగ్గుగా ఉన్నది" అన్నది

"మోహినీ ! మనిద్దరం పెండ్లి చేసు

కుందాం !"

"ఛీ పొండి! ఆమాటలంటే నాకు సిగ్గు ముంచుకొని వస్తుంది"

"సరే నీకు సిగ్గు తగ్గాకే పెండ్లి సంగతి ఎత్తుతాను"

భువనమోహిని మాట్లాడకుండా తన రవికెలో నుండి ఐదువందల రూపాయల కాగితాలను తీసి గోపీ జేబులో పెట్టింది.

గోపీ ఆశ్చర్యంగా చూస్తూ "ఏంటిది" అన్నాడు.

"మంచి పాంటూ, షర్టూ కుట్టించుకోండి ఈ గుడ్డలు బాగాలేవు"

"వద్దు మోహినీ మన మధ్య డబ్బు సంగతులు రాకూడదు"

"ఏం బాధ పడకండి ? నా దగ్గర డబ్బు లేకుంటే మీ దగ్గర ఉంటే మీరు ఇవ్వరా ?"

"ఎందుకివ్వను ?"

"అందుకే తీసుకోండి !"

గోపీ పలుక లేదు.

"ఇక వెళ్ళిరండి ! ఆలస్యం అయితే నాన్నా, అన్నయ్యా వస్తారు."

డబ్బున్న జేబుమీద చేయిపట్టుకొని భారంగా లేచాడు గోపీ అంత డబ్బును మోయలేనట్లుగా.

భువనమోహిని మేడమెట్ల దాకాగోపీని సాగనంపింది.

గోపీ మెట్లు దిగి క్రిందకొచ్చి బజార్లోకొచ్చాడు.

బజార్లో నడుస్తుంటే గోపీ సమాధాన పడ్డాడు భువనమోహిని దగ్గర డబ్బుతీసుకుంటున్నప్పుడు, ఏదో చెప్పరాని బాధ కలిగింది గోపీకి. కానీ ఇన్నాళ్ళుగా కళ్ళేలు వేయబడిన కోరికలు పాంటూ, షర్టూ, బూట్లూ, వాచీ, ఉంగరం, ట్రాన్సిస్టర్ రేడియో రూపాలతో విజృంభించి గోపీని వశపరచుకున్నాయి.

బడిదగ్గరకెళ్ళి గేటు తలుపును తీశాడు. బడి నౌకరు, బాలమ్మ కనబడింది గేటు దగ్గర.

"అయ్యగారూ ! మీ కోసమే చూస్తున్నాను"

"ఏంటి బాలమ్మా ? సంగతులు ?"

"అన్నీ సంగతులే బాబూ ! పదండి ! చెబుతాను !"

గోపీ బడిలోకి ప్రవేశించి ఒక కుర్చీ తెచ్చుకుని ఆరుబయట కూర్చున్నాడు.

"అయ్యగారూ విమలమ్మ ఇల్లు ఖాళీ చేసి కొత్త ఇంట్లో చేరింది"

"ఎప్పుడూ ?" గోపీ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఒక గంట కిందనండీ. నేనే విమలమ్మ సామానులను నళినమ్మగారి ఇంటి నుండి తీసుకొనిపోయి కొత్త ఇంట్లో చేర్చాను."

"కొత్త ఇంటికి అద్దె ఎంత ?"

"నెలకు 50 రూపాయలంట"

గోపీకి ఆశ్చర్యం వేసింది.

"బాబు గారూ యాడా అనబాకండీ ఆ ఇల్లు అమర్‌నాథ్ బాబుగారు, విమలమ్మ గారి కోసం తీసుకున్నారు"

"ఏమిటి బాలమ్మా నీవనేది? మతి ఉండే మాట్లాడుతున్నావా ?"

"అవునండీ బాబూ ఇప్పుడు అమర్‌నాథ్ బాబుగారు ఆ ఇంట్లోనే ఉన్నాడు. ఇద్దరికీ అన్నం డబుల్ కారేజీలోతెమ్మని ఆ బాబే అన్నాడు" అంటూ వెళ్ళిపోయింది బాలమ్మ

విమల, అమర్‌నాథ్‌లు కలిశారు అని తెలియగానే గోపీనాథ్‌కు తోచింది—

అమర్‌నాథ్, విమలను అన్యాయం చేస్తాడని. హఠాత్తుగా తనకూ భువనమోహినికీ మధ్య ఉన్న సంబంధం గూడా అసహ్యంగా తోచింది. ఈ రెండూ అక్రమ సంబంధాలేగానీ ప్రేమగాదు. వివాహానికి దారి తీయవనిపించింది గోపీకి.

గోపీనాథ్ తన జేబులోని ఐదువందల రూపాయలు తీసి నేలకేసి కొట్టాడు. అలాగే రాత్రి రెండింటిదాకా ఆలోచిస్తూ కూర్చున్నాడు. అప్పటికి గాని, నిద్రాదేవి దయ తల్చలేదు. ఇక పడుకుందామనుకున్నాడు.

కుర్చీలో నుండి లేచి, ఇందాకటినుండీ మట్టిలో పడిఉన్న వంద రూపాయల కాగితాల్ని ఏరుకుని భద్రంగా జేబులో పెట్టుకున్నాడు.



# 17

విమల, అమర్‌నాథ్‌ల ప్రేమకు ఆర్నెల్ల వయస్సు వచ్చింది. విమలకు కావలసింది తిండి, బట్ట, సాంఘిక గౌరవం మాత్రమే. వీరయ్యఆస్తి అంతాతన కొచ్చి పడాలి అని ఆమెకలలు గనలేదు గోపీ ఆ మాత్రం కూడా ఇవ్వలేడని తెలుసుకున్న విమల, అమర్‌నాథ్ ఆకర్షణకు లోబడింది.

ఆ రోజు విమలకు తెలిసింది అమర్‌నాథ్‌కు పెండ్లి ప్రయత్నాలు జరుగుతున్నాయని!

విమల తల్లడిల్లి పోయింది. అమర్‌నాథ్ తనను మోసం చేశాడని గ్రహించింది. అయినా తన ప్రేమను తిరస్కరించదనే ఆశ ఉంది. అమర్‌నాథ్‌కు తన పైన ప్రేమ ఉందని పిచ్చిగా నమ్మింది. అమర్‌నాథ్ వివాహం చేసుకుంటాడన్న అభిప్రాయంతో తనూ, అమర్‌నాథ్ పెండ్లి గాకున్నా దంపతుల వలె జీవించడాన్ని గురించి ఎక్కువ లెక్క చేయలేదు.

ఆ రోజు రాత్రి తొమ్మిది గంటలకు తనదగ్గర చేరిన అమర్‌నాథ్‌ను నిలదీసి అడిగింది విమల.

"అమర్ నీకు మీ నాన్న పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నాడట. నిజమేనా?

"ఎవరు చెప్పారు నీకు?"

"ఎవరో ఒకరు. నిజమా? కాదా? చెప్పు?"

"ని... జ... మే"

విహ్వలంగా, రోషంగా చూసింది విమల అమర్ వంక. "అమర్ నన్నేం చెయ్యాదల్చుకున్నావు? నన్ను పెండ్లి చేసుకుంటానని ఆశపెట్టి ఈ ఇంట్లో తెచ్చి పెట్టావు. లోకానికంతా తెలిసింది. నేను నీ ప్రియురాలినని! ఇలా నన్ను మధ్యస్తంగా వదిలి పెండ్లి చేసుకుంటావా? నన్నే పెండ్లి చేసుకుంటానని నీవు ఇచ్చిన మాటల విలువ ఏమిటి? మా నాన్న నడిగి నిన్నే పెండ్లి చేసుకుంటానని ఎన్ని సార్లు చెప్పావో నీకు తెలీదా?"

"సారీ విమలా! నీ సంగతి నాన్నకు చెప్పాను..ఆయన ససేమిరా- ఒప్పుకో



లేదు" "అమర్ నీ తండ్రిని ఎదిరించు. నీకు వ్యాపారానుభవం ఉంది ఏ చిన్న వ్యాపారం అయినా పెట్టుకుందాం. అమర్ నన్నన్యాయం చేయకు"

"నీవంటే నాకు ప్రేమ ఉంది విమలా కానీ ఏం చేయను మా నాన్నను ఎదిరించిన మరుక్షణం నా చేతిలో నయా పైసా ఉండదు. అదీగాక మా నాన్న చేసే పెళ్ళిళ్ళన్నీ ఆర్థిక ఎత్తుగడలు. నా పెళ్ళి చెల్లెలి పెళ్ళి కొద్ది రోజులలో చేయాలని ఆయన సంకల్పం. నా పెళ్ళికి నాలుగు లక్షల రూపాయలు కట్నం తీసుకుంటాడు. దాంతోనూ దగ్గర ఉన్న డబ్బుతోనూ సినిమాహాలు కొనాలని ఆయన తాపత్రయం. దగ్గర ఉన్న లారీలన్నింటిని కట్నం క్రింద యిచ్చి చెల్లిని ఒక లారీ ఓనరు కొడుక్కి వివాహం చేస్తాడు. మేము నిస్సహాయులం"

"ఇంతేనా అమర్?"

"కానీ విమలా నీ ప్రేమను ఈ జన్మలో మరచిపోను. నాన్న చెప్పిన పెండ్లి చేసుకున్నా, నిన్ను మాత్రం మరువను విమలా మనం ఇలాగే ప్రేమికులవలే కలుసు కుంటూనే ఉందాం"

"ఛీ.ఛీ. నీవూ, మీ నాన్నా రాక్షసులు. మానవ రక్తం త్రాగే పిశాచాలు. నా నిస్సహాయతను ఆధారంగా తీసుకొని నీవూ, మీ నాన్నా నాలాటివాళ్ళ జీవితా

లను పిల్చి పిప్పి చేస్తున్నారు. ఛో. ఇక నీ ముఖం నాకు చూపవద్దు. నువ్వు పెండ్లి చేసుకొని నన్ను ఉంపుడుకత్తెగా ఉంచుకోవడానికి నేను చచ్చినా అంగీకరించను. ఇక జన్మలో నీ ముఖం నాకు చూపించకు" అని రెండు చేతులా ముఖాన్ని కప్పుకొని ఏడుస్తున్నది విమల.

"విమలా, ఇదే ఆఖరు మాటా?"

"ఛీ. ఛో."

అమర్ కోపంగా బయటకెళ్ళిపోయాడు.

అమర్ వెళ్ళిపోవడాన్ని చూచి విమల ఇంకా పెద్ద పెట్టున ఏడ్చింది. చుట్టు ప్రక్కల వారికి విమల ఏడ్పు వినబడినా ఎవరూ పట్టించుకోలేదు.

రాత్రి ప్రొద్దు పోయేదాకా విమల సన్నగా ఏడుస్తున్నది. క్రమంగా దుఃఖం తగ్గింది. భవిష్యత్తు భయానకంగా కనబడింది. ఇక ఆత్మ హత్యయే శరణ్యమనిపించింది. తను ఇక ఎందుకు బ్రతకాలో ఆమెకు అర్థం కాలేదు. ఇప్పటికే బడిలో, ఊళ్ళో అందరికీ తెలిసింది తనకూ,అమర్ కూ ఉన్న సంబంధం, ఇక వారంతా తనను కాకులు పొడిచినట్లు పొడుస్తారు ఎలా బ్రతకాలి?

విమలకు హఠాత్తుగా అమర్ వ్రాసిన ఉత్తరాలు జ్ఞాపకం వచ్చాయి. వాటిని వీరయ్యకు చూపితే డబ్బు దగ్గర ఎంత దుర్మార్గం చూపినా తన కొడుకు ప్రేమించిన పిల్లయందు గూడా క్రౌర్యం ప్రదర్శిస్తాడా? కొడుకును నాలుగు చీవాట్లు వేసి తమనిద్దర్నీ ఒకటి చేయడా? ఈ ఆలోచన రాగానే చివాలున లేచి పెట్టె అడుగున ఉన్న అమర్ రాసిన ఉత్తరాలను తీసింది. వాటిని పరిశీలించి తృప్తి పడింది. మెల్లగా నిద్రలోకి జారుకుంది విమల.

తెల్లవారి ఏడున్నర గంటలకల్లా వీరయ్య ఇంటికి బయలు దేరింది విమల.

వీరయ్య ఉదయం పదిగంటల దాకా ఇంట్లో ఉంటాడు. ఆ తరువాత బజారు కెళ్తే మళ్ళీ రాత్రి పది గంటలకే తిరిగి రావడం. వీరయ్య పంచలో వాలుకుర్చీలో కూర్చుని తాపీగా చుట్ట తాగుతున్నాడు.

"నమస్కారమండీ" అన్నది విమల

"బడికి పోలేదా? ఈ రోజు?"

"తమతో పనిఉండి వచ్చానండీ!"

"నాతోనా ఏంపని?"

"ఈ జాబులు చూడండీ" అంటూ అమర్ రాసిన ఉత్తరాలు ఇచ్చింది విమల. అయిదు నిమిషాలపాటు వీరయ్య ఉత్తరాలు పరిశీలించాడు.

"ఇవ్వేనా ఇంకా ఉన్నాయా?"

"ఇవ్వేనండీ."

వీరయ్య తాపీగా జేబులోనుండి అగ్గిపెట్టె తీసి ఆరిపోయే చుట్టను వెలిగించుకున్నాడు. తరువాత ఇంకా కాలుతున్న పుల్లను ఉత్తరాలకు అంటించాడు. ఉత్తరాలు తగులబడుతుంటే విమల "అన్యాయం, అవి నా ఉత్తరాలు..." అంది.

"తగలబడుతున్నాయి" అన్నాడు వీరయ్య మామూలుగా.

ఈ హఠాత్సంఘటనకు ఆశ్చర్యపోయిన విమల కండ్లనుండి కన్నీరు ధారా ప్రవాహంగా కారుతోంది. గుండెలలో అగ్నిపర్వతాలు పగిలి నోటమాట రాలేదు.

ఉత్తరాలన్నీ మాడిపోయాక మసిని

చెప్పుల కాళ్ళతో మట్టగించాడు వీరయ్య.

"ఎన్నో నెల?" అన్నాడు వీరయ్య.

అంత దుఃఖంలోనూ కండ్లు మిలమిల లాడించి వీరయ్యను ఆశ్చర్యంగా చూచింది విమల.

"నీకు ఎన్నో నెల కడుపు?"

వీరయ్య ప్రశ్న అర్థమయింది విమలకు. తను కడుపుతో ఉన్నానని అనుకుంటున్నాడు వీరయ్య. 'ఏమీ లేదు' అందామనుకుంది విమల. పోనీ అలాగే అనుకోనీ. తన వంశాంకురం కోసమైనా వీరయ్య అమర్ నూ, తననూ ఏకం చేయడా? అని అనుకుంది విమల.

విమల తలవంచుకొని నిశ్శబ్దంగా ఉంది. మౌనం అర్ధాంగీకారం అన్న అభిప్రాయం కలిగేలా నిలబడిఉంది.

"నాలుగో నెలా?" అడిగాడు వీరయ్య.

విమల మౌనం వీడలేదు.

వీరయ్య జేబులో చెయ్యి పెట్టి నాలుగు వందల రూపాయల కాయితాలను తీసి విమలకు చూపించి, "తీసుకో" అన్నాడు.

విమల మళ్ళీ ఆశ్చర్యంగా వీరయ్య వంక చూచింది.

"తీసుకో" గర్జించాడు వీరయ్య.

ఉలిక్కిపడి, విమల డబ్బు అందుకుంది అర్థంగాక.

తూర్పు వీధి చివరన ఒక డాక్టరున్నాడు కడుపులు తీయడంలో అఖండుడు. ఎన్నినెలలైతే అన్ని వందలు తీసుకుంటాడు. పోయి ఆ కడుపు తీయించి పారేయ్."

"వీరయ్యగారూ మీకిది ధర్మంగాదు. మీరు..."

"నోర్మూయ్: చెప్పినట్లు చెయ్, గుట్టుగా పని చూచుకో, నోరెత్తావంటే నీ ఉద్యోగం పీకించి, నీ పరువు బజారు కీడ్చి, నిన్ను దుంపనాశనం చేస్తాను. దిక్కులేని దరిద్రురాలివని పోషిస్తుంటే, నీకింత కండకావరమా? నా సొమ్ముతిని, నా కొంపకే ఎసరుపెడదామనుకున్నావా? ఈ ఆర్నెల్లుగా నీవు మా వాడ్ని పిచ్చి వెధవను చేసి, ఆడించడం నాకు తెలీదనుకున్నావా? వేల రూపాయలు తగలేయించడం తెలీదనుకున్నావా?"

"వీరయ్యగారూ!..."

"ఛీ, ఫో! పాడుముండా!"

విమల కోపంగా వీరయ్యవంక చూచి బుసలు కొట్టింది. కానీ వీరయ్య భీకర మూర్తినీ, అతని కళ్ళలో వెలుగుతున్న అగ్ని గోళాలనూ గమనించి, నివ్వెరపడి మౌనంగా వెనక్కు తిరిగింది.

వెనక్కు తిరిగిన విమలకు ఎదురుగా వస్తున్న గోపీనాధ్ కనబడ్డాడు. తటాలున తలవంచుకొని మెల్లగా నడుస్తున్నది, గోపీ, వీరయ్యల సంభాషణ ఎలా ఉంటుందో ననుకొని.

గోపీని చూడగనే వీరయ్య, "రా గోపీ! కూర్చో" అని మర్యాదచేశాడు. గోపీ కూర్చున్నాడు.

గోపీ చేతి వాచీవంకా, పాంటూ, షర్టూవంకా, నిరాసక్తంగా చూచాడు వీరయ్య.

"ఏంటి గోపీ ఇలా వచ్చావ్?"

"అమ్మాయిగారితో మాట్లాడాలని, నిన్న సాయంకాలం వస్తే అమ్మాయిగారు పరీక్షలు వ్రాసి, పట్నంనుండి ఇంకా రాలేదని తెలిసింది. రాత్రి వచ్చిందట గదా! ఎలా రాసిందో కనుక్కుందా



వని!''

''బాగానే రాసిందట''

గోపీకి తెలుసు, భువనమోహిని ఎలా పరీక్ష వ్రాసి ఉంటుందో! ఇన్నాళ్లూ తాను చెప్పినవీ, ఆమె నేర్చుకున్నవీ ఏంటో గోపీకి తెలుసును కనుక.

''గోపీ, మరింక ప్రైవేట్ అవసరం లేదు. అమ్మాయి పెండ్లి వారంలోకి వచ్చింది. ఇంక నీవు ఇక్కడికి రానవసరం లేదు. ఆ!...అన్నట్లు అమ్మాయి రిజల్టు రాగానే ఆ బహుమతి ఏమిటో ఇస్తాను. ఇక నీవు వెళ్ళు.''

''అమ్మాయి...''

''ఊఁ వెళ్ళు! ఎనిమిది గంటలైనా బడికెళ్లకుండా బలాదూరుగా తిరుగుతావేం? గత ఆరునెలలుగా నీవు బడిలో సక్రమంగా పనిచేయడం లేదని నాకు తెలుసు. ఇంక ఇలా జరిగితే... జాగ్రత్త.''

గోపీ కుర్చీలోనుండి లేచి, ఇంకా ఏమిటో వీరయ్యతో మాట్లాడాలని నిలబడ్డాడు.

''ఊఁ. వెళ్లు! ఇక ఇంటికి రాకు. ఏమయినా పని ఉంటే సోమయ్యను కలువు'' అని గద్దించాడు వీరయ్య.

ఒక వేడి నిట్టూర్పు విడిచి గోపీనాథ్ మెల్లగానడిచి బడిదగ్గరకు చేరుకున్నాడు.

వారం రోజుల తరువాత అమర్‌నాథ్ వివాహం, భువన మోహిని వివాహం బ్రహ్మాండంగా జరిగిపోయాయి.



# 18

ఎండాకాలం శెలవులు వచ్చేశాయి.

కాన్వెంటులో పరీక్షలు అయిపోయాయి.

పరీక్షలు అయిపోవడంతో సగానికి పైగా విద్యార్థులు బడికి రావడం మానేశారు. టీచర్లూ పాఠాలు చెప్పడం మానేశారు. స్కూలు నచ్చుగాసాగుతున్నది.

విమల, అమర్‌నాథ్‌ల సంగతి స్కూలు టీచర్లు బాగా డిస్కస్ చేశారు. విమలను వదిలి అమర్‌నాథ్ పెండ్లి చేసుకోవడంతో కొందరు సంతృప్తి పడ్డారు. మరికొందరు విమల దుస్థితికి సానుభూతి చూపారు.

అమర్‌నాథ్ వీరయ్య కొడుకైనందున విమలను ఎవ్వరూ ముఖాన అనలేదు. అలాగే గోపీకీ, భువనమోహినికీ సంబంధం ఉన్నదని చెవులు కొరుక్కున్నా ఎవరూ బయటపడలేదు.

భువనమోహినికీ, అమర్‌నాథ్‌కూ పెండ్లయ్యాక మొదట్లో టీచర్లు తా విమలనూ, గోపీనీ ఎకసెక్కంగా మాట్లాడినా క్రమంగా పట్టించుకోవడం మాని సహజంగా ఉంటున్నారు.

విమలకు కొన్నాళ్లయ్యాక వేరే ఇంట్లో ఉండడం ఆర్థికంగా దుర్భరమనిపించింది. విమల, నళినిని పరుషంగా మాట్లాడాక విమల, నళినీల మధ్య సరిగా మాటలే లేవు.

ఒకరోజు సాయంకాలం విమల నళిని ఇంటికెళ్ళింది. నళిని తల ఎత్తి విమలను చూసింది. నళిని కళ్ళలో విమలకు సానుభూతి గోచరించింది. అది చూసిన విమల భోరున ఏడుస్తూ నళినిని కౌగిలించుకుని "అక్కా" అన్నది.

నళిని విమలను కౌగిట పొదివి "విమలా! బాధపడకు!" అంటూ వీపు తడుతూ బుజ్జగించింది.

"అక్కా ఎలా బాధపడకుండా ఉండగలను ? నిన్ను అనరాని మాటలు అన్నాను, నీ సలహాలు పెడ చెవిన పెట్టాను."

"అన్నీ మరిచిపో విమలా!"

"అక్కా! నువ్వు, దేవతవి"

"......"

"అక్కా! మోసపోయానక్కా! ప్రపంచం ఇంత దారుణంగా ఉంటుందని ఊహించలేకక్కా. నా బీద బ్రతుకును అసహ్యించుకున్నాను. నీవు చూపిన భవిష్యత్తునూ నాశనం చేసుకున్నానక్కా"

"ఊర్కో విమలా! మనం ఇలా బ్రతుకక తప్పదు"

"అక్కా నా సామాన్లు తీసుకొని వస్తాను. ఆశ్రయం ఇవ్వగలవా?"

"పిచ్చి పిల్లా వెంటనే రా. ఈ రోజు నన్ను అక్కా అని పిలిచావు. నా చెల్లెలికి నా ఇంటికి రావడానికి పర్మిషన్ ఎందుకూ?"

విమల చివాలునవంగి నళిని పాదాలకి నమస్కారం చేసింది. నళిని విమలను లేవనెత్తి మళ్ళీ కౌగిలించుకుంది. ఆనాడే

విమల మళ్ళీ నళిని ఇంట ప్రవేశించింది. రోజులు దొర్లిపోతున్నాయి.

గోపీనాథ్ కూడా విషాదయోగంలో పడిపోయాడు భువనమోహిని తనను పెండ్లి చేసుకుంటుందనుకున్నాడు. కానీ భువనమోహిని తనను వదిలి వెళ్ళిపోయింది. తను అనేక మార్లు భువనమోహినిని అడిగాడు 'పెండ్లి చేసుకుందాం' అని 'కానీ పెండ్లి అంటే నాకు చచ్చే సిగ్గు బాబూ' అనేది. భువనమోహిని ఆ మాట అన్నప్పుడల్లా తను ఆనంద లో, ఆశ్చర్యంలో మునిగిపోయేవాడు. భువనమోహినికి సిగ్గా? తన ఎదుట 'వివస్త్రయై'అనేకసార్లు తిరిగింది. తను కాస్త మందకొడిగా ఉంటే ముద్దులతో ముంచెత్తేది. రకరకాల చిలిపి పనులు చేసేది. అంత సౌందర్యవతిలో అంత కుటిలత్వం ఉంటుందా? అలా అనుకోడానికి తన మనస్సు అంగీకరించడం లేదు.

ఇలా భువనమోహినిని తల్చుకుంటూ క్లాసులోకొచ్చి కూర్చున్నాడు గోపీ. క్లాసులో పదిమంది కంటే ఎక్కువ విద్యార్థులు లేరు. ఎదుటి క్లాసులో గూడా పదిమంది దాకా ఉన్నారు.

కనకం ఆరోజున సర్వాంగ సుందరంగా తయారై క్లాసుకొచ్చింది. గోపీ చిత్రంగా ఆమె వంక చూచాడు. కనకం ముఖంలో ఆ రోజు విసుగూ, కోపం ఏమీ కనిపించ లేదు. ప్రశాంతంగా అందంగా చిరునవ్వులు వెదజల్లుతున్నది కనకం ముఖం.

గోపీ ఆశ్చర్యాన్ని చూచి కనకం నవ్వుతూ, "నమస్కారం గోపీనాథ్ గారూ" అన్నది.

గోపీ ఇంకా ఆశ్చర్యంగా కనకం వంక చూశాడు. కనకం తన కుర్చీని గోపీ కుర్చీ దాకా తెచ్చి వేసుకొని అందులో కూర్చుని నవ్వుతూ సంతోషంగా గోపీని చూచింది.

"నమస్తే గోపీగారూ ఏంటలా ఆశ్చర్యపోతారు! ఈ శెలవులకు మా అత్తగారింటికి వెళ్తున్నాను" అన్నది కనకం.

గోపీ అర్థంగానట్లు కనకం వంక చూశాడు.

"అయితే నా సంగతి మీకు తెలీదన్నమాట"

"ఏదో...కొద్దిగా ...తెలుసు....మీ భర్తగారూ...మీరూ తగూలాడుకున్నారనీ, దూరంగా బతుకుతున్నారనీ... విడాకులూ...దావాలూ...ఏవో ఉన్నాయనీ..." "ఈ రోజు నా హృదయం దూది పింజలా అయిపోతున్నది. ఇంత సంతోషం నేను ఇంతకుముందు ఎరుగను. జీవితమంతా ఇలా మోడుగా మిగిలిపోవాలనే దుఃఖంతో చాలా కాలం కాలిపోయాను. కానీ అన్నీ సర్దుకున్నాయి. అపోహలు కరిగిపోయాయి. మళ్ళీ అత్తగారు ఆహ్వానించారు...వారు గూడా...సెలవులకు రమ్మన్నారు. ఈ రెండు రోజులు బడి చూచుకొని వెళ్ళిపోవడమే"

"చాలా సంతోషం కనకంగారూ"

"గోపీగారూ! మిమ్మల్ని చూచి నాకు చాలా జాలి వేసింది. ఆనాడు మీరు వీరయ్య కూతురికి ప్రైవేట్ చెప్పడానికి వెళ్ళే రోజునే మీకు వార్నింగ్ ఇద్దామనుకున్నాను. కానీ నా అప్పటి మన స్థితిలో ఎవరెట్లా పోతే నుకేం? అని అనుకున్నాను. నిజం చెప్పండి!

మీకూ దానికీ సంబంధంకలిసిందా? లేదా?

"ఎ...ఎ...బ్బే అలాంటిదేమీలేదు!"

"హుఁ! నా దగ్గర ఋకా ఇంచకండి! అదొక కామినీ పిశాచం! మగాళ్ళ హృదయాలను బ్రద్దలు గొట్టడంలో అందె వేసిన చెయ్యి. అది మీలో ఆశలు రెకెత్తించింది కదూ?"

"ఊఁ ఆమె మటుకు ఏమీ అనలేదు నేనే ప్రేమించాను!"

"ప్రేమ అహ్హహ్హ! దానికి ప్రేమా? తెగదని తెగ బలిసి మదంతో కొట్టుకుని చస్తున్నది. పెండ్లి చేసుకుంది! ఇక ఆ మొగుడు దానికి చాల్తాడో ఇంకా ఎవడైనా కావాలో"

గోపీ ఆశ్చర్యంగా కనకం వంక చూస్తున్నాడు.

"గోపీ గారూ! క్షమించండి ఒక సాటి ఆడ దానిని ఇలా అంటున్నానని ఏమీ అనుకోకండి. చెప్పానుగా ఇదొక కామినీ పిశాచి' ఇంటర్ తప్పింది. ఇక ప్రైవేట్ అంటూ ఊరిమీద పడింది. ఇప్పటికి మీరు గాక మరో నలుగురు ప్రైవేట్ మాస్టర్లను నాలుగేళ్ల తిన్నది. సరే ఇప్పుడు మీరూ"

"కనకంగారూ ఆ నలుగురు ప్రైవేట్ మాస్టర్ల సంగతీ 'అపవాదులు"

"పిచ్చి గోపీనాథ్‌గారూ దాని బాహ్య సౌందర్యం చూచి మత్తెక్కే మగాళ్ళకు దాని కడుపులో విషం ఏం తెలుస్తుం దండీ. అది కాపురాలు తీసింది! దాని మొదటి ప్రైవేట్ మాష్టర్ పేదవాడు. దీనికి ప్రైవేట్ చెప్పడం మొదలెట్టాక దసరాబుల్లోడు లాగా తిరిగాడు. ఇది ఇంటర్ పరీక్షలు రాసింది. ఆ తరువాత నెల రోజులకు రైలు క్రింద పడి చచ్చాడు!"

"హరి! హరీ! నిజమేనా కనకం గారూ"

"పచ్చి నిజం గోపీగారూ. ఈ సంగతులు అందరికీ తెలుసు కానీ ఉద్యోగం పోతుందన్న భయం వల్ల ఎవరూ మీకు చెప్పలేదు. ఆ అమర్‌నాథ్ గూడా చెల్లెలంతటి గర్మార్గుడు క్రొత్తవాళ్లైనందున మీ ఇద్దరూ ఆ వీరయ్య విష సంతానానికి ఆహుతి అయ్యారు. ఇక నాకేం భయం? నా భర్త దగ్గర కెళ్ళిపోతున్నాను మీరు విషాదంగా ఉంటం చూచి ఈ సంగతులు చెప్తున్నాను"

"తరువాత ముగ్గురు మాస్టర్లూ?"

"వారిగతీ దాదాపు అంతే అయ్యింది! ఈమెకు ప్రైవేట్ చెప్పడం మొదలెట్టాక ఆ రెండో మాష్టర్ పెళ్లాం ఉరిబోసుకుంది. మూడో మాష్టర్‌కు మతి భ్రమించింది. నాలుగో మేష్టారు కొంచం ఘటికుడై దాని వెంట బడితే వీరయ్య ఆ మేష్టర్ని చావచితక తన్నించాడు. పాపం ఆయన ఊరొదిలి పారిపోయాడు"

"అయితే కనకం వీరయ్యకు ఈ ప్రైవేట్ల భాగోతం తెలుసన్న మాట"

"ఆ క్షుణ్ణంగా తెలుసు"

"మరి తెలిసి నన్నెందుకు మాష్టారుగా పెట్టుకున్నాడు? ఈమెకు ఎలాగూ చదువబ్బదని ఊహించ లేకపోయాడా?"

"ఆయనకు అన్నీ తెలుసు ఇంట్లో గమిడి బర్రెలాగా పెరుగుతున్నది కూతురు. దాని దాహాన్ని తీర్చడానికి ఎవడ్నో ఈ రూపంలో తెచ్చి పడేస్తే ఇంటి పట్టున పడి ఉంటుందని ఆయన ఐడియా."

"కనకంగారూ నాకు ఈరోజు మీ

రూపంలో ఒక మంచిమిత్రురాలు దొరికింది నిజంచెబుతున్నాను.నేను భువనమోహిన్ని ప్రేమించాననే అనుకున్నాను. ఆమెతోటి సౌఖ్యం శాశ్వతం అనుకున్నాను. ఇప్పుడు నాకూ అర్థం అవుతున్నది. నాది ప్రేమగాదు. అత్యాశ. స్వార్థం! భాగ్యవంతురాలిని చేసుకుని ఈ దరిద్ర జీవితం నుండి బయట పడాలనుకున్నా నన్నమాట!"

"అవును గోపీ! నీవు విద్యావంతుడవు తెలివిగలవాడివి, మగవాడివి ఇలాటి క్షుద్రమైన ఆడవాళ్ళకోసం నీ మనసెందుకు పాడుచేసుకోవాలి? బాగా చదువు ఉద్యోగం సంపాదించు ఒక చక్కని పిల్ల నిన్ను వెతుక్కుంటూ వస్తుంది. నీ జీవితంలో ఆనందంనింపుతుంది. గోపీ! నీలాటి మంచి మిత్రుడు ప్రయోజకుడవ్వాలని ప్రార్థిస్తాను."

"థాంక్స్ కనకంగారూ! మీదింత మంచి మనస్సు అనుకోలేదు. మీరు ఓహిడింబో, తాటకో అనే ఇన్నాళ్ళు అనుకున్నాను" అన్నాడు నవ్వుతూ గోపీ. కనకం చిరుకోపంతో అంది "నిజమే! అలాగే అయ్యాను. కానీ నన్నిలా తయారు చేసింది మగాడన్న సంగతి మర్చిపోకు!"

"ఓ మీకింకా మగాళ్ళ మీద కోపం పోలేదన్నమాట! మరి భువనమోహిని?" కనకం గతుక్కుమంది ఆఖరుకు విషాదంగా అంది. "గోపీ దుర్మార్గం స్త్రీలోనూ ఉంది. పురుషుడిలోనూ ఉంది. అయితే తొంభై శాతం పురుషులు దుర్మార్గులు, పదిశాతం స్త్రీలు దుష్టులు!"

ఎగతాళిగా నవ్వాడు గోపీ! అంతలోనే సీరియస్‌గా అయిపోయాడు.

గోపీకి హఠాత్తుగా విమల జ్ఞాపకం వచ్చింది. అవును ఆమె గూడా తనలాగానే మోసపోయింది! తను మగవాడు గనుక ఈ ప్రపంచం త్వరలోనే మోహినితో గల అక్రమ సంబంధాన్ని మర్చిపోతుంది. మరి విమల? ఆమె బ్రతికఉన్నంతకాలం ఆమెను 'కులట' అనే సంఘం అనుకుంటుంది. ఆమెకిక వివాహం కాదు. పాపం అలా మోడుగా మిగిలిపోవలసిందేనా? పొరబాట్లు అంతా చేస్తారు.ఆమెగూడా మానవ మాత్రురాలే!

విమలను, ఏకాంతంగా కలుసుకోవాలని చూసి సాయంకాలానికి అవకాశం చిక్కించుకున్నాడు.

"విమలా!"

"ఏంటండీ!"

"నీతో మాట్లాడాలి"

"చెప్పండి."

"నా మీద కోపం పోయిందా?"

"ఎప్పుడో పోయింది. అందరిమీదా కోపంపోయింది. ఇక నా మీదనే నాకు కోపం మిగిలిపోయింది."

"ఇకముందు ఏంచేద్దామనుకుంటున్నావు విమలా?"

"ఏమీ అనుకోడంలేదు."

"నన్ను క్షమించు విమలా! ఆరోజున నీవు సముద్రం దగ్గర పెండ్లి విషయం ఎత్తితే నేను సరిగా చెప్పలేదు. ఆ తరువాత చాలా పశ్చాత్తాప పడ్డాను."

"నేనూ నా తొందరపాటు తనానికి పశ్చాత్తాప పడ్డాను గోపీగారూ అసలు ...అలా... మిమ్ములను ...వత్తిడి... చేసి వుండక పోవల్సింది అంతా ... క్రొత్త...ఆవేశం...భయం!"

"పోనీ విమలా! జరిగిందేదో జరి

గింది. నన్ను పెండ్లిచేసుకో! నిరభ్యంతరంగా నిన్ను పెండ్లి చేసుకుంటాను. ఇద్దరం పొరపాట్లు చేశాం. ఇద్దరం క్షమించుకుందాం."

విమల మౌనంగా, విషాదంగా నవ్వింది

"ఏమంటావు విమలా?"

"వద్దు గోపీగారూ! నన్ను మన్నించండి. ఇక మిమ్మల్ని భర్తగా ఊహించలేను. నా చరిత్ర మీకు తెలుసు. మీరు విశాల హృదయంతో క్షమించినా, నేను, నా చరిత్రను మర్చిపోలేను. అది మీకు గూడా తెలుసని, నాకు అనుక్షణం మనస్సులో ఉంటుంది. నేను అపవిత్రురాలినన్న భావం నన్ను విడువదు. మీతో సహజంగా ఉండలేను. నా వల్ల మీకు లభించేది దుఃఖమే."

గోపీ ఆశ్చర్యంగా విమలను చూశాడు, "విమలా! అంతేనంటావా? అవివాహితగానే ఉండిపోతావా? నీవు... ఇంకా...వాడ్ని..."

"చూశారా? మీరు మర్చిపోలేరు. అమర్‌నాథ్‌ను గురించి ఇప్పుడు నా హృదయంలో ఏ అభిప్రాయం ఉందో ఎవ్వరూ ఊహించలేరు, చెప్పినా నమ్మరు."

"నేను నమ్ముతాను విమలా! అతడంటే నీకు అసహ్యం, అవునా?"

"అసహ్యం అనేది బహు చిన్న మాట."

"అయితే నీ నిర్ణయం ఏమిటి?"

"నిర్ణయం ఎప్పుడో అయిపోయింది. గోపీగారూ! నేను శాశ్వతంగా అవివాహితగా ఉండాలనే నా కోరిక మా వాళ్లు నాకు పెండ్లి చేయాలని త్వరపడుతున్నారు. జాబుల మీద జాబులు రాస్తున్నారు. ఏదో ఓ సంబంధం, కుదిరితే, తప్పకపోతే చేసుకుంటాను. ఈ ఊరూ, ఈ పరిసరాల నీడా సోకనిచోట సంబంధం చిక్కితే పెండ్లిచేసుకుంటాను."

"విమలా ఎందుకు మళ్లీ లోతుతెలియని నీళ్లలో దూకుతావు? ఒకవేళ నీవు పెళ్లి చేసుకున్నా ఇక్కడి సంగతులు నీ కాబోయే భర్తకు ఏనాటికైనా తెలిస్తే...?

"తెలిస్తే తెలియనీండి ఆనాడు బ్రతుకు ఉండనే ఉంది. ఆయనగారు క్షమిస్తే సరే... లేకుంటే..."

"ఎందుకంత కన్నుపోయే కాటుక విమలా"

"గోపీగారూ క్షమించండి! మిమ్మల్ని భర్తగా చేసుకొని మీ వంక కన్నెత్తి భార్య హోదాలో చూడలేను. మీకు నా అపవిత్రతమీద అసహ్యం లేకున్నా నా మనస్సులోని అపవిత్రత నా కళ్ళలో నుండి బయటపడి మీ కళ్ళలోబడి తిరిగి నా దగ్గర కొచ్చి నన్ను దహించక మానదు. అర్థం చేసుకోండి మన్నించండి"అంటూ కండ్లనీరు గ్రుక్కుకొని వెళ్ళిపోయింది విమల.

ఇన్నాళ్ళుగా విమల ఒకవంక, భువనమోహిని మరోవంక అతని హృదయంలో చేరి బాధిస్తున్నారు. నేటితో గోపీ మనస్సు తేలిక అయింది.

రేపటి నుండీ శెలవులు అనగా ఆ రోజు సాయంకాలం నాలుగింటికే పిల్లలనందర్నీ ఇండ్లకు పంపేసింది నళిని. నళిని రూంలో టీచర్లంతా సమావేశం అయ్యారు. అందరినీ ఉద్దేశించి నళిని

అన్నది

"మళ్ళీ ఎండాకాలం శెలవులు అయిపోయి బడి తీశాక మనలో ఎవరు ఎక్కడికి వెళ్తామో తెలియదు. కనకం అత్తవారింటికి వెళ్ళి పోతున్నది. మళ్ళీ ఆమె ఇక్కడకు తిరిగి రాకూడదనే నా కోరిక"

కనకం ముసి ముసిగా నవ్వింది.



# 19

గోపీ బ్యాంకు టెస్టుకు శ్రమించి చదువుతున్నాడు. జనరల్ నాలెడ్జి పుస్తకాలు రాత్రింబవళ్లూ చదువుతున్నాడు.

ఒకనాడు నళిని, గోపీని భోజనానికి పిలిచింది.

గోపీ ఉదయం తొమ్మిదింటికల్లా నళిని ఇంటికి వెళ్లాడు. రవీ, రాము గోపీని చుట్టు ముట్టారు. గోపీనాథ్ వాళ్ళకు హీరో. ఏనాటికైనా గోపీ మేష్టరంతటి గజ ఈతగాళ్ళు కావాలని వాళ్ళ ఆశయం.

గోపీ- రవీ, రాముతో మాట్లాడుతున్నాడు. నళిని వంట చేస్తున్నది.

"గోపీనాథ్‌గారూ! విమలకు పెండ్లి ప్రయత్నాలు ముమ్మరంగా జరుగుతున్నాయట. విమల నాన్న, ఎలా అయినా సరే ఆమెకు ఈ ఎండాకాలంలో పెళ్ళి జరపాలని చూస్తున్నారట!"

"పోనిండి నళినిగారూ! ఈ రొంపిలో నుండి ఒక ప్రాణి అయినా బయటపడుతున్నందుకు సంతోషం" "నాకూ చాలా భయంగా ఉన్నదండీ! గోపీనాథ్‌గారూ ఎందుకో అనిపిస్తున్నది. విమల వైవాహిక జీవితం సక్రమంగా నడుస్తుందా? అని" "నడవకేంజేసుందిలెండీ! ఎక్కడో దూర ప్రాంతాలవాడ్ని చేసుకుంటే ఇక్కడి సంగతులు తెలియవు. మరో నూతన జీవితాన్ని ప్రారంభిస్తుంది!"

"మీకు అర్థంకాదు గోపీగారూ! నిజం ఏ మాత్రంలేని పుకార్లే, స్త్రీ వైవాహిక జీవితాన్ని అస్తవ్యస్తం చేస్తాయి. ఇక ఇంత మందికి తెలిసిన విషయం ఆమె కాబోయే భర్తకు తెలిస్తే? తెలిసినా తెలియక పోయినా ఏ క్షణాన ఈ విషయం బయటపడుతుందోనని, అనుక్షణం ప్రాణాలు చేత బట్టుకొని ఉండడం ఎంత నరకం? అప్పటికీ నేను చెప్పి చూశాను. కొంతకాలం పెండ్లి వాయిదా వేసుకోమని అయినా విమల వినలేదు"

"నిజమేనండీ! విమల తనకు తోచినది తప్ప ఇతరులు చెప్పింది వినదు"

"అయినా పెండ్లికి ఇప్పుడేంతొందర! తలిదండ్రులు బలవంతం చేస్తున్నారంటుంది. కొన్నాళ్ళాగి, ఒక సహృదయుడూ, సంగతి తెలిసిన వాడూ దొరికితే ఆ జీవితం వేరు!"

"మీకు తెలీదేమో? మొన్న విమల శెలవులకు వెళ్ళబోయే ముందు నేను ఆమెను పెండ్లి చేసుకుంటానని చెప్పానండీ. కాని ఆమె నిరాకరించింది" వంట చేసేదల్లా ఆపి నిర్ఘాంతపోతూ, నళిని గోపీవంక చూచింది.

"ఏమిటి? మీరు?... పెండ్లి చేసుకుంటానన్నారా?"



"అవునండీ"

"విమల నిరాకరించిందా ?"

"అవునండీ"

"ఛీ ఛీ! ఈ పిల్లకు బొత్తిగా జ్ఞానం లేదు ఎందుకు నిరాకరించింది?"

"తన విషయం నాకు తెలుసట నేనది ఎన్నడూ మర్చిపోలేనట ! తను భార్యగా నా ముఖం చూడలేదట"

"గోపీగారూ ఈ పిల్ల చేసే పొరబాట్లకు అంతం లేకుండా ఉంది''

"పోనీండి ఆమె చేప్పేదాంట్లో గూడా పాయింటున్నట్లుంది. ఎక్కడో దూరంగా అన్నీ మరిచి హాయిగా బ్రతకాలని ఆమె వాంఛ అలాగ ఐతే సంతోషమే"

నళిని చాలా సేపు మౌనంగా ఉంది. గోపీ- రవీ, రాములతో కబుర్లలో పడ్డాడు కొంతసేపు తర్వాత నళిని అన్నది

''గోపీనాధ్‌గారూ పరీక్షలకెలా చదువుతున్నారు"

''ఫస్ట్ క్లాస్‌గా"

''సంతోషం. ఈ ఉద్యోగం మీకు తప్పకదొరుకుతుందని నా అభిప్రాయం"

"అలాగే కానివ్వండి"

ఇంతలో పోస్ట్ అన్న కేక వినబడింది రవీ, రామూ కేక వినగానే తూనీగల్లా వాకిట్లో కెళ్ళి చెరో కవరుతెచ్చారు.

"ఏమండోయ్! విమల పెళ్ళి"

"శుభలేక వచ్చింది."

"ఎపుడు? ఎవరితో? వరుడేం చదివాడు? ఏం ఉద్యోగం?"

"వరుడి పేరు జనార్ధన్, ఎం. ఎ. చదివాడు, హైదరాబాదులో లెక్చరర్ ఉద్యోగం."

"విమల అదృష్టవంతురాలు గోపీనాథ్ గారూ! ఎం. ఎ. చదివినవాడూ, లెక్చరర్ చిక్కాడు. కట్నం మస్తుగానే ఉండి ఉంటుంది. లెక్చరర్‌కు ఇచ్చేంత కట్నం వీరిదగ్గర ఎక్కడుందబ్బా? అయినా గోపీనాథ్‌గారూ! లెక్చరర్‌కు జీతం ఎంతుంటుందంటారు?"

"ఏడెనిమిది వందలు ఉండొచ్చు. విమల నిజంగా అదృష్టవంతురాలు."

విమల వివాహం గురించి చాలాసేపు తర్కించుకున్నారు నళిని, గోపీలు.

"గోపీనాథ్‌గారూ! ఒక చిన్న రిక్వెస్టు!"

"ఏంటో చెప్పండి."

"ఏమీ లేదు. మీరు వంటతో, చదువుతో అవస్థపడుతున్నారు. ఆ బియ్యం-గియ్యం మా ఇంటికిపంపండి. నేను వండి కారేజీలో పెట్టి పంపుతాను. నిశ్చింతగా చదువుకోండి."

"ఎందుకండీ, మీకు శ్రమ."

"ఇందులో శ్రమ ఏం వుందండీ! అయితే మీరు నాకో సాయంచేయాలి, ఈ రవీ, రాము, శెలవులలో వెధవల్లాగా తిరుగుతున్నారు. వీళ్ళను ప్రొద్దునా, సాయంకాలం మీదగ్గర కూర్చోబెట్టుకొని చదివించండి."

"అలాగే!" అన్నాడు గోపీ.

ఆ తరువాత భోంచేసి బడికి బయలుదేరాడు గోపీ.

గోపీ ఆలోచనలన్నీ రాబోయే ఉద్యోగంమీదా, భవిష్యత్తుమీదా కేంద్రీకృతంఅయి ఉన్నాయి.

గోపీ కష్టపడి చదివాడు. పరీక్షల నాటికి హైద్రాబాద్ వెళ్ళి శ్రద్ధగా వ్రాశాడు. పరీక్షలన్నీ వ్రాశాక ఈ ఉద్యోగం తనకు రావడం ఖాయం అనుకున్నాడు.

గోపీ హైద్రాబాద్ నుండి హుషారుగా తిరిగి వచ్చాడు.

బడిలో సంచీ పడేసి ఒక బుట్టలో పూలూ, పండ్లూ, చాకలెట్లూ తీసుకొని నళిని ఇంటికి బయలుదేరాడు.

బుట్టను రవి చేతిలోపెట్టి నళినిని పలకరించాడు. నళిని రవి ఇచ్చిన బుట్టను అందుకుంటూ, "ఎందుకండీ, ఇవన్నీ తెచ్చారు" అన్నది.

"తీసుకోండి నళినిగారూ, ఈ రోజు నాకు చాలా సంతోషంగా ఉంది."

"పరీక్షలు ఎలా రాశారు?"

"ఫస్ట్‌క్లాస్‌గా రాశాను. జనరల్ నాలెడ్జిలో ఎనభై శాతం రావచ్చు, లెక్కలు అన్నీ కరెక్టుగా చేశాను. కరెక్షన్ చేసేవాడు ఎంత పిసినిగొట్టు అయినా తొంభై అయిదు మార్కులు వేయక తప్పదు. ఇంగ్లీషుపేపరు గూడా బాగా రాశాను."

"అయితే ఉద్యోగం వచ్చినట్లే నన్నమాట?"

"ఆగండి, ఆగండి, ఇంకోమెట్టు ఉంది ఇంటర్వ్యూ? ఇంటర్వ్యూ రావడం అంటే మాటలుగాదు. అదీవస్తే అప్పుడు ఉద్యోగం రావడానికి స్కోప్ ఉంది. అసలు ఇంతవరకూ ఒక్క ఇంటర్వ్యూ గూడా రాలేదు. ఇంటర్వ్యూలో ఎలా

ప్రవర్తించాలో అనేక పుస్తకాలు చదివి, అనేక వందలసార్లు రిహార్సల్స్ చేశాను''

"ఇంటర్వ్యూ కూడా బాగా వస్తుంది లెండి.''

''మీ నోటి చలవన ఈ లాస్ట్ ఛాన్స్ కన్నా ఇంటర్వ్యూ వస్తే ఒక వీశ లడ్లు తెచ్చి మొత్తం మీరుతినేదాకా మీ వాకిటి ముందు సత్యాగ్రహం చేస్తాను.''

''భలే వారే'' అన్నది నళిని.

రవీ, రామూ బుట్టచుట్టూ మూగారు. నళిని బుట్టలోని చాక్లెట్ల పొట్లంతీసి రవీ, రాములకు తలాకాసిని ఇచ్చింది.వాళ్ళవి పుచ్చుకొని కేరింతలు గొడ్తూ, వాకిట్లో కెళ్ళిపోయారు. నళిని బుట్టలోనుండి కొన్ని ద్రాక్షపండ్లను తీసి ఒక ప్లేట్‌లో పెట్టి గోపీ ముందు ఉంచింది గోపీ ఒక్కొక్క పండును, నోట్లో వేసుకుంటూ పరీక్షలో తను వ్రాసిన సమాధాన సరళిని గూర్చి అనర్గళంగా చెప్పుకొని పోతున్నాడు నళిని బుట్టలోని ఏపిల్స్‌ను తీసి ఒక ప్రక్కగా పెట్టింది. ఆఖున ఉన్న పొట్లం తీసిచూచింది. పొట్లం విప్పి అందులో ఒక పెద్ద బత్తాయి కాయ ప్రమాణంలో ఉండగా చుట్టిన మల్లెపూల దండను నిర్ఘాంతపోతూ చూస్తూ ఉన్నది.

గోపీ తన వాక్ప్రవాహాన్ని ఆపి నళినిని ఆశ్చర్యంగా చూస్తూ హాస్యంగా అన్నాడు.

"ఏంటి నళిని గారూ! మల్లెపూల వంక అంత ఆశ్చర్యంగా చూస్తున్నారు?" నళిని దండను తడుముతూ, గోపీ కండ్లలోకి చూచింది. "అవి మల్లెపూలండీ! ఎప్పుడూ చూడలేదా?" ఇంకా హాస్యధోరణిలోనే అన్నాడు గోపీ.

"నాకు తెలుసండీ! ఇవి మల్లెపూలే! కానీ, ఇవి ఎవరు పెట్టుకోవాలీ?"

"మీరే!"

నళిని తీవ్రంగా, కోపంగా గోపీవంక చూచింది.

హఠాత్తుగా గోపీకి అర్థం అయింది! నళిని వితంతువు! ఆ భావం రాగానే గోపీ నిలువెల్లా వణికి పోయాడు. నళినికి ఎంత ఇన్‌సల్ట్? కంగారుగా అన్నాడు.

"క్షమించండి మీరు...మీరు...పూలు పెట్టుకోరని...తెలియదు...అసలు ... ఆ భావం మనసులోకి ... రాలేదు...మామూలుగా ఇంటికివెళ్తే... ఇలా...పూలూ... పండ్లూ ... తీసుకు వెళ్ళడం అలవాటు ... క్షమించండి" అంటూ, గోపీ ఒక్క అంగలో వాకిట్లోకి దూకి పరుగు పరుగున బడిలోకి వెళ్లాడు.

గోపీ కంగారుగా వణుకుతూ తప్పు చేసిన చిన్నకుర్రాడిలా పారిపోవడం చూచిన నళిని కోపం మాయంఅయింది. గోపీ అమాయకత్వానికి నవ్వు వచ్చింది. చాలాసేపు పూలచెండును చేతితో తడుముకుంది. మెల్లగా ఒక అద్దాన్ని తీసి అందులో తన ముఖాన్ని చూచుకుంది. నుదుట కుంకుమ ఉంటే ? తాను ఇంకా ఎంత అందంగా ఉంటుంది ? యధాలాపంగా పూలచెండును జడలో తురుముకుంది. జడను ముందుకు వేసుకొని అద్దంలో ఆ జడ అందానికి ముగ్ధురాలైంది. ఇంతలో రవీ, రామూ ఇంట్లోకొస్తున్న అలికిడికి ఉలిక్కిపడి జడలోని పూల చెండును లాగిపారేసి చేత పట్టుకుంది.

పిల్లలు ఇంకా చాక్‌లెట్స్ పెట్టమని గోలచేశారు. నళిని వాళ్ళిద్దరికీ చెరో ఏపిల్ పండు ఇచ్చింది. వాళ్ళు పుచ్చుకొని బజార్లోకి పరుగెత్తారు.



# 20

గోపీ బడిలోకి వచ్చి ఆయాసంగా రొప్పుతూ కూర్చున్నాడు.

ఛీ'ఛీ! తను ఎంత తెలివి తక్కువ వాడు? నళినికి పూలు తీసుకుని పోవడం ఏమిటి? తన కారెక్టర్ నళినికి తెలుసు! తెలిసి గూడా తనను ఇంటికి రానిచ్చిందంటే ఆమె హృదయం ఎంత మంచిది? తను పూలు తెచ్చి యివ్వడం కేవలం ఒక అనాలోచిత చర్య అని ఆమె అనుకోగలదా? లేక ఇంకే భావంతోనైనా ఇచ్చానని అనుకుంటుందా? గుడ్ గాడ్! అలా అనుకుంటే ఇక తన ముఖం చూడదు! ఛీఛీ ఎంత తెలివితక్కువ పని చేశాను అనుకొని గోపీ బాధ పడిపోయాడు.

ఏడున్నర గంటలకల్లా రవి క్యారేజీతో ప్రత్యక్షం అయ్యాడు గోపీ బ్రహ్మానందంగా రవిని ఆహ్వానించి అతణ్ణి ప్రశ్నలతో ముంచెత్తాడు. రవికి గోపీ ప్రశ్నలు తికమకగా ఉన్నాయి.

"రవీ నేన్నుమీ ఇంటినుండి రాగానే మీ అమ్మ నన్ను తిట్టిందా?"

రవి ఆశ్చర్యపోతూ "ఎందుకు తిడుతుంది!" అన్నాడు.

"పోనీ కోపంగా ఏమన్నా అన్నదా?"

"ఏమీ అనలేదు"

"పూల చెండును బజార్లో పారేశిందా"

"పూలచెండా అదెక్కడుంది"

గోపీ రవిని చిన్నగా మొట్టాడు. వెధవ! వీడి దృష్టి చాకలెట్, పండ్లను దాటిపోలేదు! అనుకున్నాడు.

"సరే పోనీ మీ అమ్మ ఇంకా ఏమైనా చెప్పిందా?"

"ఇంక ఏమీ చెప్పలేదు"

"రేపట్నుంచి క్యారేజి పంపనని నన్ను వండుకుని తినమని ఏమీ చెప్పలేదా" రవి విసుగ్గా "అదేం లేదు" అన్నాడు.

గోపీ ఆలోచనలలో పడిపోవడం చూచి రవి జారుకున్నాడు. ఇంటికి చేరిన రవిని నళిని యక్ష ప్రశ్నలు వేసింది

'గోపీ ఏమన్నాడని' రవి టేప్ రికార్డర్‌లా తమ సంభాషణను చెప్పాడు.

"పిచ్చివాడు" అనుకున్నది నళిని.

ఆనాటి నుండి నళిని గుమ్మం త్రొక్కలేదు గోపీ. నళిని గోపీని తన ఇంటికి పిలిపించనూ లేదు.

క్రమంగా ఎండాకాలపు శెలవులన్నీ అయిపోయాయి. ఆ రోజే రిఓపెనింగ్. గోపీ నళినినిచూడడానికి జంకుతున్నాడు. తను తెలివి తక్కువగా నళినికి పూలు ఇవ్వడాన్ని నళిని ఎలా అపార్థం చేసుకుంటుందో నన్న భావన సన్నగా అతని మనస్సులో సలుపుతున్నది.

అదృష్టవశాత్తూ ఆ రోజున నళిని ఇందుమతి సరోజలు ఏడింటికల్లా బడి

లోకి కలిసి వచ్చారు. గోపీ అందర్నీ విష్ చేశాడు. వాళ్లూ గోపీని విష్ చేశారు.

అంతా నళిని రూంలో సమావేశం అయ్యారు. రిక్షాలో పిల్లలు దిగి క్లాసులకు వెళ్తున్నారు.

"సరోజగారూ మీవారి ట్రాన్స్‌ఫర్ ఏమైంది, మళ్ళీ మీరు ఈ బడికి వస్తారను కోలేదు"

"ట్రాన్స్‌ఫర్ కాన్సిల్ చేయించుకున్నామండీ. ఏదో నాకు ఇక్కడ ఓ వందరూపాయలు చిక్కుతున్నాయి గదా ఇక్కడే ఉందాం అనుకున్నాం. అది సరే గోపీనాధ్‌గారూ మీకు బ్యాంక్ ఇంటర్వ్యూ వచ్చిందా"

"అప్పుడే ఎక్కడొస్తుందండీ. పరీక్షలు రాసి ఇరవై రోజులే కదా అయ్యింది"

గోపీ నళిని ముఖ కవళికలు గమనించాడు. పూల సంగతి నళిని మర్చిపోయే ఉంటుందన్న భావన కలిగింది గోపీకి. నళిని గోపీతో సహజంగానే మాట్లాడింది.

అంతా పిచ్చాపాటి కబుర్లు చెప్పుకుంటున్నారు. విమల పెండ్లి సంగతులు ముచ్చటించుకున్నారు.

ఇంతలో విమల నళిని రూంలోకొచ్చి ఒక కుర్చీనో లాక్కుని కూర్చున్నది. గదిలో ఉన్నవాళ్ళంతా నిర్ఘాంతపోయి విమలను చూచారు. విమల అందంగా ఒళ్ళు చేసేనట్లు కనబడింది. విమల మెడలో నల్లపూసలు, మాంగల్యం చూడ ముచ్చటగా ఉన్నాయి.

ఆశ్చర్యంలో నుండి తేరుకొని నళిని అన్నది. "విమలా... నీవు... మళ్ళీ వచ్చావా?"

"రాకతప్పలేదు!"

"ఏం? నిన్ను కాపురానికి తీసుకెళ్ళ లేదా?"

"ఆ ముచ్చటా అయ్యింది"

"మరి?"

"ఏడువేలు కట్నం ఇచ్చి పెండ్లి చేశారు, మరో మూడు వేలు లాంఛనాలు ఇవ్వమని కూర్చున్నారు. అంత డబ్బు లేదన్నాం. తెచ్చేదాక ఇంటి గడప తొక్కొద్దన్నారు ఆ డబ్బు పూర్తి అయ్యేదాకా ఈ ఉద్యోగంలో చేరమన్నారు నాన్నగారు"

"ఏడువేలు కట్నం తీసుకొని ఇంకా లాంఛనాలేంటి విమలా ?"

"మేము వాళ్లని మోసం చేశామట!"

"మోసమా ?"

"అవునట? నేను ఇక్కడ టీచర్ ఉద్యోగం చేస్తున్నాను గదా, నా కిక్కడ మూడువందల రూపాయల జీతం అనుకున్నారట. తీరా నాకు వచ్చేది వంద అనే తెలుసుకున్నారట. అందువల్ల వాళ్ల నష్టపోయారట. నెలకు మూడొందలు సంపాదిస్తున్నాను గనుక ఏడు వేల రూపాయల కట్నానికే ఒప్పుకున్నారట. లేకుంటే వారికి ఇంకెక్కడైనా పదివేల రూపాయల కట్నం ముట్టేదట."

దాంతో ఆడవాళ్లంతా, మగవాళ్లను, పెండ్లిండ్లనూ తిట్టిపోశారు. గోపీ కిక్కురు మనకుండా వింటూ కూర్చున్నాడు. విమల మళ్ళీ అన్నది.

"కనుక నష్టపరిహారం క్రింద లాంఛనాల రూపంలో అంటే రేడియో, ఫాన్,

సైకిల్ వగైరాలకు మూడువేలూ తెమ్మని పంపారు"

నళిని అసహ్యంగా అన్నది, "ఛీ !ఛీ! నెలకు ఏడెనిమిది వందల రూపాయలు సంపాదించే లెక్చరర్‌కు గూడా ఇదేం పొయ్యే కాలమే?"

"ఆ సంబడం గూడా బయట పడింది. ఆయన చేసేది లెక్చరర్ ఉద్యోగం అయినా అక్కడా మన కాన్వెంటులో లాగా సగం జీతాలేనట. ఇంకా ఘోరం సగానికి తక్కువేనట. వారికొచ్చే జీతం నెలకు రెండు వందల ఇరవై అట. ఆ కాలేజీ ఒక వెధవల కమిటీ కాలేజీ!"

ఆ మాటతో అంతా నోళ్ళు తెరిచారు ఆశ్చర్యంతో.

"ఎంత మోసం ?" సరోజ అన్నది.

"మరి మీవాళ్ళు ఊరుకున్నారా ?" ఇందుమతి ప్రశ్న.

"ఇంత మోసం చేశారు గనుక మా ఏడువేలూ మాకు పారెయ్యమని మీవాళ్ళు ఎందుకు గొడవ చెయ్యలేదూ ?" గోపీ అన్నాడు ఆవేశంగా.

"ఆ పోట్లాటలూ అయ్యాయి. మా బంధువులంతా వాళ్ళను నానామాటలూ అన్నారు. దానికి ప్రతీకారంగా వాళ్ళు నా ఉద్యోగం మధ్య పెట్టి వంద రూపాయల జీతాన్ని మూడొందలని మేమూ అబద్ధం చెప్పామన్నారు"

"మరి మీ వారేమంటారు ? ఆ రెండొందల ఇరవై రూపాయలతో మీ రిద్దరూ విడిగా బ్రతుక లేరా? నీవు గూడా ఇదే వందరూపాయల ఉద్యోగం హైదరాబాద్‌లో చూచుకోవచ్చు గదా"

"అదీ వారికి చెప్పి చూచాను. కానీ, వారు నా మాటను వినలేదు. తనకు తన తల్లిదండ్రులు చాలా డబ్బు ఖర్చు పెట్టి చదివించారట. వాళ్లను వదలలేను అన్నారు. అసలు ఈ లాంఛనాలు అవీ నామ మాత్రమే! ఆ మూడువేల రూపాయలూ నాన్నగారి దగ్గర గుంజి దాంతో, కట్నం డబ్బుతో చెల్లెళ్ల పెండ్లి చేయాలని వారి అభిప్రాయం!"

"మరి ఇప్పుడు ఏం చెయ్యాలి విమలా?" విహ్వలంగా అడిగింది నళిని.

"మా వాళ్ళు నాకు పెళ్ళో పెళ్ళో అని గోల చేశారు. పదివేల రూపాయలతో వాళ్ళ ఉబలాటం తీరింది."

గదిలో కూర్చున్న ప్రతి ఒక్కరి హృదయం భారంగా ఉంది

ఇంతలో నల్లటి గాగుల్స్ ధరించిన ఒక స్త్రీ, నళిని రూంలోకొచ్చి నిలబడింది. అంతా ఆవిడ వంక ఆశ్చర్యంగా చూశారు. ఆ వచ్చిన స్త్రీ ఎవరో ఎవ్వరికీ అంతు పట్టలేదు.

ఆ స్త్రీకి ఎడమవైపున ముఖం కాలినట్లుగా, మచ్చలుగా, ముడతలుగా ఉంది. చెవి ఉండవలసిన చోట ఒక ముద్దలాంటిది ఉంది. దాని పైన తల వెంట్రుకలు క్రాఫింగలాగా ఉన్నాయి. మెడ మీద కాలిన మచ్చలతో ముడుత పడిన చర్మం ఉంది. ఎడమచేయి కూడా అలానే కాలిన మచ్చలతో నిండి ఉంది. చేయి పైకి ఒంగి లేచి వంకరగా ఉంది. చేతివ్రేళ్ళు అసహ్యంగా వరకరతిరిగి రెండేసి వ్రేళ్ళను ఒకే చర్మంకప్పి వికారంగాఉన్నది.

"ఎవరమ్మా నీవు?" అడిగింది నళిని.

ఆ స్త్రీ కండ్లకున్న గాగుల్స్‌ను తీసింది. దాంతో ఆమె ముఖం ఇంకా వికారంగా కనబడింది. ఎడమ కన్ను

లొట్టఅయిపోయి ఉంది. కుడికంటినుండి సన్నగా నీరు ప్రవహిస్తూవుంటే వంకర తిరిగిన నోరు "అక్కా" అన్న ధ్వనిని చేసింది.

నళిని పిడుగుపాటు తిన్నదానిలా కుర్చీలోనుండి దూకి "కనకం!" అంటూ కనకాన్ని కౌగిలించుకొన్నది.

అంతా దిగ్భ్రాంతులై, "కనకం, కనకం!" అంటూ నమ్మలేనట్లుగా ఆ స్త్రీ వంక చూశారు.

నళిని కండ్ల వెంట నీరుకారగా, "కనకం? ఏమిటీ ఘోరం?" అంటూ కనకాన్ని తన కుర్చీ ప్రక్కగా ఉన్న కుర్చీలో కూర్చోబెడుతూ అడిగింది.

"నళినీ! ఆ భగవంతుడూ ఒక మగవాడే. వాడూ కట్నాలు తీసుకొనే మగవాడి పక్షం. తన భక్తుడు అయిన నా భర్తకు జరిగిన అన్యాయాన్ని చూచి మండిపోయాడా భగవంతుడు. సగం కట్నం మాత్రమే ఇచ్చి సగం ఇవ్వకుండా నేను కాపురం చేస్తుంటే సహించలేక పోయాడా భగవంతుడు. అందుకే నన్ను సగం కాల్చాడు. సగం బ్రతుకును బ్రతకమని శపించాడు."

కనకం హృదయంలోని ఘోష ఎవ్వరికీ అర్థంకాలేదు. అంతా రకరకాల ప్రశ్నలను వేశారు. కనకం క్రమంగా తన విషాధగాథను వెల్లడించింది. ఏముంది! మామూలే. అత్తమామలు కిరసనాయిలుపోసి కాల్చి చంపేసి, ఆత్మహత్యగా చిత్రించి కొడుక్కి పీడ విరగడ చేద్దామనుకున్నారు. పెళ్ళి చేసి కట్నం సంపాదిద్దామనుకున్నారు. అయినా కనకం సగంకాలి బ్రతికింది.

కాన్వెంటు యధావిధిగా సాగిపోతున్నది.

గోపి, కనకం ఎదురెదురుగా కూర్చుని తమ తమ క్లాసులు చెప్పుకు పోతున్నారు.

మొదట్లో కనకం ముఖం చూస్తుంటే గోపీకి చాలా కష్టంగాఉండేది. కనకాన్ని అలా కాల్చినవాళ్ళను, కాల్చి మసిచేయాలన్నంత ఆవేశ పడిపోయేవాడు.

క్రమంగా కనకం బాహ్యారూపం గోపి దృష్టిలోకి రాకుండా పోయింది. ఆ రూపం వెనుకవున్న స్వచ్ఛమైన హృదయానికి ముగ్ధుడైపోయేవాడు గోపి.

ఒకనాడు గోపీ, కనకం, గ్రౌండ్‌లో పిల్లలను ఆడిస్తున్నారు. "కనకం! నీవు పోలీసులకు చెప్పి మీ అత్తమామలనూ, భర్తనూ జైలుకు పంపించి ఉండవలసినది."

కనకం నవ్వింది. జవాబు చెప్పలేదు.

"కానీ నీ భర్త విద్యావంతుడు, నిన్ను నిలువునా కాల్చి చంపిపారేయాలన్న వాదనను ఎలా ఆమోదించాడబ్బా!"

"తల్లిదండ్రుల బలవంతం కావచ్చు."

"ఎంత తల్లిదండ్రుల బలవంతం అయినా ఇంత ఘోరానికి సమ్మతించడమా?"

"ఒకసారి తలవంచినవారు ఇక తల ఎత్తలేరు. ఈ కాస్తే, ఈ కాస్తే అనుకుంటూ ఎంతటి దురాగతానికైనా తల అలాగే వంచుకుని ఉంటారు."

"నీ భర్తపైన నీకు ద్వేషంకలగడం లేదా?"

"ద్వేషం, అసలు ఆ ద్వేషాన్ని మనుష్యులలో పుట్టించే భాగం, ద్వేషతీవ్రతకు తట్టుకోలేక నశించిపోతుంది గోపీ! నాకు

హాస్పిటల్‌లో తెలిసింది, బాధాస్వరూపం. బాధ — కొంత పరిమితిని దాటితే బాధ అనిపించదట. డాక్టర్లు నా కాలిన బొబ్బ లను పరిశీలించి వైద్యం చేస్తుంటే బాధతో ప్రాణం విలవిలలాడింది. ఎంత మత్తుమందిచ్చినా బాధలు తగ్గలేదు. నా ప్రక్కనే మరో ఇల్లాలు ఒల్లుకాలి హాస్పి టల్‌లో చేరింది. ఆమెకు నాకంటే తీవ్రంగా కాలిందట. ఆశ్చర్యం ఆమె అస్సలు ఏడవలేదు. హాస్పిటల్‌లో చేర్చిన మరు రోజున చనిపోయింది అప్పు డనుకున్నాను, ద్వేష తీవ్రతలో నా అంత రంగంలో ఏదోభాగం కాలిపోయినట్లుంది ఇప్పుడిక ఎవ్వరిమీదా ద్వేషం, కోపం పుట్టడం లేదు."

"మరి నీ భర్త ఇప్పుడొచ్చి నిన్ను క్షమించమంటే క్షమించి అతనితో కాపు రం చేయగలవా?"

"అంతంత ఆశలు పెట్టుకోకు గోపీ! ఏ గ్రహబలంవల్లనో కాదనుకున్న నాకు పెండ్లి అయింది. వారు నన్ను వదిలించు కుందామన్నా వదులుకోలేదు నేను. సరే కాపురానికెళ్లాను. ఒకరోజు దాంపత్యజీవి తాన్ననుభవించాను. ఎంత పొరబాటు చేశానో అని ఇప్పుడు విచారపడు తున్నాను. నేను అలా పెనుగులాడ కుండా మా అత్తగారు పోసిన కిరస నాయిలు అంతా పోయించుకుని నిర్లి ప్తంగా ఉండి క్షణకాలంలో పూర్తిగా మండిపోయి ఉంటే ఎంత బాగుండేదో? వెఱ్ఱిదాన్నై ప్రాణాలు రక్షించుకున్నాను. మా అత్తగారికి ఇంకా నన్ను చంపాలని ఉంటే పోయి ఇంకోమారు తగులపెట్టించు కుందామని ఉంది. నా జీవితానికి అర్థం ఏంటి గోపీ? సర్వాంగ సుందరంగా ఉన్ననాడు నా భర్త నిర్లిప్తంగా నేను చావబోతుంటే చూస్తూ ఊరుకున్నాడు. ఇప్పుడిక నన్ను - చేరదీస్తాలా? అసంభవం."

గోపీ— కనకం అత్తగారి ఊరూ, భర్త పేరూ తెలుసుకున్నాడు. ఆనాడు రాత్రి గోపీ కనకం భర్తకు ఒక సుదీర్ఘ మైన లేఖను వ్రాశాడు. అందులో తనను కనకంసోదరునిగా అభివర్ణించుకున్నాడు. కనకం హృదయౌన్నత్యాన్ని ప్రశంస నీయంగా వర్ణించాడు. కనకం ఇంకా తన భర్తను గౌరవిస్తున్నదని వ్రాశాడు. కనకం భర్తయొక్క పశుత్వాన్ని ఖం డించాడు. అతనిలో ఇంకా మానవత్వం ఉంటే కనకాన్ని క్షమాపణ కోర మన్నాడు.

గోపీకి ఎందుకో అనిపించింది. కనకం మహోన్నతమైన వ్యక్తిత్వం ముందు ఎంతటి పశుత్వం అయినా తల వంచక తప్పదు అని.

జాబురాసి పోస్టుచేసిన మరుక్షణం నుండీ కనకం భర్త వస్తాడేమోనని, ఎదురు చూశాడు. పదిరోజులదాకా అలా ఎదురుచూచి ఛీ! వీడు పశువు కంటే హీనం అని అనుకున్నాడు.



## 21

క్రమంగా గోపీకి తనకు బ్యాంక్‌లో ఉద్యోగం వస్తుందన్న ఆశ ఎక్కువ

అయింది. తను ప్రస్తుతం వీరయ్యదగ్గర చేసే ఉద్యోగాన్ని చూస్తే అసహ్యం కలుగుతున్నది.

ఒక రోజున సమ్మె చేద్దాం అనిపించింది. ఆ విషయం టీచర్లందరికీ చెప్పాడు. జీతాలు పెంచమని సమ్మె చేయాలని వారికి నూరి పోశాడు. ఇందుమతీ, సరోజలు సమ్మెలో పాల్గొనడానికి సమ్మతించారు. నళిని, కనకం, విమల ఆ సగం జీతంతోనే రాజీ పడి ససేమిరా అన్నారు. పైగా గోపీకే బుద్ధులు చెప్పారు

గోపీ అంతటి తోటి ఆ భావాన్ని విరమించుకోక అడుక్కోనిరెండో కాన్వెంటు, క్రిస్టియన్ల కాన్వెంటులో టీచర్లను గూడా కలసి తామందరూ సమైక్యంగా సమ్మె చేయాలని చెప్పాడు. అయితే ఎవ్వరూ సుముఖత చూపలేదు.

దాంతో గోపీ నీరు గారి ఊరుకున్నాడు. సోమయ్య ఒకటి రెండు మార్లు గోపీని కలుసుకుని వార్నింగ్ ఇచ్చాడు. కానీ గోపీ ఖాతరు చేయలేదు.

ఇది ఇలా ఉండగా కనకం తల్లికి ఒకనాడు హార్ట్ఎటాక్ వచ్చింది. ఇంటి ప్రక్కల వాళ్లెవరో బళ్ళో ఉన్న కనకానికి చెప్పంపించారు. వార్త వినగానే కనకం ఇంటికి వెళ్ళిపోయింది. కనకం వెంట గోపీ కూడా వెళ్లాడు.

ఇద్దరూ ఒకే మారు కనకం ఇల్లుచేరి లోపలికెళ్ళి పరిశీలించారు. ప్రక్క ఇండ్ల లోని ఆడవాళ్ళ క్రింద పడిపోయి భారంగా ఊపిరి తీసుకుంటున్న తులసమ్మను చూశారు. కనకం వెళ్ళి తల్లి మీద పడి రోదించింది. గోపీ వెంటనే బజారుకెళ్ళి రిక్షా మాట్లాడుకొచ్చాడు. తులసమ్మను ఆడవాళ్లు పట్టుకొని రిక్షా ఎక్కించారు. కనకం రిక్షా ఎక్కి తల్లిని పట్టుకొని కూర్చుంది.

డాక్టర్ తులసమ్మను పరిశీలించి ఆక్సిజన్ పెట్టమని ఉత్తర్వు చేసి, ఒక చీటీ మీద మందులు వ్రాసి కనకం చేతి కిచ్చాడు. కనకం ఆ చీటీని గోపీ చేతిలో పెట్టింది.

గోపీ అనుమానంగా అడిగాడు "కనకం! డబ్బేమైనా ఉందా"

"లేదు"

"నా దగ్గరకూడా లేదు. నెలాఖరు"

"ఇందుమతి నడగండి"

"ఇందుమతి నడగడం ఎందుకు. వీరయ్యనే అడుగుతాను. నీ జీతంలోంచి ఎడ్వాన్సు ఇమ్మని"

"ఎడ్వాన్సులు ఇవ్వరు"

"ఇవ్వకపోతే వాడి అంతు తేలుస్తాను" అని చీటీని తీసుకుని గోపీ వీరయ్య షాపుకెళ్లాడు.

వీరయ్య గోపీని చూస్తూనే "ఏం గోపీ బడిలోకెళ్లక బలాదూరుగా తిరుగుతున్నావేం?"

"బలాదూరుగా తిరుగడం లేదు అత్యవసరమైన పనిమీద వచ్చాను"

"ఎంత అత్యవసరమైన పని ఐనా సరే డిసిప్లిన్ అంటే డిసిప్లినే!"

"చాలు లేవయ్యా నీ బోడి డిసిప్లిను. నీవిచ్చే వందరూపాయలకు చేస్తున్న పని చాలా ఎక్కువ"

"గోపీ నీకూ, నీకూ...కొవ్వెక్కిందా? అయినా వంద రూపాయల జీతంలో గూడా ఇంత పొగరు ఎలా వచ్చింది? ఇంటికి పోవాలని ఉందా?"

వీరయ్య ఆ క్షణాన్నే గోపీని డిస్మిస్

చేయగలడు. కానీ గోపీ వీరయ్యకు బాగా ఉపయోగపడుతున్నాడు. పిల్లలకు బాగానే చెబుతున్నాడు. తన కాన్వెంటులో ఎం.ఎ చదివినవాళ్ల పాఠాలు చెబుతున్నారని చాటు కుంటున్నాడు. గోపీ చేరాక వెంకాయమ్మ కాన్వెంటు, క్రిస్టియన్ కాన్వెంటులలోని కొందరు విద్యార్థులు తన కాన్వెంటులో చేరారు.

"పోతేపోతాం ఇంటికి......అసలు సంగతి...కనకం తల్లి జీవన్మరణావస్థలో ఉంది"

"ఉంటే?"

"ఆమెకు హార్ట్ఎటాక్ వచ్చింది. మందుకు డబ్బులేదు! అందుకని కనకానికి ఓ వంద ఎడ్వాన్స్ ఇవ్వాలి"

"ఎడ్వాంసా? ఎడ్వాన్సు ఇచ్చే అలవాటు మాకు లేదు. అయినా వంద రూపాయల జీతంలో ఎడ్వాన్స్ తీసుకొని వచ్చేనెల ఏం తింటుందట".

"అయితే ఎడ్వాన్స్ ఇవ్వరా"

''లాభంలేదు''

గోపీకి ఆవేశం అధికం అయింది.

"వీరయ్యా! నీకు చేటు కాలం దాపురించింది. నీ పాపం పండింది జాగ్రత్త" అని వెళ్ళిపోయాడు గోపీ.

వీరయ్యా సన్నగా నవ్వుకున్నాడు.

గోపీ బడివైపు బయలుదేరాడు. టీచర్లందరికీ సంగతి వివరించి డబ్బు కావాలన్నాడు. అంతా నిరుత్సాహంగా మాట్లాడారు.

"నా దగ్గర పది రూపాయలుంది" అన్నది నళిని.

"నా దగ్గర ఐదే ఉంది" అన్నది విమల.

"నేను పది హేనే ఇవ్వగలను" చతుర అన్నది ఇందుమతి.

"నా దగ్గర నయాపైస లేదర్రా" అన్నది సరోజ.

"సరే ఇటుతెండి" అని చేయి జాపాడు గోపీ

ఇంటిదగ్గర ఉంది డబ్బు అని అన్నారంతా.

"మరి పోయి పట్రండి" అన్నాడు గోపీ

బడి టైంలో ఇండ్ల కెళ్ళితే వీరయ్యా ఏం చేస్తాడో అని అందరూ భయపడ్డారు. "ఫర్వాలేదు. పోయి డబ్బు తెచ్చి ఇవ్వండి. అవతల మనిషి చావు బ్రతుకులలో ఉంది" అన్నాడు గోపీ.

మెల్లిగా అంతా బయలు దేరారు ఇండ్లకు.

అరగంట తరువాత ముప్పై రూపాయలు వసూలయ్యాయి. అవి చేత పట్టుకొని మందుల షాపుకు వెళ్ళాడు గోపీ. షాపువాడు చీటీ చూచి ''మందులు నలభై ఆరు రూపాయలు అవుతాయి" అన్నాడు.

గోపీ నీరుగారి పోయాడు. మరుక్షణం చేతి వాచీని విప్పి షాపువాడికిచ్చి "మందు ఇవ్వండి వాచీ ఉంచుకోండి"

"వాచీ నాకెందుకు"

"మందులు అర్జంటుగా కావాలి"

"ఓ పని చెయ్. వాచీని గడియారాల షాపుకు తీసుకు వెళ్ళి అమ్మి డబ్బు పట్రా"

గోపీ షాపువాడి వంక నిరసనగా చూచి గడియారాన్ని పట్టుకొని బయలు దేరాడు.

మరో అరగంట దాటాక మందులు

పుచ్చుకొని గోపీ నడిపడిగా హాస్పిటల్ వైపు వెళ్లాడు

అదే సమయంలో కనకం ఏడుస్తూ వాకిట్లో కొచ్చింది. ఆమెవెనుక నలుగురు పట్టుకొని తులసమ్మ శవాన్ని రిక్షాలో ఎక్కిస్తున్నారు.

శవాన్ని పట్టుకొని ఏడుస్తూమందులు పట్టుకొని తమ వంక నిర్వీణ్నుడైన గోపీని చూచి కనకం "గోపీ అమ్మ వెళ్ళిపోయింది"అన్నది ఏడ్పు గొంతుతో.

గోపీ చేతిలోని మందులు జారి క్రింద పడ్డాయి.



# 22

సాయంకాలం ఏడింటికల్లా బడిమూసేసి నళిని, విమల, ఇందుమతి, సరోజ, బాలమ్మ-కనకం ఇంటికి బయలు దేరారు. కనకం ఇల్లు ఇంకో యాభైగజాల దూరంలో ఉందనగానే ఆ ఇంటిముందు దృశ్యాన్నిచూచి అందరూ జరిగిందేమిటో ఊహించి త్వరగా నడిచారు.

కనకం ఇంటి ముందు చాలామంది గుమిగూడారు. ఇంటి కాంపౌండ్ వాల్ వెలుపల ముగ్గు కాల్వకు పక్కగా ఒక చాపమీద కనకం తల్లి శవం ఉంది. శవానికి ఒక వైపున గోపీ ఉన్నాడు రెండో వైపున కనకం ఉండి శవం గుండెలమీద పడి ఏడుస్తున్నది. శవం తలవద్ద దీపం ఉంది. అద్దె ఇంటివాళ్ళు శవాన్ని లోనికి రానివ్వనందున శవాన్ని బజారోనే ఒక ప్రక్కగా పెట్టారు.

టీచర్లు నలుగురూ వచ్చికనకాన్ని పలుకరించారు. ఆమె దుఃఖాన్ని తగ్గించ డానికి ప్రయత్నించారు. కొంత సేప య్యాక నళిని అంది కనకంతో.

"కనకం బంధువుల కెవ్వరికీ టెలిగ్రాంలు ఇవ్వలేదా?"

"లేదు ఎవ్వరూ రారు"

"అందేం మాట? మీ బాబాయి టెలిగ్రాం చూచుకుని రాడా?"

"రాడు"

నళిని గోపీ వైపు తిరిగి "గోపీనాథ్ గారూ! కనకం బాబాయిగార్కి టెలిగ్రాం ఇవ్వండి" అన్నది.

గోపీ కనకాన్ని అడిగాడు ఎడ్రస్ ఏమిటి? అని.

అయిష్టంగా కనకం తన బాబాయి ఎడ్రస్ చెప్పింది.

గోపీ కనకంతో అన్నాడు "కనకం, ఇంకెక్కడికైనా టెలిగ్రాం ఇవ్వాలా అంటూ సాభిప్రాయంగా అడిగాడు.

"అవసరం లేదు"

"మీ భర్త"

"అవసరం లేదు"

గోపీ పోస్టాఫీస్ కెళ్ళాడు. కనకం బాబాయికి టెలిగ్రాం ఇచ్చాడు. ఆ తరువాత పది నిమిషాలు తర్జనభర్జనపడి కనకం భర్తకూ టెలిగ్రాం ఇచ్చాడు. మళ్ళీ కనకం ఇంటి దగ్గరకొచ్చాడు.

కనకం ఇంటి దగ్గర మూగిన జనం క్రమంగా వెళ్ళిపోయారు. ఇందుమతి, సరోజ కూడా వెళ్ళియారు.

"నళినీ,విమలా మీరుగూడా వెళ్ళండి" అన్నది కనకం.

విమల, నళిని వెళ్ళిపోయారు. తులసమ్మ శవం దగ్గర గోపీ, కనకంలే ఉన్నారు. బజార్న పోయేవారు, ఒక్క క్షణం వీరివంక చూచి విషాదంగా వెళ్ళి పోతున్నారు.

"గోపీ నీవు గూడా వెళ్ళిపో! రేపు...రా! అమ్మకు... నీచేతుల... మీదగా... వెళ్ళి... పోవాలని రాశి పెట్టిఉంది!"

"కనకం దిగులుపడకు! నేను ఇక్కడే ఉంటాను. ఎక్కడికీ పోను రేపు... అన్నీ పనులు... నేనే చేస్తాను..."

"నాకీ ప్రపంచలో ఇక ఎవరూలేరు. నిన్ను అన్నయ్యా! అని పిలవనా"

"ఏ పేరుతో పిలిచినా పలుకుతాను చెల్లీ!"

కనకానికి నోట మాటరాక, కంటి నిండా నీరు జలజలా కారింది.

శవంమీద చేయిపెట్టుకొని కూర్చున్న కనకం చేతిని పట్టుకొని గోపీ అన్నాడు ఆవేశంగా, "చెల్లీ! నీకు ఎవరూలేరని దిగులుపడకు! నాకు నలుగురు చెల్లెళ్ళున్నారు. ఈనాటినుండీ ఐదుగురు"

తెల్లవారాక నలుగురూ పోగయ్యారు. తులసమ్మను స్మశానానికి తీసుకెళ్ళేతంతు మొదలెట్టారు.

నలుగురు వాహకులు, తులసెమ్మ పాడెను భుజానికెత్తుకున్నారు. గోపీ నిప్పున్న కుండ ను అందుకున్నాడు. కనకం పెద్దగా ఏడుస్తున్నది. ఇంతలో కనకం భర్త సుబ్బారావు ఎక్కడినుండో ఊడిపడ్డాడు. నేరుగా గోపీనాధ్ దగ్గర కెళ్ళాడు. ఇతడెవరోనని గోపీనాధ్ సుబ్బారావు వంక చూస్తూ ఉన్నాడు.

"ఆ నిప్పులకుండ ఇలా ఇవ్వండి?"

"ఎవరు నీవు?"

"గోపీనాధ్ గారంటే, మీరేనా?"

"అవును!"

"ఆ కుండ ఇలా ఇవ్వండి!"

"ఇంతకీ మీరెవరు?"

"కనకం భర్తను!"

గోపీ అరికాలిమంట నెత్తికెక్కింది.

"కనకాన్ని అడగండి! ఇవ్వమంటే ఇస్తాను!"

సుబ్బారావు, కనకం దగ్గరికెళ్లాడు. వాహకులు త్వరగా బయలుదేరమని తొందర చేస్తున్నారు.

"కనకం!"

కనకం తన పమిట చెరుగును కాలిన ఎడమ ముఖానికి కప్పుకుంది.

"కనకం! నన్ను క్షమించు, చేతగాని వాణ్ణి. కాలిన శరీరం దాచుకోవలసింది నీవుగాదు."

"............"

"కనకం! గోపీనాధ్‌గార్ని ఆ కుండ నా కివ్వమను!"

"........."

"కనకం! నన్ను క్షమించు. నా తలిదండ్రులను శాశ్వతంగా వదిలేసి నీ దగ్గరి కొచ్చాను. గోపీనాధ్‌గారు వ్రాసిన జాబు చదివి ఇంతకుముందే వద్దామనుకున్నాను. అయినా నేను చేసిన పాపం! నాకు ధైర్యాన్నివ్వలేదు. ఈ రోజు అత్తగారు పోయారన్న టెలిగ్రాం చూచుకుని వచ్చాను. చెప్పు కనకం! నన్ను క్షమించానని చెప్పు!"

కనకం ఆశ్చర్యంగా గోపీనాధ్ వంక చూచింది.

ఆఖరుకు అన్నది కనకం "అన్నయ్యా

ఆ కుండను వారికివ్వు?" అని. సుబ్బారావు గోపీ దగ్గరకెళ్ళి కుండను పుచ్చుకున్నాడు.

శవ వాహకులూ, కుండతో సుబ్బారావూ తరలిపోయారు. కనకం దుఃఖంతో మరోసారి రోదించింది.

కొంచెంసేపటికి తేరుకొని కనకం "అన్నయ్యా నీవు వారికి జాబురాశావా? రాత్రి టెలిగ్రాం ఇచ్చావా" అన్నది ఆశ్చర్యంగా.



## 23

కనకం తల్లిచనిపోయిన నాలుగు రోజులకు ఒకటో తారీఖు వచ్చింది. సోమయ్య సంచీ పట్టుకుని వచ్చి నళిని రూంలో కూర్చొని ఉన్నాడు. పేరు పేరునా వరుసగా టీచర్లందరినీ పిలిచాడు. అందరికి జీతాలు ఇచ్చి సంతకాలు పెట్టించుకుంటున్నాడు. ఈ నెలలో "డిసిప్లిన్ క్రింద మూడు రూపాయలు కట్!" అన్నది సరోజ ఇందుమతి "ఊఁ! ఏం చేద్దాం" అన్నది.

గోపీకి ఈ డిసిప్లిన్ కట్ ఏంటో తెలీ లేదు, సరిగా సోమయ్య గోపీ పేరును పిలిచాడు.

కవరు ఇచ్చి సంతకం చెయ్యమన్నాడు. గోపీ కవర్‌లోని డబ్బును ఎంచుకున్నాడు. వందకు పదకొండు రూపాయలు తక్కువగా ఉన్నాయి.

"ఊఁ! సంతకం పెట్టు" గద్దించాడు సోమయ్య.

"పదకొండు రూపాయలు తగ్గాయి ఎందుకని?"

"ఐదురూపాయలు నా మామూలు, ఆరు రూపాయలు డిసిప్లిన్ కట్!"

"నీకు నెలనెలా ఐదురూపాయలు మామూలు ఎందుకివ్వాలి?"

"ప్రతి నెలా ఇస్తున్నారు గనక. గోపీ మర్యాద తెలుసుకుని మాట్లాడు!"

"ఈ నెల నుండి నే మా మూ లు ఇవ్వను! ఆ అయిదు రూ పా య లు అక్కడ పెట్టు!"

గోపీనాథ్, సోమయ్యలు ఘర్షణ పడడంతో టీచర్లు అంతా గదిలోకి చూస్తున్నారు.

సో మ య్య ఆశ్చర్యంగా గోపీని చూస్తున్నాడు. గోపీ ముఖంలో భయం కనబడడం లేదు. క్రూరమృగాలకు ఓ గుణం ఉంటుంది. అవి పారిపోయే జంతువులన్నే వేటాడుతాయి. అలా పారిపోవలసిన జంతువు హఠాత్తుగా ఆగి ఎదురు తిరిగి నిలబడితే అంతలావు మృగం తక్కున ఆగిపోతుంది. ఒక్కొక్కప్పుడు వెనక్కు తిరిగి గూడా వెళ్ళొచ్చు

"ఊ పెట్టు అయిదు రూపాయలు అక్కడ"

సోమయ్య సంచీలో చెయ్యి పెట్టాడు

"నా అయిదే గాదు. ఆరుగురి టీచర్ల మామూళ్ళు మొత్తం ముప్పై రూపాయలూ అక్కడ పెట్టు!"

సోమయ్య ముప్పై రూపాయి కాగితాలు సంచీలో నుంచి తీసి టేబిల్ పైన పెట్టాడు.

"ఇంక ఈ డిసిప్లిన్ కట్ ఏంటి ?" తెలిసినా అడిగాడు గోపీ.

"నీకు తెలీదూ? నీవు మొన్న ఇరవై ఐదవ తారీఖు సాయంకాలం నాలుగింటికే బడి విడిచి వెళ్ళావు. మరునాడు సాయంకాలం నాలిగింటికి బడికొచ్చావు. అందువల్ల రెండు రోజులూ డిసిప్లిన్‌కు భంగం కలిగింది. గనుక రోజుకు మూడు రూపాయల వంతున ఆరు రూపాయలు కట్ చేశాం!"

"ఆ రెండు రోజులు కనకం తల్లిగారి అంత్య క్రియలకు అటెండ్ అయ్యాను!"

"అదంతా మాకు తెలీదు ! డిసిప్లిన్ అంటే డిసిప్లినే !"

"మరి మాకు శెలవులు అంటూ ఏమీ లేవా?"

"అలాంటి వేంలేవు!"

"మరి రేపు నీవుగానీ, ఆ వీరయ్యగానీ చచ్చారనుకో! మీలాంటి నరరూప రాక్షసుల శవాలను ఎవ్వరూ ముట్టుకోరనుకో! మిమ్మల్ని తగలెయ్యడానికి నేనొస్తాననుకో అప్పుడూ మూడు రూపాయలు కట్ చేస్తావా ?"

సోమయ్య ఉధృతంగాలేచి కోపంతో వణికి పోతూ గోపీ చొక్కా పట్టుకున్నాడు. గోపీ ఇంకా కోపంగా సోమయ్య చేతులు విదలించి పారేసి సోమయ్యను ఒక్కనెట్టు నెట్టాడు. సోమయ్య వెనక్కు కుర్చీలో కూలబడ్డాడు.

"ఒరే గోపీ! నీకెంత కండకావరంరా దిక్కులేని ఘుండా కొడుకువని దయదలిచి ఉద్యోగం ఇస్తే. కారు కూతలు కూస్తావట్రా. నిన్ను ఇప్పుడే డిస్మిస్ చేసి పారేస్తాను"

"చెయ్యిరా చెయ్యి, నీ కొవ్వూ ఆ వీరయ్య కొవ్వూ అణిచేస్తాను. ఇదిగో శ్రద్ధగా విను. పోయి నీ యజమానికి చెప్పు. ఇకనుండీ మాకు నిండు జీతాలు ఇవ్వాలి. సంవత్సరానికి పన్నెండు రోజులు క్యాజువల్ లీవు ఇవ్వాలి. పోయి ఆ వీరయ్యకు చెప్పు. లేకుంటే రేపట్నుండి సమ్మె చేస్తాం" అన్నాడు గోపీ.

"ఒరే గోపీ..."

"నోరు మూసుకొనిపో మరో కూత కూశావంటే చెప్పు దీసుకుని తంతాను" అంటూ కాలి చెప్పు విడిచి చేత పట్టుకున్నాడు గోపీ.

సోమయ్య చెప్పువంక భయంగా చూస్తూ సంచీ పట్టుకొని వాకిట్లో కెళ్ళిపోయాడు.

గోపీ రౌద్రాకారాన్ని చూచి టీచర్లంతా వణికి పోయారు. మెల్లగా అంతా గదిలోకి వచ్చారు.

గోపీ టేబిల్ మీది ముప్పై రూపాయలనూ తలా ఐదురూపాయల వంతున పంచాడు.

అంతా ఆశ్చర్యంగా పుచ్చుకున్నారు.

నళిని అన్నది ఎట్టకేలకూ "గోపీనాథ్‌గారూ ! ఏంటి ? ఈ రోజున ఇలా తిరగబడ్డారు"

"తిరగబడాల్సిందే. ఎన్నాళ్ళీ రాక్షసులను మన రక్తం త్రాగనీయాలి ?"

అంతా మౌనంగా ఉన్నారు.

"అందుకని రేపట్నుంచీ సమ్మె చేద్దాం! అంతా కట్టుగా ఉంటే ఈ వీరయ్య ఆట క్షణంలో కదుతుంది. ఎన్నాళ్ళిలా వంద రూపాయల జీతంతో జీవచ్ఛవాలలాగా బ్రతకాలి? రేపటినుండీ

సమ్మె జరుగుతుంది!

టీచర్లంతా ముఖాముఖాలు చూచుకున్నారు.

"భయపడకండి! ఈ వీరయ్య సమ్మె చేస్తే సులువుగా లొంగుతాడు. నిండు జీతాలు అడుగుదాం! ఇస్తే సరే! లేకుంటే సమ్మె ఖాయం! సమ్మెకు వీరయ్య లొంగిరాకుంటే వాడి మీద గవర్నమెంటుకు రిపోర్టిద్దాం!

"ఏం ఇందుమతీ! నీవు సిద్ధమేనా?"

"నేను సిద్ధమే!"

"సరోజా నీవు ?"

"నేను గూడా"

"కనకం?"

"సిద్ధమే!"

"విమలా?"

విమల మౌనంగా నళిని వంక చూసింది.

"నళినిగారూ! మీరూ ?"

నళిని మౌనంగా ఉంది.

కనకం అన్నది.

"అక్కా! నీవూ భయపడితేఎలాగా? నీవు ట్రైన్డ్ టీచర్ వి. నీ ఉద్యోగం వీరయ్యగారు తీసివేయలేడుగదా? మేము అన్ ట్రైన్డ్ టీచర్సుము. మా కంటే నీవే ఎక్కువగా భయపడితే ఎలాగా?"

గోపీ అన్నాడు, "అసలే సగం జీతం! దానికి తోడు ఈ కటింగులు గూడానా? మీరు ఎవరు సమ్మెచేసినా, చేయకపోయినా నేను చేస్తాను. బడి ముందు స్లోగన్సు కొట్టుకుంటూ తిరుగుతాను. అప్పటికీ ఎవరూ ఈ అన్యాయాన్ని ఆపలేకపోతే నడిబజార్లో వీరయ్య దురన్యాయాలు ఏకరువుపెట్టి కిరసనాయిల్ పోసుకొని నిప్పంటించుకొని తగలబెట్టుకుంటాను. అనాటైనా ప్రజానీకానికి ఈ బడిలోజరిగే దురన్యాయం తెలుస్తుంది. నేను లేకున్నా మీకైనా తలా పదిరూపాయల జీతం పెంచక తప్పదు."

గోపీ వీరావేశం అందరికీ సోకింది. ప్రాణం పోతున్నా ఎడ్వాన్సుడబ్బు లియ్యని వీరయ్యమీద ద్వేషం పుట్టుకొచ్చింది.

"గోపీనాధ్‌గారూ! నేను గూడా సమ్మెకు సిద్ధమే" అన్నది నళిని.

"సరే కానివ్వండి! నేనుగూడా సమ్మెలో పాల్గొంటాను" అన్నది విమల.

తరువాత సమ్మె ఎలా చేయాలో చర్చించుకున్నారు టీచర్లంతా.

సాయంకాలం నాలుగుగంటల ప్రాంతంలో వీరయ్య బడికొచ్చాడు. నేరుగా నళిని రూంలో కొచ్చి కూర్చున్నాడు. నళిని రూంలో ఇందుమతి, నళిని కూర్చుని ఉన్నారు. వీరయ్యను చూడగానే ఇద్దరూ సంభ్రమంగా లేచి నిలబడ్డారు.

"విమలను, సరోజను, కనకాన్ని, పిల్చుకురా!" అన్నాడు వీరయ్య ఇందుమతివంక చూస్తూ. ఇందుమతి పోయి అందర్నీ పిలుచుకొని వచ్చింది. అంతా నళిని రూంలో కొచ్చారు. గోపీ తనను పిలవకపోయినా క్లాసు వదిలి బయట నిలబడ్డాడు ఎవ్వరికీ కనబడకుండా.

"దొంగముండల్లారా! ఎంత కండకావరం పట్టిందే మీకు! మీరు ఎంత ప్రాధేయపడితే మీకు ఈ ఉద్యోగాలిచ్చానే? మీ కంటే కుక్కలు నయం— వాటికి ఉన్న కృతజ్ఞత మీకు లేదేమే?" అన్నాడు వీరయ్య.

విమల తప్ప అంతా తలలు వాల్చి

కున్నారు. వీరయ్యచేత ఇలా తిట్లు తినడం అందరికీ అలవాటే. వీరయ్యకు కోపంవస్తే బూతులు ప్రయోగిస్తాడు.

"సమ్మె చేస్తారా? ఆ గోపీగాడు మిమ్ములను చెడగొట్టాడు రేపు వాడు బ్యాంకు ఉద్యోగాని కెళ్తాడు. ఆ తరువాత మీ గతేంటి? అసలు నేను ఈ రోజునే అందర్నీ డిస్మిస్ చేసిపారేస్తాను. నెలకు అరవై రూపాయ లిస్తానంటే వంద మంది దూకుతారు మీ ఉద్యోగాలు తీసుకోడానికి."

టీచర్లంతా మౌనంగా ఉన్నారు.

"ఏం పలకరు?"

ఎవ్వరూ పలుకలేదు.

"ఛీ! మీరు మనుషులా? కుక్కల కన్నా హీనం! కుక్కలకున్న విశ్వాసం మీకు లేదు"

గోపీ దూకుడుగా నళిని రూంలో కెళ్లాడు.

"వీరయ్యా! నీవు మనిషివి గాదు! కుక్కలమీద అంత గౌరవం ఉన్న నీవు, సాటి మనుష్యులను ఎలా గౌరవించ గలవు? కుక్క గుణాలను గొప్పగా చెప్పుకునే నీ మనస్తత్వం కుక్కదశను దాటలేదు"

"గోపీ! ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?" గర్జించాడు వీరయ్య.

"తెలుసు! కుక్కకన్నా హీనమైన వాడితో. నీకు కుక్కలంటే ఇష్టంగదా! నీది ఎంగిలికూడు తినే కుక్కబుద్ధి. మేము సంపాదించుకున్న డబ్బు తింటున్న కుక్కవి నీవు. మా కూటిలో భాగం తీసుకునే ఊరకుక్కవు నీవు! వీరయ్యా! నీ వొక క్షుద్రుడవు. అక్షర జ్ఞానం లేని పశువువు. కానీ ఇక్కడి టీచర్లు సభ్యతా సంస్కారంగల కుటుంబాల్లో నుండి వచ్చారు. నీకంటే విద్యావంతులు, వాళ్ళను గౌరవించడం నేర్చుకో" అన్నాడు గోపీ ఆవేశంగా.

"గోపీ! నిన్ను ఈ క్షణాన డిస్మిస్ చేస్తున్నాను. బళ్ళో కాలు పెట్టావంటే మెడబట్టి గెంటిస్తాను. ఊం పో!"

"నళినీ, విమలా, కనకం, ఇందుమతీ, సరోజా, రండి అంతా రండి! ఈ క్షణంనుంచే సమ్మె ప్రారంభం అయ్యింది. పదండి పోదాం" అని గోపీ పెద్ద పెద్ద అంగలతో బడివదిలి వాకిట్లో కెళ్ళిపోయాడు.

గోపీ వెనుక టీచర్లు అంతా వాకిట్లో కొచ్చారు.

వీరయ్య నళిని రూంనుండి బయటకు వచ్చి బండబూతులు తిడుతున్నాడు. ఆ బూతులు వినగానే గోపీ వాకిట్లో నుండి రివ్వున దూసుకొని వీరయ్య ముందు నిలబడ్డాడు, కాలిచెప్పు చేత బట్టుకొని.

"ఒరే వీరయ్యా! డిసిప్లిన్, డిసిప్లిన్ అని గొంతుచించుకుంటివే? ఆ మాటకు నీకు స్పెల్లింగ్ తెలుసా? పసిబిడ్డలు చదువుకొనే బడిలో, ఆ పిల్లలు గౌరవించే ఉపాధ్యాయులను బండ బూతులు తిడుతున్నావా! నీ నోట మరో బూతు మాట వచ్చిందంటే చెప్పుతో ఆ నోటి మీద కొడ్తాను" అంటూ చెప్పు చేత బట్టుకొని నిలబడిన గోపీని చూచి వీరయ్య నళిని రూంలో కెళ్ళి తలుపు మూసుకున్నాడు.

అప్పటికే చాలామంది పిల్లలు క్లాస్ వదిలి గుంపులుగా చేరి ఈ గొడవను చూస్తున్నారు.

"పిల్లలూ అంతా ఇండ్లకు వెళ్లండి

ఈనాటి నుండి సమ్మె జరుగుతుంది, అంచే బడి ఉండదు. మళ్ళీ మేము పిలిచే దాకా ఎవరూ రాకండి ! వెళ్ళండి" అని గోపీ పిల్లలకు చెప్పగా, వాళ్ళు సంతోషంగా కేరింతలు కొట్టుకుంటూ ఇండ్లకెళ్ళి పోయారు.

ఆ తరువాత టీచర్లంతా వెళ్ళి నళిని ఇంట్లో సమావేశం అయి చర్చించుకున్నారు.

నిజానికి గోపీ తప్ప టీచర్లు అంతా వణికి పోతున్నారు. నళిని అంది ఆందోళనగా "గోపీనాథ్ గారూ ఏమిటి? ఈ రోజున ఇంత విజృంభించారు?"

"నారక్తం మరిగిపోయింది! ఇన్నిన్ని తిట్లూ, బూతులూ తింటూ ఎలా ఉంటున్నారు? ఏం? సరోజగారూ, ఇందుమతి గారూ మీ భర్తలు ఈనాడు వీరయ్య మిమ్మల్ని తిట్టిన తిట్లలో పదోవంతు ఎప్పుడైనా తిట్టారా?"

"లేదు" అంటూ ఇద్దరూ తలలు వంచుకున్నారు.

"హుఁ! ఇంత అభిమానం చంపుకుని ఉంటున్నారు గదా? నెలకు వంద రూపాయల జీతం ఇచ్చేవాడి దగ్గర ఇంత బానిసత్వం ప్రదర్శిస్తారా?"

"గోపీనాథ్‌గారూ! ఈ వీరయ్యకు అంగబలం, అర్థబలం చాలా ఉన్నాయి. వీడికి రౌడీల అండ ఉంది. మనల్ని చాటుగా దెబ్బతీస్తాడు. జాగ్రత్తగా ఉండండి" ఆందోళనగా అంది నళిని.

"సరే! ఇప్పుడేపోయి పోలీసు రిపోర్టు ఇస్తాను. మన అందర్నీ వీరయ్య రౌడీల చేత తన్నించబోతున్నాడని రిపోర్టు ఇస్తాను. ఇక మీరంతా ఇండ్లకు వెళ్ళండి. నేను బడిలో నుండి నా సామాన్లు తీసుకొని స్వంతం చేరుకుంటాను. ఆ తరువాత బడి ముందు శిబిరం వేస్తాను. రేపు ఏడింటికల్లా అంతా రండి! అందులో కూర్చుని సమ్మె సాగిద్దాం. ఈ వీరయ్య ఎలా దిగిరాడో చూద్దాం! ఏమంటారు?" అన్నాడు గోపీ. మిగిలిన టీచర్లంతా అలాగే అన్నట్లు తలలు ఊపారు.

గోపీ పోలీస్ స్టేషన్ కెళ్లాడు.



## 24

వీరయ్య ఆ రోజు రాత్రి పది గంటలకు ఇంటి కొచ్చాడు ఆలోచనల్లో మునిగిపోయాడు. అన్నానికి రమ్మని పిలిచిన వంట మనిషితో ఆకలిలేదు అన్నాడు.

ఇంతలో సోమయ్య వచ్చాడు. వీరయ్యకు వినయంగా నమస్కరించి ఒక కుర్చీని లాక్కుని వీరయ్య ఎదురుగా కూర్చున్నాడు.

"బాబుగారూ! మనం ఎంగిలిచేత్తో తోలితే పడ్డ మెతుకులు తిన్న కుక్కలు క్రొవ్వెక్కాయి. మనమీదనే ఎదురు తిరిగాయి!"

"అవును! సోమయ్యా! ఈ రోజున ఆ గోపిగాడు ఎంతెంత మాట్లన్నాడో తెలుసునా? ఆఖరుకు చెప్పు తీసుకొని తన్నడానికి వచ్చాడు. వాడితల పొగరు ఇంతా అంతాగాదు"

"అయిపోయింది! వాడికి భూమ్మీద

నూకలు చెల్లాయి! అయ్యగారికి కోపం వస్తే వాడు బ్రతుకుతాడా?"

"బతికేట్టే ఉన్నాడోయ్!"

"ఎలా బతుకుతాడండీ! తల్చుకుంటే వాడ్ని నల్లిని నలిపినట్లు నలిపేయగలరు అయ్యగారు"

"ప్చ్! ఈ తడవ రౌడీ పద్ధతులు పని చేసేట్లులేవు" అన్నాడు విషాదంగా వీరయ్య.

సోమయ్య రోషంగా అన్నాడు. "ఎందుకని?"

"వాడు ఇందాకే పోలీస్ రిపోర్టు ఇచ్చాడు. తమకు జీతాలు సక్రమంగా ఇవ్వడం లేదనీ, జీతాలు పూర్తిగా ఇవ్వాలని తాము సమ్మె చేస్తున్నామనీ, నేను రౌడీలను పంపించి, పంతుళ్ళందర్నీ ఈ రాత్రే తన్నిస్తానని అన్నాననీ రిపోర్టు ఇచ్చాడు"

"పోలీస్ ఇన్‌స్పెక్టర్‌ను... పట్టుకొని ఈ రాత్రే, గోపీని..."

"సోమయ్యా ఆ ఆలోచనలుమానుకో మన డబ్బు తిన్న ఇన్‌స్పెక్టరూ, కానిస్టేబులూ మారిపోయారు. ఎవడో కొత్తవాడి లాగా ఉన్నాడు. ఇన్‌స్పెక్టర్ ఇందాక ఫోన్ చేసి వార్నింగ్ లాంటిది ఇచ్చాడు. గోపీ రాత్రికి కాలుజారిపడినా మూసేస్తా నన్నాడు" "ఓరినీ! గోపీగాడికెన్ని గుండెలు? అయినా ఆ ఇన్‌స్పెక్టరు ఆ గోపీగాడి రిపోర్టుకు అంత విలువ ఎలా ఇచ్చాడబ్బా?"

"గోపీ ఆ రిపోర్టును ఇన్‌స్పెక్టర్ కిచ్చి దాని కాపీలు కలెక్టర్‌కూ, డి.యస్.పి కీ, ఐ.జి. కీ, మినిస్టరుకూ పంపాడట, దాంతో వాడికి వీరేచనాలు పట్టుకున్నట్టున్నాయి"

"వీడిదుంపతెగా! ఇంతకు బరితెగించాడన్నమాట. నేను వద్దు మొర్రోఅంటే వినిపించుకోక పోతిరి. ఈ బిజినెస్‌లో మొగముండాకొడుకులు పనికిరారయ్యా బాబూ అంటే మీరు వినలేదు. అప్పుడేమో వీడొట్టి చచ్చువెధవ అంటిరి. ఇప్పుడు చూడండి."

వీరయ్య జేబులోంచి చుట్టను తీసి వెలిగించుకున్నాడు. సోమయ్య మళ్ళీ అన్నాడు

"కొంపదీసి ఆ రిపోర్టు కాపీని డి.యి.ఓ.కు గూడా పంపాడా?"

"తెలీదు. వీడికి తెలిసి ఉండదు. అయినా తెలుసుకోక పోడు"

"ఆ డి.యి.ఓ.కు రిపోర్టుపోతే కొంప గుండమే. వెనుకటి సంవత్సరాలకు మనం పెట్టుకున్న గ్రాంట్సుప్రపోజల్స్ ఇప్పుడిప్పుడే కదిలిస్తున్నాను. ఈ రిపోర్టు వాళ్ళ చేతిలో బడితే ఇంక అంతా పాన కాలరాయుళ్లై కూర్చుంటారు. రేపు రికగ్నిషన్‌కు గూడా ఆటంకం రావచ్చు"

"అంతేగాదు రేపు పంచాయతీ ఎన్నికల్లో ట్రబుల్ కూడా రావొచ్చు. అందుకని సమ్మె ఆపి తీరాలి."

సోమయ్య తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. వీరయ్య ఆరిపోయిన చుట్టను పీల్చి పీల్చి నేలకేసి కొట్టాడు. ఆఖరుకు సోమయ్య అన్నాడు

"ఎటూ పాలుపోవడం లేదు అయ్యగారూ! ఏమైనా ముందా గోపీని కనీసం ముక్కలు విరగ్గొట్టించాలి"

"దానివల్ల లాభం ఏమిటి"

"భయపడతాడు. బహుశ ఊరొదిలి పారిపోవచ్చు"

"అలా అనిపించడం లేదు

సోమయ్యా! వాడు పోలీస్ రిపోర్ట్ ఇవ్వ వచ్చు.పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఇంకా మచ్చిక కాలేదు. అనవసరంగా కేసులో ఇరు క్కోవాలి. దాంట్లోంచి బయటపడటానికి అయ్యే ఖర్చుతో ఈ పంతుళ్ళకే పదో పరకో జీతం పెంచవచ్చును గదా?"

"పంతుళ్ళకు జీతం పెంచుతారా?"

"తప్పేట్టు లేదు మరి"

"మరి ఆ గోపీగాడ్ని అలా వది లేయాల్సిందేనా?"

"ప్రస్తుతానికి అంతే లాగుంది"

"అంటే...కొన్నాళ్ళకు... సద్దుమణి గాక..."

"ముందు ఆ సద్దుమణిగే సంగతి ఆలోచించు"

"మరి గోపీతో మాట్లాడి రమ్మం టారా"

"అందర్నీ విడివిడిగా కలిసి చూడు"

"ఎంత పెంచుతామని చెప్పమ న్నారు"

"వాళ్ళకు ఎంత పెంచుతామో చెప్పకు. కొంతపెంచుతాం అను ముందు రేపు సమ్మె లేకుండా చూస్తే ఆ తరు వాత నేను వాళ్ళతో చర్చించి ఒక నిర్ణ యానికొస్తానని చెప్పు"

సోమయ్య లేచాడు. వీరయ్య మళ్ళీ అన్నాడు.

"కాస్త వాళ్ళలో అభిప్రాయ భేదం గూడా కలిపించు. నళినికి ఆశ పెట్టు. ఆమె జీతం మాత్రం నెలకు నూటపాతిక నుండి నూట యాభైకి పెంచుతాం అని అను. లొంగకుంటే నూటడెభ్భై అను. ఆఖరు ఛాన్సుగా రెండు వందల దాకా పో, ఆ తరువాత చూద్దాం"

సోమయ్య హుషారుగా వెళ్ళి పోయాడు.

వీరయ్యకు భయం కలుగుతున్నది. భార్యకు జబ్బు చేయడం మొదటి దెబ్బ, సినిమా హాలు కొనడం రెండో దెబ్బ; సినిమా హాలునూ, కాన్వెంటునూ నమ్ము కొని లారీలన్నీ అల్లుడి కిచ్చేయడం మూడో దెబ్బ, ఇప్పుడీ కాన్వెంటులో కలతలురేగడం నాలుగో దెబ్బ ఈ దెబ్బ లన్నీ తను తట్టుకోగలడా ?

సినిమా హాలు కొడుకు పేరున పెడితే వాడు దానిమీద వచ్చే ఆదాయం అంతా దిగమింగడమే గాక అప్పు డప్పుడు పదీ పరకా తనదగ్గరనుండే ఎత్తుకొని పోతున్నాడు సినిమా హాలుకు చేసిన అప్పు రెండు లక్షలూ అలా నోరు తెరుచుకొని ఎదురు చూస్తున్నది. ఈ కాన్వెంటు ఇలాగే గడిచి ఆ గ్రాంటు డబ్బులు ముడితే ఈ ఏటి చివరకు సగం అప్పు తీర్చొచ్చు సినిమా హాలును అబ్బాయి పేరున పెట్టడం పెద్ద పొర బాటు. ఇక కూతురి సంగతి చూద్దా మంటే కూతురికీ అల్లుడికీ అభిప్రాయ భేదాలొచ్చినట్లూ, కూతుర్ని అల్లుడు రాచి రంపాన పెడుతున్నట్లూ వార్తలు వస్తు న్నాయి. లారీ బిజినెస్ పూర్తిగా అల్లు డికి అప్పచెప్పడమూ పొరబాటైంది. ఆ అల్లుడుగాడు లారీలను ఉంచుకొని కూతుర్ని వెళ్ళగొడితే ?

ఇలా చాలాసేపు మథన పడ్డాడు వీరయ్య.

ఒక గంటతరువాత సోమయ్య ముఖం వేలాడేసుకొని వచ్చాడు.

"ఏమైంది సోమయ్యా"? ప్రశ్నిం చాడు వీరయ్య.

"వాళ్ళు కొండఎక్కి కూర్చున్నారు"

"అంటే అంతా కలసి కట్టుగా ఉన్నారా"

"ఆఁ!"

"నళిని ఏమంది"

"గోపీని సంప్రదించిగాని ఏ విషయం చెప్పనంది"

"మిగతావాళ్లూ"

"వాళ్లూ దాదాపు అదే మాట అన్నారు"

"ఐతే సమ్మె ఆగదంటావు"

"ఆగేట్టు లేదు! ఆ గోపీగాడు అప్పుడే అన్ని ప్రయత్నాలూ చేస్తున్నాడు. బడిముందు రోడ్డుకు ప్రక్కగా నాలుగు బొంగులు పాతి పైన మట్టలు కప్పిస్తున్నాడు. పెద్ద పెద్ద అట్టలు తెప్పించి దానిమీద స్లోగన్సు రాస్తున్నాడు. అలా వెళ్తూ వెళ్తూ పోలీస్ స్టేషన్‌లో ఆరాతీశాను. రేపు ఇద్దరు కానిస్టేబుల్స్‌ను బడిముందు ఉంచుతారట"

వీరయ్యా సోమయ్యా మాటలను ఆశ్చర్యంగా పెద్ద పెద్ద కళ్ళు చేసుకొని వింటున్నాడు.

"మరి సోమయ్యా. ఏమైనా అసలు సంగతి తెలుసుకోగలిగావా? వాళ్ళు ఎంత పెంచితే ఈ సమ్మె మానుకుంటారో."

వాళ్ళు కొండఎక్కి కూర్చున్నారు గవర్నమెంటు స్కేల్సుతో సమానంగా జీతం ఇవ్వాలట! అలవెన్సులు ఇస్తుండాలట! కాజువల్ లీవూ ఎరన్‌డ్‌లీవూ కావాలట. మాస్టర్ల సంఖ్యను పెంచాలట. ఐదు వందల మంది పిల్లలున్నారు గనుక కనీసం పదిమంది మాస్టర్లుండాలట!

సోమయ్యా మాటలు వింటూంటే వీరయ్యకు కంపరం పుట్టింది. ఆ కోరికలన్నీ తీరుస్తే తనకు నెలకు మూడు వేల రూపాయల జీతం బిల్లు తగుల్తుంది. తనకు మిగిలేది మూడువేలు మాత్రమే. రెండేళ్ళలో అప్పు తీర్చి పారేయాలన్న తన లక్ష్యం ఇంకా దూరానికి పోతున్నది. ఒకసారి పెంచడం మొదలెడితే వీళ్ళు పూర్తి జీతం ఇచ్చేదాకా వదుల్తారా!



## 25

రాత్రి రెండు గంటలైంది. గోపీ శిబిరంలో పడుకొని ఉన్నాడు.

అంతా చీకటిగా ఉంది. దూరాన కరెంటు దీపాలున్నాయి. వీరయ్య మనుష్యులు తనను తంతారేమోనన్న భయం ఒక మూలన పీకుతుంటే పర్వాలేదులే పోలీస్ రిపోర్టు ఇవ్వడం మంచిదైంది ఇన్‌స్పెక్టర్ గూడా ధైర్యం చెప్పాడు అన్న భావం ధైర్యాన్నిస్తున్నది

ఇంతలో ఎవరో ఒక మనిషి శిబిరం వైపుగా వస్తున్నాడు. గోపీ చివాలున లేచి సిద్ధంగా ఉంచుకున్న పొడవాటి రూళ్ళ కర్రను చేత బట్టుకొని నిలబడ్డాడు. ఆ వ్యక్తి శిబిరాన్ని సమీపించాడు.

"ఎవరు నీవు" ప్రశ్నించాడు గోపీ.

"నా పేరు రామయ్యా బాబూ! గండయ్యగారి నౌకర్ని! గోపీనాథ్ గారంటే మీరేనాఅండీ!" గండయ్యా ఆ రెండో కాన్వెంటు యజమాని. అని

తెలుసు గోపీకి.

"అవును నేనే ఏం పని నీకు నాతో"

"గండయ్యా గారు తవర్నొకసారి కలుసు కోవాలన్నారండీ"

"ఇంత రాత్రప్పుడా ?!"

"అవును బాబూగారూ !"

"గోపీ ఒక్క క్షణం ఆలోచించాడు. గండయ్యకు ఇప్పుడు తనతో ఏం పని? గండయ్యకు రాజకీయబలం ఉంది! తమ సత్యాగ్రహానికేమైనా సాయం చేస్తాడేమో కనుక్కోవాలి! కానీ ఎలా చేస్తాడు? అతడూ సగం జీతాలు ఇచ్చి కాన్వెంటు నడుపుతున్నాడు గదా ? అయినా చూద్దాం అనుకొని రామయ్యతో "చూడు రామయ్యా నేను గండయ్యా దగ్గిరికెళ్తాను. నీవు ఇక్కడ ఉండి ఈ శిబిరాన్ని జాగ్రత్తగా చూస్తూ ఉండు" అన్నాడు

"అలాగే బాబుగారూ !"

గోపీ రూళ్ళ కర్ర చేత బట్టుకొని బయలు దేరాడు. గోపీని చూడగానే గండయ్యా ఎదురొచ్చి "రండి ! రండి! గోపీనాథ్‌గారూ!"అన్నాడు. గోపీని ఒక కుర్చీలో ఆసీనుడిని చేసి తను ఎదురుగా కూర్చున్నాడు.

"గోపీనాథ్‌గారూ! శెబాష్! ఈ రోజున వీరయ్యను చెప్పు దీసుకొని కొట్టబోయారటగా ?!"

"అవునండీ! ఆడవాళ్ళను పట్టుకొని అమ్మనాలి బూతులు తిడుతుంటే ఒళ్ళు మండి పోయింది!"

"పోదాండీఅఖరి! వాడు చదువుకున్న వాళ్ళతో ఎలా మాట్లాడాలో తెలీని చవట సన్యాసి. డబ్బుండగానే ఏం ప్రయోజనం గోపీనాథ్‌గారూ? సంస్కారం ఎక్కడున్నించొస్తుంది. మా బళ్ళో ఉన్న టీచర్లను అడగండి—ఎవర్నైనా, ఎప్పుడైనా పల్లెత్తు మాట అన్నానేమో? సరే! సమ్మె చేస్తున్నారటగా ?"

"అవునండీ"

"లాభం లేదు గోపీనాథ్‌గారూ! వీరయ్య లొంగి రాడు. వాడొక దోపిడీ దారు! పెట్టుబడిదారు. వాడిదోపిడీ గుణం సమ్మెలకు లొంగదు. సమ్మెట పోట్లు తగలాలి!"

"అంతకు మించి మేమేం చేయగల మండీ!"

"సమ్మె చేసినందు వల్ల ఏమీ లాభం లేదు! పైగా వాడు క్రూరుడు. ఇప్పటికే చాలా హత్యలు చేయించాడు. ఈ సమ్మె చేస్తే వాడు నీ ప్రాణాలు తీయక మానడు. ఇదివరకు లారీ బిజినెస్‌లో అడ్డం తగిలిన ఇద్దర్ని లారీ ఆక్సిడెంటుకు గురిచేసి చంపాడు."

గోపీ క్షణకాలం వణికి పోయాడు "గండయ్యగారూ ! మీకు పుణ్యం ఉంటుంది. కాస్త మీ రాజకీయ బలాన్ని మా వైపు ఉంచండి!" అన్నాడు.

"లాభం లేదు గోపీనాథ్ గారూ! ఇదొక బూజు పట్టిన ధన స్వామ్య వ్యవస్థ. వీరయ్య లాంటి వ్యక్తులు వ్యక్తులు గాదు. దోపిడీదార్లు. అభివృద్ధి నిరోధకులు. ఈ వ్యవస్థను సమూలంగా నాశనం చేయాలి ! ఎక్కడి కక్కడే విప్లవం రావాలి. జీతం చాలక కడుపులు కాలిన శ్రామికులు ఎక్కడి కక్కడే విప్లవాన్ని సృష్టించాలి. దోపిడీదార్లను మట్టు పెట్టాలి. ఈ దుష్ట వ్యవస్థను కూకటి వ్రేళ్ళతో పెకిలించాలి. ఆనాడు గాని దేశం బాగుపడదు !"

గోపీకి భయం వదిలి ఆవేశం పట్టుకుంది. అవును ఈ వీరయ్యను అంతం చేయాలి లేకుంటే వీడు తనను అంతం చేస్తాడు అనుకున్నాడు గోపీ.

"బాగుంది గండయ్యగారూ మరి నేను ఎంతటివాణ్ని. పేదవాణ్ణి ఒక్క వీరయ్యను నేనేం చేయగలను ?"

"అదే పెద్ద పొరపాటు. చేయదల్చుకుంటే ఎంతపనైనా మానవుడు అవలీలగా చేసెయ్యొచ్చు. మానవ రక్తాన్ని త్రాగే ఆ దోపిడీదారు వీరయ్యను, కుక్కను కాల్చి చంపినట్లు చంపొచ్చు"

"నిజమే కాల్చడానికి మన దగ్గర ఏముంది? అగ్గిపెట్టె తప్ప"

గండయ్యా చివాలున లేచాడు. అలమారు తలుపు తెరిచి ఒక అట్ట పెట్టెను తెచ్చాడు "దీనితో వీరయ్యను చంపవొచ్చు" అంటూ అట్టపెట్టెలో రివాల్వర్ లాంటి ఒక ఆయుధాన్ని తీశాడు.

గోపీ భయంగా దానివంక చూశాడు.

"ఇది ఒక నాటు రివాల్వర్! ఇందులో ఒకటే గుండు ఉంటుంది. దీనిని తీసుకొని నేరుగా వీరయ్యా ఇంటికెళ్ళు. గుండెల మీద పెట్టి ట్రిగ్గర్ నొక్కు. ఆ తరువాత నేను చెప్పిన స్లోగన్స్ కొట్టు అంతే, ఒక దోపిడీదారు అంతం అవుతాడు" అంటూ రివాల్వర్ గోపీ చేతికిచ్చాడు.

గోపీ వణుకుతూ రివాల్వర్ పట్టుకొన్నాడు. గండయ్యా దాని సింపుల్ మెకానిజంను గోపీకి చెప్పాడు. గోపీలో వేరే ఆలోచనలు కలిగాయి.

తను వీరయ్యను చంపుతాడు. ఏంటి లాభం? తను వీరయ్యను చంపినందుకు తనను ఉరి దీస్తారు. దానివల్ల తనకేం లాభం? తల్లీ, చెల్లెళ్లూ ఏమైపోవాలి? వీరయ్యా చస్తే ఈ దురన్యాయం అంతం అవుతుందా? మిగతా టీచర్ల బ్రతుకులన్నా బాగుపడతాయా? ఎలా బాగుపడుతాయి? వీరయ్యా చచ్చాక కాన్వెంటు అమర్‌నాధ్ చేతికి వస్తుంది అమర్‌నాధ్ గూడా తండ్రి అంతటి దుష్టుడే. కొడుకే ఇంకో రెండు ఆకులు ఎక్కువ చదివాడు. వాడూ సినిమాహాలు ఉద్యోగులకు చాలీ చాలని జీతం ఇచ్చి మాడ్చి చంపుతున్నాడు. అమర్‌నాధ్‌కు కాన్వెంటు చిక్కితే టీచర్లను మాడ్చి చంపటమేగాక వాళ్లను ప్రతి రాత్రీ ఇంటికొచ్చి తన పక్కలో పడుకోమంటాడు. అమర్‌నాధ్‌ను ఈ టీచర్లు ఎదిరించి తమ మాన సంరక్షణ చేసుకోగలరా? ప్చ్! అంత మాత్రం ధైర్యం ఉన్నవాళ్ళు లేరు. పరిస్థితులు అని తల వంచుకొంటారు. ఈ గండయ్యా చెప్పే వ్యవస్థ వీరయ్యా చావుతో అంతం కాదు. ఛీ! ఛీ! ఈ గండయ్యా గూడా టీచర్లకు సగం జీతాలిస్తున్నాడు. తాము సమ్మె చేశామని వీడి టీచర్లకూ తెలిస్తే వాళ్ళూ సమ్మె చేస్తారని వీడి భయం. ఓరి గండయ్యా నీవు దేవాంతకుడివిరా. ఒక్క దెబ్బతో తమ సమ్మె ఫెయిలౌతుంది. వీరయ్యా చస్తాడు. అమర్‌నాధ్ మిస్ మేనేజ్‌మెంటుతో కాన్వెంటు మూత పడుతుంది. నీ కాన్వెంటు బాగు పడుతుంది.

ఇలాటి ఆలోచనలు రాగానే గండయ్యా ముఖంలోకి పరిశీలనగా చూశాడు. చేతిలో రివాల్వర్‌ను తడుముతూ గండయ్యా అనర్గళంగా ఉపన్యసిస్తున్నాడు.

"కనుక ఈ దోపిడిదార్లను హత

మార్చాలి. విప్లవం వర్ధిల్లాలి. విప్లవం ఎక్కడికక్కడే పుట్టుకు రావాలి. పుట్టి ఈ వ్యవస్థను నామరూపాలు లేకుండా చేయాలి."

"సిద్ధంకా గోపీనాథ్!..."

"గండయ్యా!"

"ఆఁ. ఏమిటి?"

"ఈ రివాల్వర్‌లో గుండుందా?"

"ఉంది."

"అయితే కాచుకో! ముందు నిన్నే ఈ గుండుదెబ్బతో చంపుతాను."

గండయ్యబిత్తరపోయాడు. భయంగా కుర్చీలోనుండి లేచి వెనక్కు వెనక్కు వెళ్తూ గోడ తగలగా ఆగిపోయాడు. విహ్వాలంగా అన్నాడు.

"గోపీనాథ్‌గారూ ... జాగ్రత్త! మీ వేలును ట్రిగ్గర్‌కు దూరంగా ఉంచండి" అన్నాడు.

గోపీ రివాల్వర్‌ను గండయ్య గుండెకు ఎదురుగా పెట్టాడు. "గండయ్యా! గురి సరిగ్గా ఉన్నట్లేనా?"

"కరెక్టుగా ఉంది ... జాగ్రత్త... ట్రిగ్గర్‌మీద వేలు పడనీకు!"

"గండయ్యా! నీవూ ఒక దోపిడీదారువేగదూ?"

"నేనెందుకు దోపిడీదారు నౌతాను? ప్రజాసేవ చేస్తున్నాను."

"గండయ్యా! నా దగ్గర కబుర్లు చెప్పకు. నీ కాన్వెంటులో ఇప్పుడు మూడువందలమంది పిల్లలున్నారు. వారు నెలకు ఒక్కొక్కరు పన్నెండు రూపాయల వంతున ఫీజు కడితే, నెలకు నీకు మూడువేలా ఆర్నూరు రూపాయి లొస్తాయి. నీవు నలుగురు మాష్టర్లను పెట్టావు. వాళ్ళకు నీవు నెలకిచ్చే జీతం నాలుగొందల పాతిక. ఆయా, స్వీపర్‌తో కలిపి నీ నెలఖర్చు ఐదొందలు. అంటే నీకు నెలకు మిగిలేది మూడువేలా ఒక వందరూపాయలు. సంవత్సరానికి టరం ఫీజులతో గూడా కలిపి నలభైవేల రూపాయల ఆదాయం. ఇదేమిటి? దేశసేవా? దోపిడీకాదా? ఇందాక నీవు వర్ణించిన దోపిడీదారుల ఘోరాలు విన్నాక నాకు ఆవేశం ఎక్కువైంది. వీరయ్య ఇంటిదాకా పోయే ఓపికలేదు. ముందు నిన్ను చంపుతాను, తరువాత వీరయ్యనూ చంపుతాను."

"గోపీ, గోపీ! నన్ను చంపకు... ఆ వేలు ట్రిగ్గర్‌దగ్గరకు రానీకు. ట్రిగ్గర్ చాలా టెన్షన్లో ఉంది''

"వీరయ్యను అంత చేయాలంటే, నన్నే ఎందుకు వినియోగించాలి? నీవు పోయి ఈ రివాల్వర్‌తో వీరయ్యను చంపరాదూ? లేక నీ కొడుకును ఉపయోగించరాదూ?"

"ఊహూఁ! అలా చేయగూడదు. అది సిద్ధాంతానికి వ్యతిరేకం! విప్లవం ఎక్కడికక్కడే పుట్టాలి. బయటివారు కేవలం ఆయుధసహాయం చేయాలి. విప్లవానికి బయటి మనిషి సాయం ఉండగూడదు"

"సరే గండయ్యా! ఈ తుపాకిని నా దగ్గరుంచుకుంటాను, ఇంకో అయిదారు గుండ్లుంటే ఇవ్వు."

గండయ్య అలమారా తీశాడు. గోపీ గండయ్యను హెచ్చరించాడు.

"గండయ్యా! గుండ్లుతీయి. తుపాకీని తీయకు."

"ఇంక తుపాకులు లేవు. గుండ్లే ఇస్తాను. ఎన్ని?"

"ఆరు ఇవ్వు?"

"ఎందుకు?"

"ఒకటి నీకూ, ఒకటి వీరయ్యకూ, రెండు-టీచర్ల కడుపులు మాడ్చి యూనివర్సిటీల్లో జల్సాగా తింటున్న నీ బిడ్డలకూ."

"గోపీనాథ్‌గారూ! అలా అనకండి." అంటూ ఆరుగుండ్లూ పొట్లంగట్టి గోపీకి ఇచ్చాడు.

"ఒక కాగితం, కలమూ తీసుకో!"

గండయ్య కాగితం, కలం తీసుకొన్నాడు.

"రాయి."

"ఏమని?"

"చెబుతాగా!"

గండయ్య కుర్చీ మీద కూర్చుని రాయబోతున్నాడు. గోపీ డిక్టేట్ చేస్తున్నాడు.

"ఈ ఒక గుండుగల నాటుతుపాకీ, ఏడు గుండ్లూ నావి. గోపీనాథ్‌గారు సమ్మె చేస్తుంటే వీరయ్య గోపీని చంపుతానని బెదిరించాడు. అందువల్ల గోపీగారి ప్రాణ సంరక్షణార్థం, ఆత్మరక్షణకోసం నేను వీటిని గోపీనాథ్‌గారికి ఇస్తున్నాను. ఈ తుపాకీకి సంబంధించిన లైసెన్సు విషయాలకు బాధ్యత నాదే" ఇలా చాలా పెద్ద ఉత్తరం డిక్టేట్ చేశాడు గోపీ.

గండయ్య గోపీ చెప్పినదంతా రాసి సంతకంచేసి ఇచ్చాడు. గోపీ చేత ఉత్తరాన్ని సేఫ్టీచుకొని రివాల్వర్‌నూ, గుండ్లనూ అట్టపెట్టెలో పెట్టుకుని గండయ్య ఇల్లు విడచి వెళ్ళిపోయాడు.



## 26

గండయ్య ఇంటికి గోపీ వెళ్ళిన కబురు వీరయ్య మనుష్యులు వీరయ్య చెవిలో వేకువ ఝామున నాలుగు గంటలకు వేశారు. పట్టకపట్టక నిద్రపడుతున్న వీరయ్య ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు.

గండయ్య, వీరయ్యకు బద్ధశత్రువు. కాన్వెంటులోపోటీ, పంచాయతీ రాజకీయాలలో పోటీ, ఆఖరుకు లారీ బిజినెస్‌లో కూడా గండయ్య, వీరయ్య పాలిటి గండకత్తెరలాగా తయారయ్యాడు.

ఇప్పుడు గండయ్యతో గోపీ చేతులు కలిపాడన్న వార్త విని అదిరిపోయాడు వీరయ్య. గోపీ, గండయ్య చేతిలోపడితే తన జుట్టు గండయ్య చేతిలో ఇరుక్కున్నట్లే. ఏం చేయాలి? అని చాలాసేపు మధన పడ్డాడు వీరయ్య.

ఇక లాభంలేదు గోపీని కలిసి, రాజీ బేరం ఆడాల్సిందే అనుకున్నాడు తలాయాభై పెంచినా ఆరుగురికీ కలిపి ముష్టి మూడొందలు కావు. పోనీ ఈ గోపీ తెగించాడు. ఆ గండయ్య బలం కలిస్తే తను చాలా చిక్కులు పడాలి. వెంటనే వీరయ్య, సోమయ్యకు కబురు పంపాడు. సోమయ్య నిముషాల మీద వచ్చి పడ్డాడు.

ఇద్దరూ ఈ సరి క్రొత్త వార్తను చర్చించుకుని ఆఖరుకు గోపీ వేసిన సత్యాగ్రహ శిబిరం వైపు వెళ్ళారు.

గోపీ శిబిరంలో ఒక బొంగును ఆనుకుని తూగుతున్నాడు. సోమయ్య పిల్చాడు "గోపీ గోపీ" అని.

గోపీ ఉలిక్కిపడి లేచి చటుక్కున చేతిలోకి రూళ్ళ కర్రనూ, అట్ట పెట్టెనూ తీసుకున్నాడు.

గోపీ రూళ్ళ కర్రను తీసుకొని యుద్ధానికి రెడీగా ఉన్న పోజును, శిబిరంలోని లాంతరు వెలుగున చూచి నివ్వెరపోయాడు వీరయ్య. 'ఊంహూ వీడు యుద్ధానికి గూడా రెడీగా ఉన్నాడు' అని అనుకున్నాడు.

"నేను గోపీ! సోమయ్యను" అంటూ సోమయ్య శిబిరంలో కొచ్చాడు.

గోపీ రూళ్ళ కర్రనూ, అట్టపెట్టెనూ ప్రక్కన బెట్టి "కూర్చోండి" అని తనూ కూర్చున్నాడు ఈతాకుల చాప మీద.

సోమయ్య, వీరయ్య ఆయిష్టంగా కూర్చున్నారు అంతా నిశ్శబ్దంగా ఉంది.

"గోపీ మనలో మనం సర్దుకుపోవాలి అభిప్రాయ భేదాలొస్తే" బహు కష్టం మీద అన్నాడు, వీరయ్య. గోపీ ఆశ్చర్యంగా చూశాడు వీరయ్య వంక.

"జీతం పెంఛమంటావు? అంతేగా" అడిగాడు వీరయ్య

"అంతేగాదు, ఇంకా చాలా ఉన్నాయి"

"ఏంటవి?"

"ఆడ టీచర్లను బూతులు తిట్టినందుకు క్షమాపణ చెప్పుకోవాలి"

"ఇక తిట్టను. సరా?"

"మాకు క్యాజువల్ లీవు కావాలి. ఇరవై రోజులు సంవత్సరానికి"

"సరే"

"పండుగలకూ, అవసరాలకూ ఎడ్వాన్సు ఇవ్వాలి"

"సరే"

"ఇంకా నలుగురు మాస్టర్లను నియమించాలి. ఐదువందల మందికీ ఆరుగురు మేష్టర్లం చెప్పలేక చస్తున్నాం. మందెక్కువ అయితే మజ్జిగ పలుచన అవుతాయి, ఆఖరుకు కాన్వెంటుకు ఇప్పుడున్న పేరు పోతుంది"

"ఒక్కసారి నలుగురు టీచర్లను పెట్టాలంటే కష్టం గోపీ, ఇద్దర్ని వేద్దాం"

"కనకం భర్త బి.ఏ. చదివాడు. మీరు పెట్టబోయే క్రొత్త మేష్టర్లు ఇద్దరితో అతనొకడుంటాడు"

"సరే"

"ఒక్కో టీచర్ కూ నెలకు మూడొందలు జీతం ఇవ్వాలి. హెడ్‌మిస్ట్రెస్‌కు మూడొందలయాభై ఇవ్వాలి"

"అంత జీతమా? గవర్నమెంటు వారికంటే ఎక్కువ"

"అయితే ఏం? మన కాన్వెంటులో గవర్నమెంట్ వారి బళ్ళల్లో కంటే బాగా చెప్తారని మీరే అంటుంటారు గదా"?

"అంత పెంచలేను గోపీ,'

"ఎంత పెంచుతారు?"

"ఒక్కో టీచర్ కూ పాతిక రూపాయల వంతున పెంచుతాను"

"లాభం లేదు"

"పోనీ యాభై"

"ఊంహూ:"

వీరయ్య చివాలున లేచాడు.

"సరే పోయిరండి. ఆ గండయ్య. మంత్రం వేస్తేగాని మీరు లొంగి రారు" వీరయ్య చటుక్కున కూర్చున్నాడు.

గోపీ! టీచర్లకు ఒక్కొక్కరికి రెండు పందలిస్తాను. హెడ్‌మిస్ట్రెస్‌కు రెండొం దలయాభై మాత్రమే ఇస్తాను. ఇంక ఒక్క పైసా ఎక్కువ ఇవ్వడం నా వల్లగాదు"

"సరే వీరయ్యగారూ! మీరు చెప్పి నట్లు ఒప్పుకుంటాను. ఆ చేత్తోనే ఆ సోమయ్యగారికీ జీతం పెంచండి, లేక పోతే మమ్మల్ని పీక్కుతింటాడు."

"చూద్దాం" అన్నాడు వీరయ్య. సోమయ్య తలవంచుకున్నాడు.

"డిసిప్లిన్ కట్‌లు, అనేవి ఉండ గూడదు. స్కూలు డిసిప్లిన్ చూసుకో వలసినది హెడ్‌మిస్ట్రెస్, ఆ బాధ్యత ఆమెది."

"అలాగే."

"సరే ఆ పాయింట్లన్నీ ఆమోదించి నట్లు కాగితం వ్రాయించి సంతకం పెట్టించి పట్రండి."

"గోపీ నెలజీతం సంగతి కాగితంలో ఎలా రాసుకుంటారు? వ్యవహారం తెలిసిన వాడెవడైనా చేసే పనేనా అది?"

"మరి మాకు నమ్మకం ఎలా కుదురు తుంది?"

"కుదుర్చుకోవాలి! మిమ్మలను నమ్మి జీతాలు కట్టించుకొనే పని మీకే అప్ప గించాకదా? మమ్ములను నమ్మలేరా?"

"సరే నమ్ముతాను."

"మరిక సమ్మె లేనట్లేనా?"

"లేనట్లే. ఈరోజు శెలవు ఇచ్చేయా ల్సిందే. పిల్లలు ఎవరూరారు, రేపట్నించి అందరికీ కబురుచేసి రప్పిస్తాను."

"సరే" అని వీరయ్య లేచాడు. సోమయ్యా లేచాడు ఇద్దరూ మౌనంగా నడుస్తూ వీరయ్య ఇంటికొచ్చారు.

"సోమయ్యా! ఈ గోపీ అఖండమైన తెలివితేటలు గలవాడు. వీడు ఎలాగూ చావక తప్పడు. మనం వీడ్ని విడువ గూడదు. కానీ ఎలా? ఎప్పుడు? చంపితే శవంగూడా చిక్కగూడదు, భస్మంగూడా కనబడగూడదు. సోమయ్యా! ఆలో చించు" అన్నాడు వీరయ్య పండ్లు కొరుకుతూ.

సోమయ్య తలపంకిస్తూ ఆలో చిస్తున్నాడు.



# 27

వీరయ్య, సోమయ్యలు సత్యాగ్రహ శిబిరంలోనుంచి వెళ్ళిపోయేటప్పటికి, వేకుపజామున అయిదు అయింది. వాళ్ళలా వెళ్ళగానే గోపీ తనదగ్గర ఉన్న అట్టపెట్టె న్యూస్ పేపరతో చుట్టాడు. చేత రూళ్ళకర్రను ధరించి బయలు దేరాడు.

నళిని ఇంటికెళ్ళి పేరుపెట్టి కేక వేశాడు. నళిని గోపీ మొదటి కేకకే జవాబిచ్చి తలుపు తీసింది.

"గోపీనాథ్‌గారూ! ఏంటి ఇలా వచ్చారు?" ఒక కుర్చీని తెచ్చి గది వెలుపల వేసింది. గోపీ కుర్చీలో కూర్చుంటూ, "నళినీ! మన సమ్మె సక్సెస్. వీరయ్య మన కోర్కెల నన్నిం

టీనీ అంగీకరించాడు. అందువల్ల సమ్మె కాన్సిల్ చేద్దామనుకున్నాను"

నళిని సంభ్రమంగా అడిగింది, "నిజం గానా?"

"అవును నళినీ. కానీ జీతం మటుకు మనం అడిగినంత అంటే మూడొందల రూపాయలు ఇవ్వడానికి ఒప్పుకుని చావ లేదు వీరయ్య. హెడ్‌మిస్ట్రెస్‌కు నెలకు రెండువందల యాభై, మిగతా టీచర్లకు నెలకు రెండొందలు ఇవ్వడానికి వీర య్యను ఒప్పించేప్పటికి తల ప్రాణం తోకకు వచ్చింది."

"గోపీనాధ్‌గారూ!చాలా ఆశ్చర్యంగా ఉంది. నెలకు తలా ఒక పాతిక రూపా యలు పెంచుతారను కున్నాను. గాని ఏకంగా రెట్టింపు చేస్తాడని అనుకో లేదండీ" అన్నది. నళిని మనసులో, ఆమె కొనదలచుకున్న చీరలూ, పిల్లలకు బట్టలూ, సినిమా రీలులాగా తిరిగాయి. పిల్లలకు ఉదయాన్నే పాలు ఇవ్వాలి, వాళ్ళు చిక్కిపోతున్నారు అనుకుంది.

నళిని సంతోషంలో తేలిపోతుంటే, ఆమెకు హఠాత్తుగా ఒక భావం కలిగించి.

"మీరు చాలా జాగ్రత్తగా ఉండాలి. ఎదురుగా ఏ లారీ వచ్చినా మీ మీద పడుతుందేమోనన్న జాగ్రత్తలో ఉం డండి. ఏకాంతంగా ఎక్కడికీ వెళ్ళకండి. రాత్రిళ్ళు పదిమంది మనుషులు ఉండే చోట ఉండండి".

"అలాగే నళినీ! సత్రంలో హాయిగానే ఉంది. రాత్రయ్యేప్పటికి చాలామంది పడుకోడాని కొస్తారు అక్కడికి. జాగ్రత్తగానే ఉంటాను" అన్నాడు గోపీ. ఇంతలో బాలమ్మ వచ్చింది. గోపీ బాలమ్మకు సంగతి వివరించి టీచర్ల అందరి ఇండ్లకూవెళ్ళి విషయం చెప్పి అందర్నీ అర్జెంటుగా నళిని ఇంటికి రమ్మని కబురు పంపాడు. బాలమ్మ వెళ్ళి పోయింది.

ఇంతలో విమల, రవీ, రామూ నిద్ర లేచేరు అందరికీ నళిని సమ్మె ఆగి పోవడాన్ని వివరించింది. పెంచిన జీతాల సంగతి విని విమల ఆనందించింది. పెరి గిన జీతంతో క్యాజువల్ లీవులలో నెలకు రెండుసార్లు హైదరాబాద్ పోయి రావచ్చు అనుకున్నది విమల.

అరగంటలో సరోజ, ఇందుమతి, కనకం, అనుభద్రా—నళిని ఇంటికొచ్చారు.

కనకం "అన్నయ్యా నువ్వు నాకు చేసిన మేలుకు కృతజ్ఞురాలను, వారికి కూడా ఉద్యోగం సంపాదించావు" అన్నది

"బావగారూ మీరు నాకు చేసిన సాయం ఎన్నటికీ మరువలేను" అన్నాడు సుబ్బారావు.

గోపీ హృదయంలో ఆనందం ఉప్పొంగింది.

మరునాడు బడి యధావిధిగా నడిచింది. వీరయ్య గోపీ ఆమోదించిన షరతుల ప్రకారం కాన్వెంటు నిర్విఘ్నంగా నడు స్తున్నది. రెండో కాన్వెంటు, క్రిస్టియన్ కాన్వెంటు మేనేజిమెంటు కూడా వీరికి ఇచ్చినంత జీతం ఇచ్చారు. సుబ్బారావును మరో స్త్రీని కూడా టీచర్స్‌గా అపా యింటు చేశాడు వీరయ్య గోపీ పలుకు బడి, కీర్తి పెరిగింది. రెండు నెలలు గడిచాయి.

హఠాత్తుగా వీరయ్య కూతురు భువన మోహిని చనిపోయినట్లు తెలిసింది. ఆమెను అనుమానించి మొగుడే చంపి

ఉంటాడని ఊళ్ళో పుకార్లు పుట్టాయి.

విమల రాజీనామా చేసి అత్తగారు అడిగిన లాంఛనాలు తీసుకుని హైదరాబాద్ వెళ్ళిపోయింది ఆ తరువాత విమల హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తూ హాయిగా కాపురం చేసుకుంటున్నట్లు తెలిసి నళిని సంతోషించింది.

విమల స్థానంలో మరో క్రొత్త పంతులమ్మను వేశాడు వీరయ్య.



# 28

తన విషయమై నళిని పడే ఆరాటం గోపీకి మధురంగా ఉంది. వీరయ్య తనను ఏమో చేస్తాడని నళిని అనుక్షణం భయపడి పోతున్నది. నళినికి తనంటే ఎంత గౌరవమో, ఆరాధనాభావమో ఇప్పుడిప్పుడే గోపీకి అర్థం అవుతున్నది. నళిని అంటే తనకూ చాలా ఇష్టంగా ఉంది. తను నళినిని ప్రేమిస్తున్నాడా? నళిని తనను ప్రేమిస్తున్నదా? ఏమో? అయినా నళిని ప్రేమిస్తే అది ఎంత వరకూ పోతుంది, వివాహం దాకా వెళుతుందా? తనకు పెండ్లిగాని చెల్లెళ్ళున్నారు తను నళినిని పెండ్లి చేసుకొంటే తన చెల్లెళ్ళకు పెళ్ళికాక పోవచ్చు.

అయినా తను కట్నం ఇచ్చి వారికి పెండ్లి చేయగలడా? అసంభవం. ఈ జీవితంలో ఆ అవకాశం తనకు రాదు. మరి వాళ్ళగతేమిటి? తనకో మంచి ఉద్యోగం రాగానే వాళ్లూ ~~తనూ కలిసి~~ ఉంటారు. వాళ్ళను మెట్రిక్‌కు పంపాలి. ఆ తరువాత ఏదో ఉద్యోగం చూపించాలి! అంతకు మించి తను చేయగలిగింది లేదు.

ఇంతకూ ఈ బ్యాంకి ఉద్యోగం వస్తుందా? పరీక్షలు రాసి ఐదు నెలలు అయింది. ఇంతవరకూ ఇంటర్వ్యూకు పిలువలేదు.

అమ్మా, చెల్లెళ్లూ ఇక్కడికొస్తాం అని గోల పెడుతున్నారు. రకరకాల పనులు చేసుకొని బ్రతికే వాళ్ళు ఇక్కడైనా బ్రతుకలేక పోరు. తనజీతం రెండువందల రూపాయలు అయింది. అమ్మా చెల్లెళ్ళను పిలుచుకొచ్చి ఒక యిల్లు తీసుకుంటే అంతా ఒక చోటే ఉండి హాయిగా బ్రతకొచ్చు! ఏదో ఉన్నదే తింటారు.

ఇలా నిర్ణయించుకొని గోపీ ఆఖరుకు ఒక పెంకుటిల్లును ఎన్నుకున్నాడు. అది ఊరి చివర పొలాల దగ్గర ఉంది. విశాలమైన స్థలమూ తడికల కాపౌండులో ఆ యిల్లు బాగా నచ్చింది గోపీకి. అద్దె నలభై రూపాయలు నెలకు.

ఒకరోజు ఆదివారం సాయంకాలం నళినిని తీసుకొనివచ్చి యింటిని చూపించాడు గోపీ నళిని ఇల్లంతా తిరిగి పరిశీలించింది. ఇల్లు చక్కగా ఉన్నట్లు తోచింది నళినికి.

"నళినీ ఇల్లెలా ఉంది"

"చాలా బాగుంది గోపీనాధ్‌గారూ"

"అమ్మనూ, చెల్లెళ్ళనూ తీసుకుని వస్తాను"

"ఏదో మీరూ సంపాదించుకుంటున్నారు. మీరూ ఒక ఇంటివారైతే మంచిది"

"అందుకే గదా నళినీ! పది రూపా యలు ఎడ్వాన్స్ ఇచ్చి ఒకింటి వాడి నయ్యాను''

''హాస్యం ఆపండి గోపీనాధ్‌గారూ! నా ఉద్దేశ్యం మీరు పెండ్లి చేసుకోవాలని''

"నా చేతిలో పెండ్లిగీత ఉన్నట్లులేదు. పాపం ఒకసారి మీరు ప్రయత్నించి ఓడి పోయారు.''

"అందుకనే గోపీనాధ్‌గారూ ఈసారి నిజంగా ఒక మంచిపిల్లను చూసి మీకు వివాహం చేయాలని నా అభిప్రాయం"

"అబ్బే నేను చేసుకోను. నా ఆశలు ఇంకా ఎత్తులో ఉన్నాయి."

"అంటే?"

"అంటే నెలకు రెండొందలయాభై రూపాయలు సంపాదించే ఒకావిడపైన నా దృష్టి ఉంది."

నళినికి ఒళ్ళు ఝల్లు మన్నవి. రెండు వందలయాభై రూపాయలు సంపాదించే పిల్ల ఎవరు? తనా?

"గోపీనాధ్ గారూ ఎవరండీ? ఆ పిల్ల?"

"నళినీ, నీవే"

నళిని భీతహరిణేక్షణ అయ్యింది. సిగ్గుతో కుంచించుకు పోయింది. గోపీ మీద కోపం వచ్చింది. అతని మాటలకు దేహం సిగ్గు లేకుండా పులకరించి పోతుంటే నళిని మనస్సును శాసించింది. ఈ సిగ్గు మాలిన దేహాన్ని అదుపులో పెట్టమని. అయినా మనస్సు చేతగాక ఊరుకుంటే నళిని కంగారుపడి పోయింది.

నళిని మౌనాన్ని అర్థాంగీకారంగా తీసు కున్నాడు గోపీ. ఆమె కంగారును సిగ్గుగా పరిగణించాడు. ధైర్యంగా నళినిని సమీ పించి ఆమె భుజంపైన చెయ్యివేసి "నళినీ నిన్ను ప్రేమిస్తున్నాను. పెండ్లి చేసుకుంటాను" అన్నాడు.

నళిని తన భుజంపైన పడిన గోపీ చేతిని చివాలున త్రోసివేసిరది. చటు క్కున దూరంగా జరిగి అన్నది

"గోపీనాధ్‌గారూ, అన్యాయం! మీ రలాంటి మాటలు అనగూడదు. చెప్పండి నా ప్రవర్తన వల్ల ఏమైనా మీకు అలాటి తప్పు భావనలు కలిగాయా?"

"అదేంలేదు నళినీ. నీవంటే నాకు ఇష్టం కలిగింది నీతో కలిసి జీవించాలని కోరికగా ఉంది. రవీ, రామూ అంటే గూడా ఆప్యాయత కలిగింది. మనం అంతా ఒక కుటుంబంగా ఎందుకు మెలగ గూడదు? నన్ను అర్థం చేసు కుని గౌరవించగలిగిన స్త్రీవి ఇంత వరకూ నీవే. నళినీ ఏ స్త్రీకైనా సుఖా లను పంచి పెట్టడానికి నా దగ్గర ఏముంది? దరిద్రుణ్ణి బాధ్యతలు కల వాణ్ణి కనుక ఏ స్త్రీ అయినా నాతో బాధ్యతలూ, కష్టాలూ, దరిద్రమూ మాత్రమే పంచుకోవాలి. ముక్కూ ముఖం తెలియని పిల్లను నా పరిస్థితి తెలిసీ ఎలా పెండ్లి చేసుకోను? అదీ గాక నళినీ! నీ ఇద్దరు బిడ్డలూ పెద్దవాళ్లౌ తున్నారు. నీ బిడ్డల బాధ్యతను నేను స్వీకరిస్తాను. అలాగే నా చెల్లెళ్ల బాధ్య తను నీవు స్వీకరించు. వాళ్లను చదివించు నీ శిక్షణలో స్వతంత్రంగా, గౌరవంగా బ్రతికేట్లుగా చెయ్యి"

"గోపీనాధ్‌గారూ మీరు ఊహా లోకంలో విహరిస్తున్నారు. నన్ను వివా హం చేసుకుంటే మీ తల్లీచెల్లెళ్లు నన్ను ద్వేషిస్తారు. ఊహ తెలిసిన నా బిడ్డలు నన్ను అసహ్యించు కుంటారు. లోకం

అంతా మిమ్మల్ని వెలివేసి గేలి చేస్తుంది. అది శాశ్వతంగా ఒక మచ్చ అయిపోయి భవిష్యత్ జీవితాన్ని దుఃఖ మయం చేస్తుంది. గోపీనాధ్‌గారూ మీకు నా అంత వయస్సున్నా మీ మనస్సూ, ఆలోచనలూ పసి బిడ్డవి. పిచ్చి పిచ్చి ఆలోచనలను మానుకొని ఒక చక్కని పిల్లను ఎన్నుకొని సుఖంగా జీవించండి"

నళిని మాటలతో గోపీ దిగాలు పడి పోయాడు. నీరసంగా "నళినీ ఇక నాకు జీవితంలో పెండ్లి గీత లేదు."

"అలా అనకండి గోపీనాధ్‌గారూ! చక్కని పిల్లను నేను ఎన్నిక చేసి మీకు పెండ్లి చేస్తాను."

"నా కొద్దు. ఇలాగే బ్రతకనీ నళినీ నీకు నాపైన గౌరవం ఉందని భ్రమిం చాను. నేనంటే నీకు ఆప్యాయత అని అపోహ పడ్డాను. నా శ్రేయోభిలాషివని సంతోషపడ్డాను."

"గోపీనాధ్‌గారూ! మీరు నన్నింత అపార్థం చేసుకున్నారు. ఈనాడు ఈ సర్వప్రపంచంలో మీకు మించిన గౌరవ నీయులు నాకెవరూ లేరు. మీకు మంచి ఉద్యోగం రావాలనీ, మీ భవిష్యత్తు ఆనందమయంగా ఉండాలనీ, మీ చెల్లె ళ్ళకు వివాహం కావాలనీ అనుక్షణం భగవంతుని ప్రార్థిస్తాను"

"నిజంగా నేనంటే నీకు గౌరవం ఉందా?"

"అపారంగా ఉంది గోపీనాధ్ గారూ!"

"నేనంటే నీకు ఇష్టమేనా ?"

"అలాటి ప్రశ్నలకు సమాధానం లేదు గోపీనాధ్‌గారూ!"

"పోనీలే నళినీ ! నేనంటే నీకు ఇష్టం లేదు! గౌరవం లేదు ! బాధ్యత లేదు! నేను చాలా పొరబడ్డాను నళినీ'"

నళిని కళ్లలో నీరు తిరిగింది. పెద వులు వణికాయి. కంఠం కంపించింది.

"గోపీనాధ్‌గారూ! మీరంటే నాకెంత గౌరవం ఉందో ఎంత... ఎంత... ఎంత 'ఇది' ఉందో మీకు తెలియదు కానీ నిస్వార్థంగా ఒక పురుషుని ఆరా ధించగూడదా ? గౌరవించ గూడదా ? వారి మీద అనురాగం ఉండ గూడదా? దానికి తుచ్ఛమైన శరీర సౌఖ్యం జతచేయక తప్పదా? పెండ్లి అన్న సాంఘిక మర్యాద ఉన్నచోటనే అవన్నీ ఉండాలా? గోపీనాధ్‌గారూ! మీ అపార్థాలతో నన్ను బాధించకండి. మిమ్మల్ని వివాహం చేసుకోను! మోడు వారిన నన్ను ఆశించకండి! గోపీనాధ్ గారూ! నా బిడ్డలు ఇద్దరూ నాకు రెండు కళ్ళు. మీరు నాకు ప్రాణ సమానం! ఎవరైనా నన్ను నిలదీసి కళ్ళు కావాలా? ప్రాణం కావాలా? అని అడిగితే ప్రాణాన్నే కోరుకుంటాను!" అంటూగిరుక్కున తిరిగి చకచకా నడిచి పోయింది నళిని - కళ్ళను పయిట చెర గుతో తుడుచుకుంటూ.

గోపీ నిర్విణ్ణుడై నీరసంగా నట్టింట కూలబడ్డాడు. అతడు కట్టుకున్న గాలి మేడలు కూలిపోయాయి. నళిని అంటే ఎందుకో తెలియని ఆత్మీయత ఏర్ప డ్డది. క్రమంగా ఆమెను వివాహం చేసు కుందామన్న భావం కలిగింది. నళిని ఆమోదిస్తుందనే అనుకున్నాడు.

ఇంతలో నళిని గబగబా ఇంట్లోకి వచ్చింది. గోపీ ముఖం వెయ్యి కాండిల్స్ బల్బ్‌లాగా మెరిసిపోయింది.

"గోపీనాథ్‌గారూ ఈ ఇల్లు బాగా లేదు. ఇందులో చేరకండి. ఆ సత్రం లోనే ఉండండి."

తను ఆశించిన మాటలు నళిని నోటినుండి రాకపోవడంతో గోపీ వెల వెల బోయాడు. చటుక్కున పెంకితనం పుట్టుకొచ్చింది.

"ఏం? ఎందుకని ?"

"ఈ ఇల్లు ఊరి బయట ఉంది. మీరు ఎప్పుడూ ఇంట్లో ఉండరు గదా. దొంగలు పడవచ్చు" వీరయ్య సంగ తిని మర్చిపోతున్నారు.

మరోప్పుడైతే నళిని ఆలోచనలకు విలువ ఇచ్చి మన్నించేవాడు గోపీ. ఇప్పుడు గోపీలో నిరాశ, పెంకితనం చోటు చేసుకున్నాయి. కనుక నళిని ఆలోచనలు గోపీ బుర్ర కెక్కలేదు.

"నేను ఈ ఇంట్లోనే చేరతాను. నాకీ ఇల్లు బాగుంది" అన్నాడు గోపీ పెంకిగా.

"మీరీ ఇంట్లో ఉండడానికి వీల్లేదు"

"ఎందుకని"

"చెప్పానుగా అదంతే"

"నువ్వెవరు నన్ను శాసించడానికి?"

నళిని నివ్వెరపోయింది. అవును తనెవరు?

"అవును ! నళినీ నీవు నాకు ఏమౌతావు? నన్ను శాశించే అధికారం నీకేం ఉంది? నేను ఇక్కడే వుంటాను ఏమైనా సరే"

ఏం చెప్పడానికీ తోచక నళిని కలవరపడింది. కళ్ళు చెమర్చాయి, అయినా మేకపోతు గాంభీర్యంతో

"నేను హెడ్‌మిస్ట్రెస్‌ను. మీపై అధికారిణిని. మీరు ఈ ఇంట్లో చేరగూడదు. ఊళ్ళో పది ఇండ్ల నడుమ ఉన్న ఇల్లునే తీసుకోవాలి. చిన్నదైనా సరే"

గోపీ పక పకా నవ్వాడు. నళిని గాంభీర్యం కరిగిపోయి ముఖాన్ని మళ్ళీ బేలతనం ఆక్రమించింది. గోపీ అన్నాడు నవ్వుతూ— "పెద్ద పంతులమ్మగారూ, ఇది మీ బడి కాదు. నా ఇల్లు, ఇక్కడ నీ పప్పులుడకవు. నేను ఎలాంటి ఇంట్లో కాపురం పెట్టాలో నిర్ణయించే హక్కు నా ప్రియురాలు కుంటుంది. నా కాబోయే భార్యామణి కుంటుంది. నీవెవరు? ఇందులోని దానివా? అయితే చెప్పు. ఆ వినీలాకాశంలో తెల్లగా మెరిసిపోయే మబ్బులమీద కాపురం పెట్టమంటావా? సైం లేదూ, ఆ ఉన్నతమైన పర్వతశిఖరాగ్రాన నివాసం చేద్దామంటావా? అలాగే మేడం! లేదూ, దూరంగా గుబురుగా ఎత్తుగా పెరిగిన మామిడితోటలోవున్న చెట్టు క్రింద తామర పూల దొరువు ఒడ్డున పర్ణశాలను నిర్మించి అందులో ఒక ఉన్నతాసనాన నిన్ను కూర్చోబెట్టి తామరాకుతో విసరమను. 'జీహుకుం' అని సేవ చేస్తాడీ సేవకుడు" అన్నాడు గోపీ యాక్షన్ చేస్తూ.

నళినికి మళ్ళీ మొదటి పరిస్థితి ఏర్పడింది. ఆమె మనస్సు కూడా దేహంతో ఏకమై ఆమెలో గొడవను రేపుతున్నది పులకరింతలను పుట్టిస్తున్నది. అయినా, నళిని మనస్సు, దేహాన్ని శాసిస్తూ, అరిచింది, తనలోనే.

"చెప్పు ! నళినీ ! ఏమంటావు ?"

నళిని చటుక్కున ఒంగి గోపీ పాదాలను పట్టుకుంది. అశ్రువులను గోపీ పాదాలపైన వర్షిస్తూ అన్నది "గోపీనాథ్ గారూ ! నన్నీ విషమ పరీక్షకు గురిచేయ

కండి! మీకేమైనా అయితే, నా హృదయం బ్రద్దలౌతుంది! ఈ ఇంట్లో చేరకండి! ప్లీజ్! ఈ జన్మకు నేను పెండ్లి చేసుకోను! మీ మీద నాకున్న అనురాగం, గౌరవం, ప్రే...ప్రే...మ...ను తగ్గించుకోను. నా మాటను మన్నించండి!" అంటూ లేచి వెళ్ళిపోయింది నళిని.



## 29

సుబ్బారావు కూడా కాన్వెంటులో చేరాక గోపీ అయిదో క్లాసు తీసుకున్నాడు. పదకొండింటికల్లా బడి వదిలేశారు. నళిని రూంలో టీచర్లు కూర్చొని ఉన్నారు. నళిని గోపీవంక చూడడంలేదు. గోపీ మౌనంగా నళినిని చూస్తున్నాడు.

పిల్లలంతా వెళ్ళిపోయారు. టీచర్లు భోజనానికి వెళ్ళిపోబోతున్నారు. ఇంతలో పోస్టమన్ నళిని రూంలోకొచ్చి "గోపీనాథ్!" అన్నాడు.

గోపీ ఆత్రంగా లేచి పోస్టమన్ దగ్గర నుండి కవర్ అందుకొని, విప్పి చదివి "బ్యాంక్ ఇంటర్వ్యూ, నవంబర్ 20న!" అన్నాడు

"టీ పార్టీ ఇవ్వాలి గోపీనాథ్‌గారూ!" అన్నాడు సుబ్బారావు.

"నో నో! సినిమా!" అంది సరోజ.

"అదేం కాదర్రా! డిన్నర్!" అంది ఇందుమతి.

నళిని అందర్నీ వారించి అన్నది "ఇప్పుడేం డిన్నరు? అపాయింట్‌మెంటు ఆర్డరు వచ్చాక డిన్నర్! సాయంకాలం లైట్‌గా తలా ఒక టీ ఇవ్వండి గోపీనాథ్‌గారూ!"

అంతా ఒప్పుకున్నట్లు మౌనంగా ఉన్నారు.

సాయంకాలం గోపీ టీ తెప్పించి ఇచ్చాడు. ఆ సాయంత్రమే సామానులు తీసుకొచ్చి క్రొత్త ఇంట్లో చేరాడు. ఇంటర్వ్యూ కాగితం చూసుకోగానే గోపీ చాలా మారిపోయాడు. నళినిని పెండ్లికి ఒప్పించడం అసంభవంగా తోచింది. దానికి తగ్గట్టుగా లోకం విమర్శిస్తుంది అన్న భావం పెద్దది అయిపోయింది. అయినా గోపీకి ఎక్కడో సన్నగా బాధలాంటిది మొదలైంది. నళిని వ్యక్తిత్వం, ఆమెకు తనయందుగల గౌరవం, ప్రేమా, అభిమానం అన్నీ స్ఫురణకొచ్చాయి.

ఇంటర్వ్యూ కాగితం చూసిన మరుక్షణం గోపీకి ఈ ఊరంటే అసహ్యం పెరిగింది. బడిఅన్నా, కాన్వెంటు అన్నా ఏదో కలలాగా త్వరలో మాయం అయ్యే భ్రమలాగా అనిపించింది. ఒక్కసారి తను ఈ ఊరొచ్చింది మొదలు నేటిదాకా జరిగిన అనుభవాలను జ్ఞప్తికి తెచ్చుకున్నాడు.

విమల పూర్‌గర్ల్. ఆవేశపరురాలు! తొందరపాటు మనిషి! కాకుంటే తనకు విమలతో వివాహం అయ్యేదే!

భువనమోహినిని భర్త హత్యచేశాడని పుకారు! అందరూ భువనమోహినిని హీనంగా మాట్లాడుతారు వివాహం అయినా గూడా ఇంకా ఆమె తిరుగుళ్లు

చతుర

మాసలేదా ? లేక భువనమోహిని భర్త ఆమె లారీలను కాజేయాలని ఆమెను హత్యచేశాడా ? ఏమో !

అటు లారీ బిజినెస్ ఇటు సినిమా హాలు వీరయ్యకు లేకుండా పోయాయి. రోగిష్టి భార్య, కాన్వెంటు మటుకు ఉన్నాయి. ఈ షాక్స్‌తో వీరయ్య తనను ఏం చేయగలడు ? బహుశః వీరయ్య మర్చిపోయి ఉండవచ్చు. అన్నట్లు తన సర్టిఫికేట్లు వీరయ్యదగ్గర ఉన్నాయి. అవి తీసుకొని ఇంటర్వ్యూ కెళ్తాడు. ఉద్యోగం నళిని చెప్పినట్లు వచ్చి తీరాలి. ఉద్యోగం వచ్చాక ఎక్కడ వేస్తారో ? ఎక్కడైనా పోక తప్పదుగదా ! పోవాల్సిందే ! ఇక నైనా చెల్లెండ్లను మెట్రిక్‌కు పంపాలి ! వాళ్ళకు ఏదో ఒక ఉద్యోగం చూపించి తన బాధ్యతలను తీర్చుకోవాలి. మరి నళిని ? ప్చ్ ! మర్చిపోక తప్పదు.

ఇలా ఆలోచించుకుంటూ క్రొత్త ఇంట్లో గోపీ ప్రొద్దుపోయేదాకా మేలు కొని ఆ తర్వాత నిద్రపోయాడు.

మరుసటి రోజు ఉదయం ఏడింటికల్లా గోపీ వీరయ్య ఇంటికెళ్ళాడు. వీరయ్య గోపీని గౌరవంగా —కుర్చీలో కూర్చో, మన్నాడు.

గోపీ కుర్చీలో కూర్చున్నాడు.

"బ్యాంకి ఉద్యోగానికి ఇంటర్వ్యూ వచ్చిందటగా"

"అవునండీ ! ఇంటర్వ్యూ ఇరవయ్యో తారీఖున"

"అంటే ఇంక మూడురోజులే ఉంది"

"అవునండీ"

"మరెప్పుడు బయలు దేరుతావు"

"ఎల్లుండి రాత్రికి బయలు దేరుదా మనండీ"

"అలాగా మరి ఉద్యోగం వస్తుం దంటావా"

"తప్పకుండా వచ్చితీరాలండీ. పరీక్షలు చాలా బాగా రాశాను. ఇంటర్వ్యూకు గూడా బాగా ప్రిపేర్ అయ్యాను"

"మంచిది గోపీ. అయినా రికమెండే షన్లు లేకుంటే ఉద్యోగాలు రావు. ఒక పని చెయ్. హైద్రాబాద్‌లో నా మిత్రుడు ఒక రాజకీయవేత్త ఉన్నాడు. అతడికో జాబు రాసి ఇస్తాను. అది పట్టికెళ్ళి అతడి కివ్వు. మనపని అంటే అతడు కాలికి బలపం కట్టుకొని అయ్యేలాగా చూస్తాడు"

గోపీ వీరయ్య మాటలకు చిత్తై పోయాడు.

"అలాగే ఇప్పించండి"

వీరయ్య ఇంట్లోనుండి వచ్చి ఒక మడత పెట్టిన కాగితాన్ని తెచ్చి గోపీ చేతికిచ్చాడు.

గోపీ కృతజ్ఞతగా "చాలా థ్యాంక్సు అండీ" అన్నాడు.

"చూడు గోపీ! హైద్రాబాద్ ప్రయా ణం పెట్టుకున్నావు. ఛార్జీలకుడబ్బుందా"

"ఉందండీ"

"అయినా ఖర్చులు ఎక్కువ ఉంటాయి. ఈ వంద రూపాయలు ఎడ్వాన్సు తీసుకో" అంటూ వీరయ్య జేబులోనుంచి ఒక వంద రూపాయల కాగితం తీసి గోపీ కిచ్చాడు. గోపీ ఆ నోటును వినయంగా పుచ్చుకున్నాడు.

"మరి నా సర్టిఫికేట్లు మీ దగ్గర ఉన్నాయి. అవి ఇప్పించండి, రేపు ఇంటర్వ్యూలో చూపాలి గదా"

"ఓ! సర్టిఫికేట్లు గదూ? గోపీ మా

రూల్సు నీకు తెలుసు గదా! రాజీనామా ఇచ్చిన వారికే సర్టిఫికేట్లు ఇస్తాం"

గోపీ నిరుత్తరుడయ్యాడు. నిజమే మొదట్లోనే అన్నాడు వీరయ్య. అప్పుడు తను పట్టించుకోలేదు. ఎంత సంకట పరిస్థితి వచ్చింది? రాజీనామా చేస్తే గాని వీరయ్య సర్టిఫికేట్లు ఇవ్వడు. రాజీనామా ఇస్తే తీరా బ్యాంకి ఉద్యోగం రాకుంటే...

గోపీ ఇలా ఆలోచించుకుంటుండే వీరయ్య లేచి "గోపీ తొందర ఏమీలేదు, నిదానంగా ఆలోచించుకొని రేపురా. రాజీనామా పత్రం ఇచ్చి సర్టిఫికేట్లు పట్టుకెళ్ళు" అంటూ ఇంట్లో కెళ్ళిపోయాడు వీరయ్య.

గోపీ నీరసంగా లేచి ఇంటి ముఖం పట్టాడు.

ఆ రోజు రాత్రి అంతా ఆలోచనలతో బుర్ర బద్దలు కొట్టుకున్నాడు గోపీ. జిత్తుల వీరయ్య నిజంగానే జిత్తుల మారి వాడే. సమయంచూసి తనను ఇరకాటంలో పెట్టాడు. వంద రూపాయల ఎడ్వాన్సు, రికమెండేషన్ లెటరూ ఇచ్చినట్లే ఇచ్చి సర్టిఫికేట్లు ఇవ్వకుండా ఎత్తువేశాడు. సర్టిఫికేట్లు ఇస్తే వాడి సొమ్మేం పోయింది. రాజీనామా ఇవ్వందే సర్టిఫికేట్లు ఇవ్వగూడదని వీళ్ల రూల్సు అట. తను కొన్ని రూల్సు పెట్టి వీరయ్య చేత ఆమోదింప చేశాడు. ఇప్పుడు ఆ రూల్సును అమలు పరచక నా సర్టిఫికేట్లు ఇచ్చెయ్ రాజీనామా మాత్రం చేయనని వీలా అనాలి.

లేక రాజీనామా పారేస్తే సర్టిఫికేట్లు వస్తాయి. వాటితో బ్యాంకి ఉద్యోగం సంపాదించుకోవచ్చు. కానీ చేతిలో ఉన్న దాన్ని వదులుకొని రాని ఉద్యోగం వెంట పడడం సబబా?

తను ఈ ఉద్యోగంలోనే ఉంటే చెల్లెళ్లను మెట్రిక్ చదివించాలన్న తన ఆశలు అడియాసలవుతాయి. బ్యాంకి ఉద్యోగం రాక, ఈ ఉద్యోగం పోతే తన గతి ఏమిటి? ఇక ఉద్యోగం ఎవడిస్తాడు? గండయ్య తనకు వాడి కాన్వెంటులో ఉద్యోగం ఇవ్వడు.

హైదరాబాద్‌లో తన అదృష్టం పరిశీలించుకొని చూసుకోవలసిందే. ఈ ఆఖరి ఛాన్సును పోగొట్టుకుంటే ఇలా పోగొట్టుకున్నందుకు జీవితాంతం ఏడవవలసి రావచ్చు.

ఇలా నిర్ణయించుకొని అప్పటికప్పుడే ఒక రాజీనామా పత్రాన్ని వ్రాసి గోపీ నిద్రపోయాడు.

తెల్లవారగానే గోపీ రాజీనామా పత్రాన్ని వీరయ్య ఇంటికి తీసుకెళ్లాడు. వీరయ్యగారి పంచలో ఉన్న కుర్చీలో కూర్చుని గోపీ నౌఖరు ద్వారా ఇంట్లో ఉన్న వీరయ్యకు కబురు పంపాడు. ఒక పావుగంట అయ్యాక వీరయ్య వాకిట్లో కొచ్చాడు.

వీరయ్య రాగానే కాగితాన్ని వీరయ్య చేతిలో పెట్టాడు గోపీ.

"ఏమిటిది?"

"రాజీనామా పత్రం!"

"ఆఖరుకు రాజీనామా చెయ్యాలనే నిశ్చయించుకున్నావన్నమాట."

"ఏంచేయను చెప్పండి! ఈ ఉద్యోగం వస్తుందన్న ఆశ కలుగుతున్నది!"

"ఒకవేళ రాకుంటే?"

"రాక ఎక్కడికి కెళ్తుంది? మీరు రికమెండేషన్ ఉత్తరం గూడా ఇచ్చారు గదా?"

"అవునవును !"

"మరి...నా సర్టిఫికేట్లు ?..."

"ఓ ! సర్టిఫికేట్లు గదూ ? అవి సోమయ్యదగ్గరున్నాయి. సోమయ్య ఇంటికెళ్లి నే నివ్వమన్నానని చెప్పి తెచ్చుకో !" అన్నాడు వీరయ్య గోపీ రాజీనామా పత్రాన్ని జేబులో పెట్టుకొంటూ.

గోపీ గిరుక్కున తిరిగి సోమయ్య ఇంటికెళ్లాడు. సోమయ్య ఇంట్లో లేడు. ఇంట్లో విచారిస్తే క్రితం రాత్రి పది గంటలకు మద్రాసు వెళ్ళినట్లు తెలిసింది. గోపీ గుండెల్లో రాయిపడింది. సోమయ్య మద్రాసునుండి ఎప్పుడొస్తాడో తెలీదు. క్రితం రాత్రి మద్రాసు వెళ్ళివుంటే ఈ రోజు ఉదయం మద్రాసులో ఉంటాడు. ఈ రోజు పనిచూసుకొని రాత్రికి బయలుదేరితే రేపు వస్తాడు. తను ఎల్లుండి రాత్రికి బయలుదేరవలసి ఉంది హైద్రాబాదు. అలా ఐతే ఒకరోజు ముందుగా హైద్రాబాదు చేరగలడు—అనుకున్నాడు గోపీ.

గోపీ ప్రతిక్షణం ఆందోళనగా గడిపాడు. గంటగంటకూ సోమయ్య ఇంటికి వెళ్ళి విచారించాడు సోమయ్య వచ్చాడేమోనని. కానీ సోమయ్య రాలేదు. సోమయ్య ఎప్పుడొస్తాడని సోమయ్య ఇంట్లోవాళ్ళని ప్రశ్నిస్తే తమకు తెలీదన్నారు.

ఇక రేపు ఇంటర్వ్యూ అనగా ఆరోజు సాయంకాలందాకా ఎదురుచూశాడు గోపీ సోమయ్యకోసం. కాని సోమయ్య జాడ కనబడలేదు వెంటనే వీరయ్య ఇంటికి వెళ్లాడు. వీరయ్య అప్పుడే ఇంటికొచ్చాడు. గోపీ ఆందోళనగా వీరయ్యకు సంగతి చెప్పాడు. వీరయ్య నిర్లిప్తంగా ఉన్నాడు.

"వీరయ్యగారూ ! ఒక చిన్న విషయం. మీరు సోమయ్యగారింటికి కబురు చేయండి ! నా సర్టిఫికెట్లు కాస్త వెతికివ్వమనండి."

"ఇది చాలా బాగుంది ! సోమయ్య భార్యకు ఇంగ్లీషు రాదు ! ఆమె ఎలా కనుక్కొంటుంది నీ సర్టిఫికేట్లను ?"

"నేను సాయం చేస్తాను !"

"గోపీ ! నీ హడావిడికి అర్థంలేదు ! సోమయ్య ప్రైవేటు పనిచేసే వ్యక్తి. అనేక రహస్యమైన పత్రాలుంటాయి. అలా నిన్ను చూడనీయడం భావ్యం గాదు."

"మరి సర్టిఫికెట్లు లేకుంటే ఎలా ?"

"నన్నేం చెయ్యమంటావయ్యా ?"

ఇక వీరయ్యతో మాట్లాడి లాభం లేదని సోమయ్య ఇంటికి వెళ్ళాడు గోపీ. సోమయ్య ఇంకా రాలేదని తెలిసింది. సోమయ్య భార్యను ప్రాధేయపడ్డాడు గోపీ సర్టిఫికేట్లు ఇవ్వమని. కాని నాకు తెలీదు అంది సోమయ్య భార్య.

రాత్రి పదిన్నర గంటలైంది. హైద్రాబాద్ వెళ్ళే ఎక్స్‌ప్రెస్ ఇంక పావుగంటకు ఉంది. ఇది తప్పితే, రేపు ఉదయం పదిన్నర గంటలకు ఇంటర్వ్యూకు వెళ్ళగలగడం అసంభవం.

గోపీకి మెరుపులాగా ఓ ఆలోచన వచ్చింది. తను హైదరాబాదు వెళ్ళి ఇంటర్వ్యూచేసే అధికారులను కలుసుకొని, సర్టిఫికేట్లు తరువాత చూపిస్తాను, ముందు ఇంటర్వ్యూ చేయమని అడిగితే? బ్రహ్మాండమైన ఆలోచన అని అనిపించింది గోపీకి.

వచుచు

వెంటనే సంచీలో లుంగీ, తుండు గుడ్డా వేసుకొని స్టేషన్‌కు బయలు దేరాడు. ఎక్స్‌ప్రెస్ ఎక్కి మరునాడు ఉదయం తొమ్మిదిగంటలకల్లా హైదరాబాద్ చేరాడు. పదిన్నరకల్లా బ్యాంకు కెళ్లాడు.

గోపీ భయపడుతూ కాండిడేట్ల వరుసలో కూర్చున్నాడు. క్రమంగా కాండిడేట్సను పిలుస్తున్నారు. లావుపాటి ఫైళ్ళు పుచ్చుకొని కొందరు యువకులూ, యువతులూ ఆఫీస్‌లో కెళ్ళి పది నిమిషాలనుండి ఇరవై నిమిషాలదాకా లోపల ఉండి వెలుపలికి వస్తున్నారు. గోపీ తన పేరు పిలువగానే వెళ్లి ఆఫీసర్లకు తన పరిస్థితిని తెలుపుకొని 'సర్టిఫికేట్లను తరువాత చూపుతాను. ముందు ఇంటర్వ్యూ చేయండి' అని చెప్పాలనుకున్నాడు. కానీ వాళ్లు ఒప్పుకుంటారా ? అన్న సందేహం మనస్సులో పీకుతున్నది గోపీకి.

"అఖరుకు గోపీనాథ్ !'' అని ఒక బంట్రోతు కేకవేశాడు. గోపీ ఉలిక్కిపడి, ఆఫీసులో కెళ్ళాడు. ఆ ఆఫీసు చిన్నగది. ఒక టేబిల్ వెనుకగా ఒక యువతి, ఒక యువకుడు కూర్చొని ఉన్నారు

"మీ సర్టిఫికేట్లు ఏవి ?" అడిగింది యువతి.

"మరండీ కొన్ని అనివార్యపరిస్థితుల వల్ల సర్టిఫికెట్లను తేలేదు. ముందు ఇంటర్వ్యూ చేయించండి. ఆ తరువాత సర్టిఫికెట్లను తెచ్చి చూపుతాను" అన్నాడు గోపీ.

గోపీ గ్రహించాడు. ఆ యువతీ యువకు లిద్దరూ క్లర్క్సు అని. అందే వీరు సర్టిఫికెట్లను సరిచూసి పంపితే అవతల గదిలో ఇంటర్వ్యూ జరుగుతుందన్నమాట.

గోపీ మాటలతో ఆ యువతీ, యువకులు ఒకర్నొకరు చూసుకొని గోపీవంక అనుమానంగా చూచారు

"నన్ను నమ్మండి. ఇంటర్వ్యూ అయ్యాక, ఒక వారం రోజులలో సర్టిఫికేట్లు, తెచ్చి చూపుతాను."

మగ క్లర్క్ విసుగ్గా అన్నాడు. "చూడు మిస్టర్ ! అలాంటి వాటికి అస్కారం నీవు ఇంతకుముందు పంపుకున్న ట్రూ కాపీలకు, ఒరిజినల్స్ ముందు ఇక్కడ చూపాలి! లేకుంటే దయచేసి వెళ్ళిపోండి."

"ప్లీజ్! దయ ఉంచండి, ముందు ఇంటర్వ్యూకెళ్ళ నివ్వండి. ఖచ్చితంగా వారం రోజులలోపల సర్టిఫికేట్లను చూపుతాను."

"చెబుతుంటే, నీకు కాదయ్యా, అలాటి అప్పబేరాలు ఇక్కడ లేవు !" అన్నాడా యువకుడు.

"ప్లీజ్!......"

"ఇబ్రహీం! ఈయన్ను బయటకు పంపు" అన్నాడు క్లర్క్.

నైజాం నవాబులాటి వేషంలో ఒక బంట్రోతు గోపీ వంక వస్తూ "పద బయటకు" అన్నాడు ఉర్దూలో.

గోపీ విషాదంగా వెలుపలకు బయలు దేరాడు. వాకిట్లోకి వచ్చి బావురుమని ఏడ్చేశాడు. ఆఫీసుకువచ్చేవారూ, పోయేవారూ గోపీని చిత్రంగా చూశారు.

గోపీ కన్నీళ్ళలోనుండి బజార్లో వెళ్లే డబుల్ డెక్కర్ బస్సులను చూశాడు. అవి మసక, మసకగా ఆకాశంలోకి నాట్యంచేస్తూ తేలిపోతున్నట్లు కనిపిం

చాయి. ఒక్కసారి వెళ్ళి వాటి కింద పడితే? క్షణంలో ఈ ప్రాణం పోతుంది! ఈ దరిద్రపు జీవితం క్షణంలో అంతం అయిపోతుంది! కానీ, తనపైన కొండంత ఆశలు పెట్టుకున్న చెల్లెళ్ళ గతేమిటి? ముసలి తల్లి గతేమిటి?

విషాద యోగంలో పడిపోయి, హైదరాబాద్ నుండి బయలుదేరాడు గోపీ.

మరునాడు ఏడింటికల్లా కాన్వెంటు ముందు ఉన్నాడు గోపీ! నళిని పలకరించింది

"గోపీనాథ్‌గారూ! సోమయ్య మీ సర్టిఫికేట్లను ఇవ్వనేలేదటగా!"

"అవునండీ! ఇవ్వలేదు"

"నిన్నరాత్రి సోమయ్య ఇంటికొచ్చాడు మద్రాస్ నుండీ."

గోపీకి సోమయ్య ఊరి నుండి వచ్చాడన్న వార్త ఏమీ ఉత్సాహం ఇవ్వలేదు.

"గోపీనాథ్ గారూ, ఇదంతా మీకు ఉద్యోగం రాకుండా చేయాలన్న ప్లాన్ లాగా అనిపిస్తున్నది. మీకు ఇంటర్వ్యూ, వచ్చిందని తెలిసిన రోజున, సాయంకాలం మనం ఇక్కడ పార్టీలో వుండగా, సోమయ్య ఊరికెళ్ళాడు! మళ్ళీ మీ ఇంటర్వ్యూ అయిపోగానే వచ్చాడు."

"వీరయ్యకు నన్ను వుంచుకోవాలన్న తపనయేగానీ, వదిలించుకోవాలన్న ఇంటరెస్టులేదు."

"గోపీనాథ్‌గారూ, వీరయ్య జిత్తులు మీకు తెలియవు"

"ఇక తెలిసీ, చేయగలిగింది ఏమీ లేదు"

"మరందు ఏమి చెయ్యాదల్చుకున్నారు?"

"ఏ రైలు కిందనైనాపడి చద్దామనుకుంటున్నాను" అంటూ గోపీ తన క్లాస్‌కు వెళ్ళిపోయాడు. టీచర్లంతా పలుకరించారు గోపీని. అందరితో ముభావంగా ఉన్నాడు గోపీ.

మధ్యాహ్నం బడి జరుగుతుండగా, సోమయ్య బడికొచ్చి గోపీని పిలిపించాడు. గోపీ నళిని రూంకొచ్చాడు. రూంలో నళిని లేదు. క్లాసుకు వెళ్ళింది.

"ఇవిగో నీ సర్టిఫికేట్లు" ఒక పెద్ద ఫైలును గోపీ కందించాడు సోమయ్య.

గోపీ నీరసంగా ఫైలును అందుకున్నాడు. ఇప్పుడా ఫైలు పరమ అసహ్యంగా మోయలేని భారంగా కనిపిస్తున్నది

"గోపీ ఈ కవర్ తీసుకో" అంటూ సోమయ్య గోపీకి ఒక కవర్ ఇచ్చాడు.

గోపీ అనాసక్తంగా, ఆకవర్ను తీసి చూసుకున్నాడు. అందులో కొంత డబ్బు, ఒక కాగితమూ ఉన్నాయి. ఆ కాగితాన్ని తీసి చదివి, చివాలున గోపీ కుర్చీలో నుండి లేచి సోమయ్యను చూస్తూ అన్నాడు.

"ఏమిటిది?"

"నిన్ను రిలీవ్ చేస్తున్నాను! నీవే ఉద్యోగానికి రాజీనామా ఇచ్చావు. దాన్ని వీరయ్యగారు ఆమోదించారు"

"అన్యాయం నా సర్టిఫికేట్లను అడిగినప్పుడు ఇవ్వక అవి కావాలంటే రాజీనామా ఇవ్వాలని మెడలు వంచి ఇప్పుడు నన్నిలా చేస్తారా?"

"ఏం చేయాలి? నిన్ను తీసి వేయవద్దని నేను వీరయ్యతో మొర పెట్టుకున్నాను. కానీ, ఆయన వినలేదు."

"ఉండండి. వీరయ్యగారి దగ్గరికి వెళ్తాను"

"గోపీ ఆ అవసరం లేదు. ఇక. ఆ వీరయ్య గారి ఇంట్లో కాలు మోపడానికి నీకు వీలులేదు. నీవు ఇంటి గేటు దాటితే మెడపట్టి గెంటమని వీరయ్య నౌకర్లకు గట్టిగా చెప్పాడు"

గోపీ నీరసంగా కుర్చీలో కూర్చున్నాడు. నళిని మాటలు జ్ఞాపకం వచ్చాయి. గోపీకి మెల్లగా అర్థం అవుతున్నది. తనకు సర్టిఫికేట్లు సకాలంలో అందకపోవడం వాటి పేరుతో రాజీనామా పత్రం పుచ్చుకోవడం తనకు ఉద్యోగం రాకుండా చూసి ఇప్పుడు పాత రాజీనామా పత్రం ఆమోదించి తన ఉద్యోగం తీసివేయడం గోపీకి అర్థం అవుతున్నది.

"గోపీ ఇక బయలుదేరు కొన్ని ముఖ్యమైన పనులు చూసుకోవాలి"

గోపీ మెల్లగా లేచి నీరసంగా వాకిట్లోకి నడిచివెళ్ళాడు.

టీచర్లు అంతా వెళ్ళిపోయే గోపీని అనుమానంగా చూశారు.

గోపీ నేరుగా ఇంటికి వెళ్ళిపోయాడు. తలుపు తాళం తీసి, ఈతాకుల చాపమీద పడుకున్నాడు. మస్తిష్కం అనేకమైన ఆలోచనలతో ఘూర్ణిల్లి పోతున్నది ఏ మూలనుండీ ఆశాకిరణం కనుపించక గోపీ అంతరంగమంతా చిక్కని చీకటి నిండిపోయింది. చిత్రంగా గోపీకి ఉన్న మమతానుబంధాలుగూడా ఒక్కొటి పుటుక్కున తెగిపోతున్నాయి

అయిపోయింది. అంతా అయిపోయింది. ఇక తన బ్రతుకు వ్యర్థం, చెల్లెళ్ళకూ అమ్మకూ తనవల్ల ప్రయోజనం శూన్యం. ఈ కఠోర ప్రపంచంలో వాళ్ళకు తోచినట్లు వాళ్ళు బ్రతుకవలసిందే, తను బ్రతికి ఉండీ, వారికి చేయగల సాయం ఏమీలేదు. పైగా వాళ్ళ కష్టార్జితం మీద బ్రతకాల్సిందే. ఇక బ్రతకడం అనవసరం. తను చచ్చిపో వాల్సిందే. ఈనాడే ఈ రాత్రికే రైలు కిందబడితే... ఇక... ఎలాటి బాధలూ ఉండవు ... శరవేగంతో చీకటిని చీల్చుకొనివచ్చే రైలూ, పట్టాలమీద పడుకున్న తనూ కంటిముందు మెదుల్తున్నారు. చచ్చిపోదామనుకుంటే వెనుకటి భయం ఉండడం లేదు పైగా ఉత్సాహంగా ఉంది.

ఇలా ఆలోచించుకుంటుంటే నళిని ఇంట్లోకి వచ్చి గోపీ ఎదురుగా నిలబడింది. అయినా నళిని రాకను గమనించక ఎక్కడో శూన్యంలోకి చూస్తున్నాడు. నళిని గాభరాగా గోపీని చూస్తూ చేతిని పట్టుకొని ఊపింది. ఆ ఊపుకు గోపీ చూపులలో చలనం కన్పించింది.

గోపీ ఎదురుగా ఉన్న వ్యక్తి నళిని అని గ్రహించేడు. నళిని తన ఆలోచనా ప్రవాహాన్ని అరికట్టడం గోపీకి విసుగును పుట్టించింది.

"నళినిగారూ దయచేసి వెళ్ళిపోండి. ప్లీజ్"

నళిని నివ్వెర పోయింది. చప్పున గోపి చేతిమీది చేతిని వెనక్కులాక్కుంది

ఎవరీ వ్యక్తి? తనకు తెలిసిన గోపీనాథ్ ఏమైపోయాడు? గోపీనాథ్ తననూ, ఈ లోకాన్నీ వదిలి ఎక్కడికో అతి వేగంగా వెళ్ళిపోతున్నట్లు గ్రహించి నళిని తల్లడిల్లిపోయింది.

"ఈ ఉద్యోగం పోయినంతమాత్రాన

మీకు ఏమీఅవలేదు, మీరు విద్యావంతులు, యువకులు, తెలివితేటలు గలవారు..."

గోపీ తన మాటలు వినడంలేదని గ్రహించి నళిని గోపీని మరోసారు కుదిపింది. గోపీలో చలనంలేదు.

నళిని గోపీకి దగ్గరగా జరిగింది. గోపీ కన్నీటిని తుడిచింది.

గోపీ ముఖాన్ని రెండు చేతులలోకి తీసుకుంది. గోపీ ముఖంలోకి చూస్తూ "గోపీ" అన్నది.

గోపీ నళినిని గమనించలేదు. నళిని స్పర్శకు గోపీలో ఏ అనుభూతీ వ్యక్తం కాలేదు.

ఒకచేత గోపీ ముఖాన్ని తడుముతూ మరోచేత గోపీ భుజాన్ని తడుతున్నది.

"గోపీ! ఆత్మహత్య చేసుకుందా మను కుంటున్నావా? సన్యాసం చెయ్యదల్చు కున్నావు? కట్టెలాగా ఎండిపోయిన నా హృదయాన్ని ప్రేమప్రవాహంలో ముంచి, ఆ ఎండు కట్టె చిగురిస్తుండే నిర్దయగా ఆ కట్టెను త్రోసి వెళ్ళి పోతావా?"

"నళినీ" అంటూ గోపీ నళిని కండ్ల లోకి చూశాడు అట్లాగే తలను నళిని ఒడిలో ఉంచి.

"అవును గోపి నీ మీద నాకు ప్రేమ కలిగింది. అయినా మన ప్రేమను సంఘం ఆమోదించదు. అందుకనే నీకు దూరంగా ఉండి నిన్ను చూస్తూ ఆరాధిస్తూ తరించిపోవాలను కున్నాను. గోపీ నువ్వు వెళ్ళిపోతే నా హృదయం బ్రద్దలౌతుంది. ఈ రెండవస్సారి కలిగే వియోగం నేను వద్దనుకున్నా నన్ను చంపకమానదు. నా పిల్లలు దిక్కులేని వారౌతారు గోపీ"

"మరెలా బ్రతకను నళినీ"

"ఏం ఫరవాలేదు గోపీ! నీకేం తక్కువ, ఎవ్వరూ తీసి పారేయలేని విద్య నీ దగ్గరఉంది నీవే ఒక కాన్వెంటును పెట్టు"

నళిని మాటలతో గోపీ చివాలున లేచాడు

గోపీ ముఖంలో హఠాత్తుగా ఉత్సాహం ప్రవేశించింది.

గోపీ ఉత్సాహం చూసిన నళిని కళ్ళల్లో మెరుపులూ, మస్తిష్కంలో ఆలోచనలూ ప్రారంభ మయ్యాయి. నళిని ఉత్సాహంగా చెప్పు కొనిపోతున్నది.

"అవును గోపీ! నువ్వే ఎందుకు కాన్వెంటు పెట్టగూడదూ? ఈ ఇల్లు విశాలంగా ఉంది. నీకేం భయంలేదు, రేపటినుండే కాన్వెంటు ప్రారంభం అవు తుంది. ఈ రాత్రికి ఊరంతా తిరిగి నీకు ఇరవైమంది విద్యార్థులను సేక రిస్తాను. ఏమంటావు?"

నళిని ఒక్కొక్కమాటకూ గోపీలో ఉద్వేగం పెరుగ సాగింది ఆఖరుకు తప్పున ఆరిపోయింది ఉత్సాహం.

"ఎలా నళినీ? బల్లలులేవు, కుర్చీలు లేవు, కాన్వెంటు సరంజామా లేదు. నా కాన్వెంటుకు ఎవరైనా ఎలా వస్తారు?"

నళిని చివాలున తన చేతికి ఉన్న రెండు బంగారు గాజులను తీసి గోపీ చేతిలో పెట్టింది.

"గోపీ ఇవిగో గాజులు. మూడు నవర్సులున్నాయి. వెయ్యిరూపాయలకు పైన డబ్బొస్తుంది. దానితో కావలసిన సామగ్రి కొను. రేపట్నుండీ కాన్వెంటు ప్రారంభం అవుతుంది. దేవుడు మేలు చేస్తే ఈ ఊరి మొత్తానికే ప్రముఖ

పతుర

మైన కాన్వెంటు కావచ్చు."

"నళినీ,...నీవు ...దేవత వు..."

"అయితే మీ పిచ్చి ఆలోచనలను మానుకున్నట్లేనా?"

"నీకు నమ్మకం కలిగేలా చెప్పనా?"

"చెప్పు గోపీ" అన్నది నళిని ఆశగా.

గోపీ చటుక్కున నళినిని కౌగిట చేర్చుకొని ఆమె బుగ్గపైన గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు.

నళిని లోని అణువణువూ పులకరించి పోయింది.



## 30

గోపీకి వెయ్యి ఏనుగుల బలంకలిగింది.

ఉత్సాహం ఉరకలువేస్తుంటే గోపీ మరునాడు ఉదయం పదింటికల్లా వాకిట్లో కొచ్చాడు.

షరాబు ఇంటికెళ్లాడు. గాజులు అమ్మి పైకం జేబులో వేసుకున్నాడు. అక్కడి నుండి తనకు తెలిసిన ఒక ప్రెస్ యజమాని ఇంటికి వెళ్ళి, కరపత్రాలను ముద్రించాలని చెప్పాడు.

గోపీ ఒక ఫర్నిచర్ షాప్‌లో ప్రవేశించాడు.

అక్కడ తయారుగా ఉన్న నాలుగు కుర్చీలనూ, రెండు టేబుల్సునూ కొనేశాడు. తన ఇంటికి వాటిని పంపమని షాపువాడికి చెప్పాడు.

పది బల్లలకు ఆర్డరు ఇచ్చాడు. రెండు బ్లాక్ బోర్డులను తయారుచేయమని చెప్పాడు.

ఫర్నిచర్ షాపునుండి బయలుదేరి ఒక సైన్ బోర్డులు రాసే ఆర్టిస్టు దగ్గరకెళ్ళి బోర్డును సిద్ధంచేయమనిఆర్డరు ఇచ్చారు.

అక్కడినుండి సున్నం కొట్టేవారిని నలుగురిని మాట్లాడి సున్నంకొని వాళ్లతో ఇంటికి చేరాడు.

సాయంకాలం నాలుగుగంటల లోపల ఇంటికి సున్నం కొట్టడం పూర్తి అయింది. టేబిల్స్, కుర్చీలు వచ్చాయి సైన్‌బోర్డు వచ్చింది. ప్రెస్ కుర్రాడొకడు కరపత్రాలను తెచ్చిచ్చాడు. గోపీ అయిదుగురి కుర్రాళ్ళను పిలిపించి ఒక్కొక్కరికీ అయిదురూపాయలిస్తానని చెప్పి, తలా మూడొందలు కరపత్రాలను ఇచ్చి, తలా ఒకవైపువెళ్ళి వాటిని పంచమన్నాడు.

మిగతా కరపత్రాలను పుచ్చుకొని గోపీ ఇంటికి తాళంవేసుకొని ఊళ్ళోకి బయలుదేరాడు. ఇంటింటికీ వెళ్ళి వాళ్ళ పిల్లలను తన కాన్వెంటుకు పంపమని బ్రతిమాలాడు. తను పిల్లలకు శ్రద్ధగా చెబుతాను అని వారికి భరోసాయిచ్చాడు.

అలా రాత్రి ఎనిమిది గంటలదాకా ప్రచారం చేసుకొని ఇరవైమంది పిల్లల పేర్లను రాసుకున్నాడు. వాళ్ళంతా మరునాడే గోపీ బడిలో చేరతామన్నారు. గోపీ ఉత్సాహంగా నళిని ఇంటికెళ్ళాడు రవీ, రాములకు చెరో కరపత్రం ఇచ్చాడు. మరో కరపత్రాన్ని నళిని చేతిలో పెట్టాడు. నళిని ఆ కరపత్రం చదివిందాకా మౌనంగా ఉన్నాడు గోపీ.

నళిని కరపత్రం చదివి సంతోషంగా గోపీవంక చూసింది.

"నళినీదేవి గారూ! నేను కాన్వెంటు పెట్టాను. అప్పుడే ఇరవై మంది పిల్లలు రేపట్నుండే చేరుతాం అన్నారు. నేను ఎం. ఎ. చేశాను. పిల్లలకు శ్రద్ధగా పాఠాలు చెబుతాను. తమపిల్లలైన రవినీ, రామునీ నా కాన్వెంటులో చేర్పించండి. నెలకు పన్నెండు రూపాయలు మాత్రమే ఫీజు ఒక్కో కుర్రవానికి. తమరు అభిమానించి, ఆదరించి ఒక నిరుద్యోగికి జీవన మార్గాన్ని చూపుతారని ఆశిస్తున్నాను" అన్నాడు గోపీ.

ఆ మాటలను విన్న రవీ, రామూ 'మేము మీ కాన్వెంటులో చేరుతాం' అనేశారు.

"ఏమంటారు? నళినీదేవిగారూ"

"చాలించండి, మీ అతివినయాలు"

"ఇలా చెప్పుకుంటూ, కరపత్రం ఇచ్చుకుంటూ చాలా ఇళ్ళు తిరిగాను నళినీ. ఇప్పటికప్పుడే ఇరవై మంది పిల్లల్ని పంపిస్తాం అన్నారు. రేపట్నుండే బడి ప్రారంభం. అంటే నెలకు రెండొందల నలభై రూపాయలువస్తుంది"

"చాలా సంతోషం గోపీ" అన్నది నళిని.

"గోపీ నేనూ ఒక పన్నెండు మందిని పంపగలను నీ కాన్వెంటుకు"

"తప్పు తప్పు నళినీ! అది నీ కాన్వెంటు"

"ఊహుఁ నీది"

వీళ్లిలా వాదించుకుంటుండే హఠాత్తుగా రవి అన్నాడు "కాన్వెంటు మాది" అని.

గోపీ, నళినీలు రాము మాటలను విని ఉలిక్కిపడ్డారు. ఒకరొకరు చూసుకున్నారు. గోపీ చూపులతోనే ఏమంటావు అన్నట్లు ప్రశ్నించాడు. నళిని తల వంచుకుంది.

ఆ తరువాత ఇద్దరూ వాళ్ళు సేకరించిన పేర్లను సరి చూసుకున్నారు. గోపీ బడి విషయం నళినితో చర్చించి ఆ తరువాత భోజనంచేసి వెళ్ళిపోయాడు.

ఆ మరునాడే ఇరవై ఆరుమంది విద్యార్థులు చేరారు. ఆ తరువాత ప్రతిరోజూ ఇద్దరూ ముగ్గురూ చొప్పున చేరుతున్నారు. తరువాత తరువాత యస్. యస్.సి. ఇంటర్, బి.ఎ. పాస్ పోయిన విద్యార్థులూ గోపీ దగ్గర ప్రైవేటుకు చేరారు.

బడిపెట్టి నెలా పదిహేను రోజులు కాగానే గోపీ బడిలో చిన్న క్లాసులవారు అరవై ఇద్దరయ్యారు కాలేజీ కుర్రాళ్లు పదిహేను మంది అయ్యారు.

మొదటి నెలకు వచ్చిన జీతాల డబ్బు ఒక వెయ్యీ ముప్పైరెండు రూపాయిలను వసూలు చేసుకొని గోపీ నళిని యింటికెళ్ళి, ఆ డబ్బును నళిని ముందుంచాడు.

నళిని కళ్ళు డబ్బును చూసి మిల మిలా మెరిశాయి.

"నళినీ ఈ డబ్బు నీది. తీసుకో"

నళిని ఆశ్చర్యంగా చూసింది గోపీ వంక.

"అవును నళినీ! ఇది నీ డబ్బు! నీ సలహా ఫలితం. నేను నిమిత్త మాత్రుణ్ణి. ఇందులో నుండి నీకు తోచినంత జీతం నాకియ్యి! నాకు రెండొందలకు తక్కువగాకుండా ఇస్తే సంతోషం. ఆ పైన నీదయ."

నళిని బాధగా ముఖంపెట్టి అంది "అలాటి మాటలు మాట్లాడకు గోపీ! నేను చేసిందేముంది? రెండు బంగారు గాజులు ఇచ్చాను. అవి తిరిగి నాకు ఇస్తే నీ ఋణం తీరుతుంది"

"అలాగే ఇస్తాను. నళినీ! అయితే ఒక్క షరతు, నీవు నాకు పెట్టిన పెట్టు బడికింద వడ్డీ పుచ్చుకోవాలి."

"నీ ఇష్టం గోపీ."

గోపీ ఇల్లంతా పరిశీలించాడు. రవీ, రామూ ఇంట్లోలేరు

"అయితే విను. వడ్డీక్రింద ఒక పూలమాలా, ఒక కాటుక డబ్బా, కుంకుమ భరిణా, మంగళసూత్రం ఇస్తాను నళినీ. పేదవాడిని. అంతకంటే ఎక్కువ ఇవ్వలేను వాటిని స్వీకరించు. స్వీకరించక పోయావా? కాన్వెంటు మూసేసి సన్యాసుల్లో కలిసిపోతాను" అంటూ గోపీ ఒక పొట్లాన్ని నళిని చేతిలో పెట్టాడు.

నళిని వణికే చేతులతో పొట్లాన్ని విప్పి చూసింది. అందులో ఒక కాటుక భరిణా, కుంకుమభరిణా, రెండు బంగారు మంగళసూత్రాలూ, చిన్న పూలమాలా ఉన్నాయి. వాటిని చూస్తూ మౌనంగా ఉంది నళిని.

"ఏం నళినీ చెప్పు? అవి సరి పోతాయా వడ్డీక్రింద?"

నళిని ఆ పొట్లాన్ని గోపీ కాళ్ళదగ్గర పెట్టి పాదాలను కండ్లకు అద్దుకుంది. గోపీ నళినిని లేవనెత్తి కౌగలించు కున్నాడు. ముద్దు పెట్టుకోబోయాడు, నళిని వారించి గోపీ కౌగిలినుండి తప్పు కుంది. "గోపీ! అంత హడావిడీ, ఆవేశం నీకు తగదు, దూరంగాఉండు. ముందొక పెద్ద ఇల్లు తీసుకో. అందులో మీ అమ్మనూ, చెల్లెండ్లనూ, తీసుకొచ్చి కాపురంపెట్టు. ఆ ఇంట్లోనే నాకోగది ఇవ్వు నేను అందులో చేరుతాను. క్రమంగా మీ అమ్మా చెల్లెళ్ళ, గౌరవాభి మానాలకు పాత్రురాలినౌతాను తరువాత ఒక శుభముహూర్తంలో ఆ గదిని మీరు సొంతం చేసుకోండి".

"అలాగే నళినీ! నీ ఇష్టం. రేపటి నుండే ఇంటికోసం వెతుకుతాను. నీవు చెప్పినట్లుగానే నిన్ను నా ఇల్లాలిగా చేసు కుంటాను" అన్నాడు గోపీ.



## 31

వీరయ్యకు బ్లడ్ ప్రెషర్ పట్టుకుంది. భార్య ఆరోగ్యం నానాటికీ క్షీణి స్తున్నది. ఒక రోజున రాత్రి పదిగంట లకు వీరయ్య తన పంచలో మౌనంగా కూర్చుని చుట్ట కాలుస్తున్నాడు.

సోమయ్య వచ్చి ఒక కుర్చీని లాక్కుని వీరయ్యకు ఎదురుగా కూర్చున్నాడు.

"మళ్ళీ చుట్ట కాలుస్తున్నారు! డాక్టర్ చెప్పలేదా? చుట్టలు మానుకోమని?" అన్నాడు సోమయ్య.

వీరయ్య మౌనంగా నోటిలోని చుట్టను తీసి అవతల పారేశాడు.

సోమయ్యకు ఏనుగునెక్కినంత సంతోషంగాఉంది, వీరయ్య తన మాటకు

విలువ

విలువ ఇచ్చినందుకు.

"సోమయ్యా! అబ్బాయి ఏమంటు న్నాడు?"

"అమర్‌నాథ్ మన మాట వినేట్లు లేదు. ఆ సినిమాహాలు, అమ్మిన ట్లే ఉన్నాడు. మద్రాస్ వెళ్ళి సినిమాలు తీయాలని అతడి ఆలోచన"

"మరి నా అప్పుసంగతి చెప్పావా?"

"చెప్పాను. ఆ అప్పుతో నా కేం సంబంధంలేదని చెప్పమన్నాడు.

"లారీలన్నీ అమ్మాయికి ఇవ్వడంతో అబ్బాయిగారికి కలిగిన కోపం ఇంకా తగ్గలేదు."

"లారీలు అన్నీ అమ్మాయికివ్వడం పొరబాటే. అమ్మాయీ పోయింది, లారీలూ పోయాయి."

"ప్చ్! ఏంలాభం! పెద్దమనసుతో ఇద్దరికీ ఆస్తులు పంచిపెట్టారు."

"అప్పు దాదాపు రెండు లక్షల రూపాయలు ఉంది. ఇల్లు అమ్మినా, ఆ అప్పు తీరేట్లు కనబడలేదు. పోనీ కాన్వెంటు సలక్షణంగా జరుగుతుందిగదా అనుకుంటే ఈ గోపీగాడొకశనిలా దాపు రించాడు."

"అవునండీ! కాన్వెంటు విషయంలో నా సలహాలన్నీ పెడచెవిన బెట్టారు. వాడికి ఉద్యోగం ఇవ్వకండి మొర్రో అంటే ఇచ్చారు. వాడి సర్టిఫికేట్లు వాడి ముఖానగొట్టే పీడ వదలిపోయేది. సరే! ఇవ్వాలేదనుకోండి వాణ్ని ఉద్యోగంలోంచి తీసెయ్యొద్దంటే అదీ వినకపోతిరి."

వీరయ్య నిజమే నన్నట్లుగా తల వంచుకొని ఉన్నాడు

"ఇప్పుడు చూడండి! వాడిదగ్గర దాదాపు ఎనభై మంది పిల్లలున్నారు. రోజుకు ఇద్దరూ ముగ్గురూ మన బడిలో నుండి వాడి బడిలోకెళ్తున్నారు. ఆ గండయ్యగూడా మొత్తుకున్నాడు వాడి బడిలోంచి గూడా పిల్లలు గోపీ బడిలో కెళ్తున్నారు. ఇక నళిని, కనకం, సుబ్బా రావులు గూడా సమయం దొరికితే వాడి బడిలోనే చేరడానికి సిద్ధం అవు తున్నారు, వాళ్ళు గూడా గోపీ బడిలో చేరితే ఇక అగ్గిమీద గుగ్గిలం వేసి నట్లే. మన బడిలో ఇక వందమంది గూడా మిగలరు! "ఊఁ! సోమయ్యా ఇక లాభంలేదు! తేల్చి వేయాల్సిందే! గోపీకి నూకలు చెల్లాయి! వాణ్ణి చంపించు! మనమీదికి అను మానం రానీకు. బయట పడగూడదు. ఇపుడువాడు చచ్చినా అనుమానం నేరుగా మన మీదికి రాదు. గండయ్యా బడిలో నుండి కూడా పిల్లలు వాడి బడి లో చేరారుగదా' అనుమానం వాడి మీద గూడా కలగడానికి అవకాశం ఉంది. గోపీని చంపి, ఆ నేరం గండయ్యా మీద వేయగలిగితే, ఖర్చులు గాక, నీకు పది వేల రూపాయల బహుమానం"

"అలాగే నండీ! మీరు నిమ్మకు నీరెత్తినట్లుండండి. గోపీ మాయం అవు తాడు! గండయ్యాను,పోలీసు లెత్తుకెళ్తారు. మన బడిలోని పిల్లల సంఖ్య, ఎనిమిది వందలకు పెరుగుతుంది!"

"అలాచెయ్ సోమయ్యా! నా అప్పు తీరాక నీకు చక్కని డాబా ఇల్లు వేయించి పెడతాను!"

ఆ తరువాత వీరయ్య, సోమయ్య రహస్యంగా చాలా సేపు చర్చించు కున్నారు.



# 32

అర్ధరాత్రి

అంతా నిశ్శబ్దంగా ఉంది. గోపీ ఇంటి ఆవరణలో దొడ్డివైపు నలుగురు మనుష్యులు ప్రవేశించారు. వాళ్ళు గోపీ ఇంటి వెనుక ఉన్న ఒక కిటికీ దగ్గరకు చేరారు. ఒక లావుపాటి కర్ర సాయంతో కిటికీ చువ్వలను వంచి రెండింటిని పైకి లేవనెత్తారు. నిశ్శబ్దంగా, ఒక్కొక్క వ్యక్తీ లోపలికి వచ్చారు. నలుగురూ గోపీ పడుకున్న మంచానికి నాలుగు ప్రక్కలా చేరారు. గోపీ ఆదమరిచి నిద్రపోతున్నాడు. అందులో ఒకడు కర్రను తీసుకొని, గోపీ తల మీద కొట్టాడు. గోపీ, 'అమ్మా!' అంటూ నోరు తెరవడానికి ప్రయత్నించిన మరుక్షణం, ఒకడు గోపీ నోట్లో గుడ్డను కుక్కడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూంటే, గోపీ ఆ గుడ్డను తొలగదోసుకొని, లేచి కూర్చున్నాడు. లేవబోతుంటే, ఒక్క క్షణ కాలంలో గోపీకి మనుషులు కనబడ్డారు. మరుక్షణం, తల మీద నుండి రక్తప్రవాహం బయలుదేరి, గోపీ కళ్ళను, అడ్డంపడింది. గోపీ నడుముకు, తలకు భుజాలకు కర్రదెబ్బలు, తగులుతున్నాయి. గోపీ, ఒక చేత్తో కంట్లోకి రక్తప్రవాహం పోకుండా ఆపుకొని, వెనక్కు తిరిగి రెండో చేత్తో తలగడ క్రింద ఉన్న రివాల్వర్‌ను, లాగి తల ప్రక్క నిల్చున్న వ్యక్తి వైపు కాల్చాడు.

రివాల్వర్ మంటలు గ్రక్కుతూ 'ఢాం!' అనగానే, తలప్రక్కన ఉన్న వాడు, "అమ్మా!" అని అరిచి, నేలకూలి పోయాడు. మిగతా ముగ్గురూ క్షణంలో జరిగిన సంగతి, గ్రహించిచెల్లా చెదరై పారిపోయారు. ఒకడు తలుపు తీసుకుని వాకిటివైపు పారిపోయాడు. ఇద్దరు దొడ్డితలుపు తీసుకొని పారిపోయారు. నేల నపడ్డవాడు, తొడను పట్టుకొని, "అమ్మా! అమ్మా!" అంటూ బాధతో మెలికలు తిరిగి పోతున్నాడు. గోపీ, రివాల్వర్‌లో మరో గుండు పెట్టి, "దొంగలు! దొంగలు! రక్షించండి!" అంటూ పెద్దగా అరిచి, మరోమారు గాలిలో పేల్చాడు.

ఆ తరువాత, నాలుగైదు నిమిషాలకు, వాకిట్లోనుండి, అనేక బ్యాటరీలైట్లు ఇంట్లోకి పడ్డాయి. గోపీ, పెద్దగా కేకలు పెడ్తూ, తలను చేతితో గాయానికి హత్తుకున్నాడు బజార్లో నుండి భయం భయంగా, బ్యాటరీ లైట్ల వారు లోపలికొచ్చి, లోపల జరిగిన ఘోరాన్ని చూశారు. కొంత మంది, క్రిందబడి బాధపడుతున్న వ్యక్తిని పట్టుకొని, ఎవరు నువ్వు? ఎందుకొచ్చావు?" చెప్పు అని అతడ్ని నిర్దయగా, తంతున్నారు. "పోలీసులను, పిలవండి! డాక్టర్‌ను పిలవండి!" అనికొందరన్నారు.

గోపీ, రివాల్వర్‌ను, దొంగవైపు పెట్టి" ఎవడివిరా నీవు ? నిన్ను వీరయ్య పంపాడా? నిజం చెప్పు, లేకుంటే నిన్ను కాల్చి చంపుతాను" అని బెదిరించాడు.

వాడు గజగజ వణుకుతూ "బాబ్బాబు నన్ను చంపకండి! పిల్లలుగలవాణ్ణి! నిజం చెబుతాను!" అన్నాడు.

"చెప్పు"

"అయ్యా, వీరయ్యగారు మిమ్మల్ని చంపితే, తలా వెయ్యి రూపాయలిస్తానన్నారండి! అందుకని వచ్చాం! మిమ్మలను చంపి, కార్లోవేసుకొని, సముద్రం ఒడ్డుకు తీసుకొని రావాలన్నారు సోమయ్యగారు. సముద్రం ఒడ్డున కట్టెలు పేర్చి, డబ్బా కిరసనాయిలు, పెట్టుకొని ఉంటామన్నారండి. శవాన్ని తీసుకెళ్ళి, ఆయనకి ఒప్పగించడం, మా బాధ్యత!"

"ఆ తరువాత?"

"ఆ తరువాత సోమయ్య మిమ్మల్ని తగుల పెట్టాలని, తెల్లారే లోపల మసి అంతా సముద్రంలో పారబొయ్యాలనీ, అన్నారు'"

దొంగ చెప్పిన విషయాలను, అంతా నోరు తెరుచుకుని, విన్నారు తరువాత కొంత సేపటికి, డాక్టర్ వచ్చి గోపీకీ, దొంగకూ, కట్లు కట్టాడు. ఆ తరువాత పోలీసులు దిగారు.

పోలీసులు, వీరయ్యను ఇంటి దగ్గరా, సోమయ్యను 'సముద్రం దగ్గరా పట్టుకున్నారు. మిగతా ముగ్గురు దొంగలనూ వారంలోపల, అరెస్టు చేశారు. వీరయ్య మీదా, అతని సహచరుల మీదా, కేసులు సెషన్స్‌లో నడుస్తున్నాయి.

వీరయ్య అరెస్టు అవడంతో, వీరయ్య బాకి దార్లు దావాలువేసి డిక్రీలు పొంది, వీరయ్య ఇంటినీ, కాన్వెంటు ప్రాపర్టీని స్వాధీన పరచుకున్నారు.

వీరయ్య, జైలుకువెళ్ళిన మరునాడు కాన్వెంటు, కాకులు చింపిన విస్తరి అయ్యింది. అందులోని పిల్లలు గండయ్య కాన్వెంటుకూ, గోపీ కాన్వెంటుకూ వెళ్ళిపోయారు. లైసెన్సు లేకుండా తుపాకిని ఉంచుకున్నందున గండయ్యకూ, గోపీకి జరిమానాలు పడ్డాయి.

కనకం, సుబ్బారావు, నళిని – గోపీ కాన్వెంటులో చేరారు. గోపీ చెప్పినట్లుగా, ట్యుటోరియల్ కాలేజీ, కాన్వెంటూ ఏర్పడ్డాయి. గోపీ నళినీల ఆధ్వర్యంలో.

అనుకున్నట్లుగా, గోపీ పెద్ద ఇంటిని, తీసుకున్నాడు. అందులో రెండుగదులను నళినికి ఇచ్చాడు. నళిని, రవీ-రాము ఆ ఇంట్లో చేరారు. గోపీ తల్లి శేషమ్మా, చెల్లెళ్లు, జాహ్నవి, సుచరిత, విమల, అలివేణి కూడా ఆయింటి కొచ్చారు. కొద్ది రోజులలోనే, అంతా పొరపొచ్చాలు లేకుండా మెలిగారు. నళిని చేసిన సహాయానికి, శేషమ్మ ముగ్ధురాలైంది. గోపీ చెల్లెళ్ళు కూడా నళినిని చుట్టుకొని, చుట్టుకొని తిరిగారు. రవీ, రాములకు తామంతా, ఒకచే కుటుంబం అన్న భావన కలిగింది. క్రమంగా, నళిని ఇల్లు, గోపీ ఇల్లు అన్న భావన, ఎవరికీ కలుగలేదు! ఒక రోజున, పెద్ద ఆర్భాటం లేకుండా, శేషమ్మా, నళిని, గోపీ తిరుపతి కెళ్ళారు. అక్కడే, నళిని, గోపీల వివాహం జరిగింది.

కంటికి కాటుకతో, మెడలో మంగళ సూత్రంతో, తల నిండా పూలతో, పట్టు చీరా, రవికా ధరించి తిరిగివచ్చిన నళినిని చూసి రవీ, రామూ ఆశ్చర్య ఆనందాతిరేకంతో అడిగారు. "అమ్మా! నువ్వు ఎంత అందంగా ఉన్నావు? ఇన్నాళ్ళ నుండీ, ఇవన్నీ ఎందుకు పెట్టుకోలేదు?

అమ్మా ఎప్పుడూ, ఇలాగే ఉండమ్మా!"

నళిని వాళ్ళిద్దర్నీ అక్కున చేర్చుకొని "పిల్లలూ! ఇవన్నీ గోపీనాథ్‌గారు నాకు ఇచ్చారు; గోపీనాథ్‌గారు మంచి వారనే అంటారా?" అంది "చాలా మంచి వారమ్మా! నాకూ వారు చొక్కా చెడ్డీలు కుట్టించారు గదా?" అన్నాడు రాము.

"అవునమ్మా భలే మంచివారు నాకు చొక్కా చెడ్డీలనే గాదు. పెన్ గూడా కొనిచ్చారమ్మా!"

"మరి చదువు చెప్పేవార్ని మాష్టర్ అనాలి! మీకు చదువు చెప్పడమేగాక మిమ్మల్ని ప్రేమిస్తున్నారు గదా! మీకు అన్నీ తెచ్చిస్తున్నారు గదా; మరి అటువంటి వారిని ఏమని పిలవాలి?"

రవీ, రాము బుర్రలు గోక్కున్నారు. "నువ్వే చెప్పమ్మా!" అన్నారు.

"నాన్నా!...నాన్నా... అని పిలవగలరా?"

"ఓ! అలాగే పిలుస్తాం;" అన్నారు ఇద్దరూ ఒకేసారి.

ఇంతలో గోపీ చెల్లెళ్ళు ఒక పేపర్ పట్టుకొని నళినినిచుట్టుముట్టారు. "వదినా! వదినా! రిజల్ట్సొచ్చాయి! నలుగురం పాసయ్యాం!" అన్నారు సంతోషంగా.

ఆ రోజంతా ఆ ఇల్లు నవ్వులతో, సంతోషంలో తేలిపోయింది. మధ్యాహ్నానికి గ్రాండ్ గా విందు జరిగింది. అందులో కనకం, సుబ్బారావు, సరోజ, ఇందుమతి, వాళ్ల భర్తలూ, పిల్లలూ పాల్గొన్నారు.

రాత్రి పన్నెండు గంటలైంది.

నళిని తన రూంలో ఉంది. గోపీ తలుపు తెరుచుకొని గదిలో చూస్తున్నాడు. గదిలో పందిరి మంచం అందంగా అలంకరించి ఉంది. నళిని సర్వాంగ సుందరంగా అలంకరించుకుని ఉంది.

"నేను రావచ్చునా? మేడం?"

"మీ ఇష్టం! ఇక్కడ నాది అంటూ ఏమీ లేదు. ఈ గదీ, గదిలోని సర్వస్వం మీవే!"

గోపీ నళినిని సమీపించి ఆమె భుజం మీద చెయ్యి వేసి నడిపించుకొని పెళ్ళి మంచం మీద కూర్చోపెట్టాడు. జేబులో నుండి ఒక పొట్లాన్ని తీసి అందులో నుండి నాలుగు బంగారుగాజులూ, ఒక సన్నని బంగారు నెక్లెస్ తీశాడు. వాటిని చూసి నళిని నిరుత్సాహంగా గోపీ వంక చూసి "ఇవన్నీ ఇప్పుడెందుకండీ?" అన్నది.

"మరేం కావాలి?" గోపీ చిలిపి ప్రశ్న.

నళిని చప్పున తల వంచుకుంది. గోపీ గాజులను నళిని చేతికి తొడిగాడు. రెండు చేతులనూ ముద్దిడుకున్నాడు. మెడలో నెక్లెస్ పెట్టాడు. అందమైన కంఠాన్ని చుంబించాడు.

"ఏమండీ! ఇవన్నీ నాకెందుకండీ! సగం జీతం తింటూ సగం జీవితాన్ని మోస్తూ బ్రతుకుతున్న నాకు నిండు జీతం ఇచ్చారు. నిండు జీవితం ఇచ్చారు. మీకు నేను ఏం ఇవ్వగలనండీ!"

"ఒక్క ముద్దు!"

"ఛీ! పొండి!"

"ఊహు! నేనొప్పుకోను!ఇవ్వాల్సిందే! తప్పదు లేకుంటే నేను రేపు అన్నం తినను" అని మారాంచేశాడు గోపీ. నళిని లేచి స్విచ్ ఆఫ్ చేసింది.



# నైట్‌డ్రస్

సూర్యారావు ఏం తోచక సాయంకాలం క్లాసుమేటు జ్యోతి ఇంటికివెళ్ళాడు. సూర్యారావు వెళ్ళేసరికి ఇంట్లో జ్యోతి తప్ప మరెవ్వరూలేరు. జ్యోతి ఇంట్లో వాళ్ళంతా పెళ్ళికి వూరెళ్ళారు ఒక్కదానికే సాయంత్రం చాలాబోరుగావుంది. సరిగ్గా ఆ సమయంలో వచ్చిన సూర్యారావుని చూసి జ్యోతికి ప్రాణం లేచివచ్చినట్లయింది. "బలేమంచి టైమ్‌లోవచ్చావు సూర్యం. ఇంట్లోఎవరూలేరు. ఒకదానికే బోరుకొట్టిచస్తున్నాను. కమాన్" అంటూ ఆహ్వానించింది. ఇద్దరూ పిచ్చాపాటిలో పడ్డారు. సినిమాకబుర్లు కాస్సేపు, క్లాసు రాజకీయాలు, లెక్చరర్లని మిమిక్రీచెయ్యడాలు ఇలా కొంతసేపు గడిచింది. తరువాత మూడురౌండ్లు చదరంగం వేశారు. సూర్యారావు మూడుసార్లూ చిత్తుగా ఓడిపోయి ఆరు గ్లాసులనీళ్ళు తాగాడు-తాగుతున్నంతసేపూ, ఆడుతున్నంతసేపూ కారప్పూస, లడ్డూలు, కాఫీ అరగిస్తూనే వున్నారు. ఆటల్లో, మాటల్లో బాగాపొద్దుపోవడం సూర్యారావు గానీ, జ్యోతిగానీ గమనించనేలేదు! తీరా సూర్యారావు ఇంటికి బయల్దేరేసమయానికి కుండపోతగా వర్షం. 'ఫర్వాలేదులే...ఎలాగోలావెళ్తాను' అని బయల్దేరాడు సూర్యారావు, "ఆ(... వెళ్తావు మహోష్టీ రోఫి. గ్లాసెడునీళ్ళు నెత్తినపోస్తేనే జలుబుచేసిందంటూ వారంరోజులు మంచమెక్కే మగాడివి. కొంపలేంమునగవుగానీ ఇక్కడే వుండిపో మేడమీద గది ఖాళీగానేవుంది. నువ్వు అందులో పడుకోవచ్చు," అని వారించింది జ్యోతి "ఓ. కె" అని ఒప్పుకున్నాడు సూర్యారావు. మేడ మీదిగది పరిస్థితి ఎలావుందో చూసి ఏర్పాటుచేద్దామని జ్యోతి మేడమీదికెళ్ళింది. ఓ ఐదు నిమిషాలతర్వాత తిరిగివచ్చిచూస్తే ఇంట్లో సూర్యారావు లేడు

ఓ పావుగంట తర్వాత సూర్యారావు తలుపుతోసుకునీ లోపలికివచ్చాడు. పూర్తిగా తడిసి ముద్దయిపోయాడు. అతడివాలకంచూసి "వాట్ సూర్యం! నే చెప్పిందేమిటి ? ఇంతలోనే అలాతడిసిపోయేలా ఎక్కడికెళ్ళావ్?" విసుగ్గా అడిగిందిజ్యోతి "ఇవ్వాళరాత్రికి మీ ఇంట్లోనేవుండిపొమ్మన్నావుగా. అందుకని



ఇంటికెళ్ళి నైట్‌డ్రస్ పైజమా, చొక్కా తెచ్చుకున్నాను" అన్నాడు సూర్యారావు 'హాచ్' అని తుమ్ముతూ.

—మీనా

# రచన

హైస్కూలు మ్యాగజైన్‌కి విద్యార్థు లంతా ఎంతో ఉత్సాహంగా కథలు కవితలు,బొమ్మలు,ఇచ్చారు. ఆ సంవత్సరం స్కూలు మ్యాగజైన్ బాధ్యత ఇంగ్లీషు టీచర్‌కి అప్పగించారు. టీచర్ వచ్చిన రచన లన్నింటినీ పరీక్షించింది. మొత్తం మీద రచనల్లో భావం, వస్తువు బాగు న్నప్పటికీ, చెప్పే విధానంలో మాత్రం అపరిపక్వత స్పష్టంగా కనిపిస్తున్నది. అయినా చిన్న పిల్లలు ఆ మాత్రమైనా రాయగలిగినందుకు టీచర్ చాలా సంతోషించింది.



ఒకరోజున క్లాసులో రచనల విషయం ప్రస్తావించి, "భవిష్యత్తులో మీరంతా మంచి కవులు, నవలారచయితలు కావాలి" అని చెప్పి ఒక "మంచి నవలలోని నాలుగు ప్రధానమైన లక్షణాలేమిటంటే, మతం, రాచరికం, సెక్సు, రహస్యం. ఈ లక్షణాలనిదృష్టిలో పెట్టుకుని మంచి నవలలు మీరు కూడా రాయాలి మరి" అన్నది.

ఓ పది నిమిషాల తర్వాత ఓ విద్యార్థి లేచి నిలబడి "టీచర్! మీరు చెప్పిన నాలుగు లక్షణాలతో ఇప్పుడే నేనో రచన చేశాను" అన్నాడు. టీచర్ ఆశ్చర్యపోతూ "ఏదీ చదువు" అన్నది.

"పూజారిగారూ!" అని రాజుగారు కంగారుగా పిలిచారు "రాణీగారికి మళ్ళీ గర్భం వచ్చింది! ఈసారి ఇందుకు కారకుడెవరో అంతుబట్టడంలేదు" అని రాజుగారు వాపోయారు– విద్యార్థి చదివి వినిపించాడు.

—రవి

# హెల్ప్

రేణుక కాలేజీ నుంచి నీరసంగా ఇంటికి బయల్దేరింది. మూడుగంటలసేపు కెమిస్ట్రీ లాబొరేటరీలో నిలబడి ప్రాక్టికల్స్ చేసి బాగా అలసిపోయింది. మొహమంతా వాడిపోయింది. ఫ్రిజ్‌లోంచి గ్లాసెడు చల్లటినీళ్ళుతాగి రోడ్డుమీద పడింది. రోడ్డుమీద కొంతదూరం వచ్చేసరికి వెనకనించీ విజిల్ వినిపించింది. వెనక్కితిరిగి చూస్తే, ఓ హిప్పీజుట్టు కుర్రాడు తనవంకే నవ్వుతూ చిలిపిగా చూస్తున్నాడు రేణుక గిరుక్కున మొహంతిప్పేసుకుని గబగబా అడుగులు వేయసాగింది. హిప్పీ రోమియో మళ్ళీ విజిల్ కొట్టాడు. రేణుక ముఖం అతనికి కనబడకుండా తలనిండా పవిట కప్పు

కాని నడక వేగం ఇంకా పెంచింది. హిప్పీ కూడా నడక వేగం పెంచాడు. "నిలుపవే వాలుకనులదానా - వయారీహంస నడకదానా" అంటూ ఓ పాట అందుకున్నాడు కాస్త గొంతు సవరించుకుని "ఆ...లగ్ జాగలే దిల్ రుబా" అని ఓ హిందీ పాట కూడా పాడాడు. రేణుక కంగారుగా ముందు నడుస్తున్నది, రోమియో అంతలోనే 'మైహార్ట్ ఈజ్ బీటింగ్...' అంటూ ఓ ఇంగ్లీషు పాట ఎత్తుకున్నాడు చివరికి "పూనమల్లియలే— గుండుమల్లియలే— ఒరువొన్ను పిన్నాలే" అంటూ అరవపాట కూడా పాడాడు. కనీసం తిట్టడంకోసమైనా వెనక్కితిరిగి చూడదేమిటబ్బా ఈ పిల్ల అనుకుని, "పలట్ మేరీ జాన్" అని మరో పాట కూడా అనేశాడు. అంతలో రేణుక పరుగులాంటి నడకతో, ఎదురుగా



వస్తున్న కారుకి అడ్డంబడి 'స్టాప్... ప్లీజ్ స్టాప్' అని అరిచింది. కారు సడన్ బ్రేకుతో ఆగింది. అదిచూసి రోమియో గతుక్కుమని సందుదోవపట్టాడు. కంగారుగా కారు ఆపిన రేణుకని చూసి, కారు డ్రైవ్ చేస్తున్న ఓ మోడరన్ గర్ల్ "ఓ వాట్ కెన్ ఐడూ ఫర్ యూ స్మార్టీ" అంది.

"ప్లీజ్... హెల్ప్ మీ... బాగా అలసిపోయివున్నాను. మొహం కూడా బాగా పడలిపోయివుంది. ఎవడోకుర్రాడు నా వెంట బడ్డాడు... ఇఫ్ యూ డోంట్ మైండ్... మీ దగ్గర పౌడరూ, దువ్వెనా వుంటే ఇస్తారా ఓసారి .." అడిగింది రేణుక ఆత్రంగా.

- వై. రామకృష్ణారావు

# మూత

భార్య అండాళమ్మ ఆరోగ్యస్థితి అదో శనకరంగా వుందనీ, వెంటనే రావల్సిందనీ సంగమేశ్వర్రావు కంగారుగా డాక్టర్ కి ఫోన్ చేశాడు. డాక్టర్ వచ్చేదాకా సంగమేశ్వర్రావుకి కాలూ, చెయ్యీ ఆడలేదు. ఊరికే బెంబేలు పడిపోతున్నాడు. తన ప్రాణాతి ప్రాణమైన అండాళుకి ఏమవుతుందోనని కంగారెత్తిపోతున్నాడు. అసలే స్థూలకాయం. ఆపైన ఉబ్బస రోగం. దానికితోడు బ్లడ్ ప్రెషరూ, అన్నింటినీమించి చాదస్త్రం. ఇన్ని గొడవ లున్నప్పుడు మొన్న చవితినాడు 'పాతిక ఉండ్రాళ్ళు ఒక్కసారే తినొద్దే అండాళూ' అని నెత్తీ నోరూ మొత్తుకుంటే విన్నదా?

డాక్టర్ వచ్చాడు, డాక్టర్ని చూస్తూనే సంగమేశ్వర్రావు భోరుమన్నాడు.

"పెళ్ళాంకిమల్లే ఏడవకయ్యా బాబూ" అంటూ డాక్టర్ సరాసరి ఆండాళమ్మ వున్న గదిలోకి వెళ్ళాడు. ఆండాళమ్మ పట్టెమంచంమీద వెల్లకిలా పడుకుని రొప్పుతున్నది. సంగమేశ్వర్రావు గదిబయటే నిలబడ్డాడు ఆండాళమ్మ బాధ చూళ్ళేక. ఓ ఐదు నిమిషాల తర్వాత డాక్టరు బయటికి వచ్చి ఓ స్క్రూడ్రైవరు కావాలన్నాడు. సంగమేశ్వర్రావు తెచ్చిచ్చాడు. మరో ఐదు నిమిషాల తర్వాత డాక్టరు బయటికొచ్చి పట్టకారు ఇమ్మని అడిగి తీసుకెళ్ళాడు. మరో ఐదునిమిషాలు గడిచాయి. డాక్టరు మళ్ళీ బయటికొచ్చాడు. మొహమంతా చెమటపట్టివుంది. బాగా అలసిపోయి



నట్లుగా వున్నాడు. ఆయన ముఖంలో నిరాశ కన్పిస్తున్నది, "ఉలీ, సుత్తీ వుంటే ఇవ్వండి" అని అడిగాడు. "డాక్టరుగారూ! ఏమిటిదంతా? ఈ సుత్తులూ, కొడవళ్ళూ...నా ఆండాళుకి ఏమయింది, ఏం ప్రమాదం ముంచుకొచ్చిందిబాబూ..." పెద్దగా ఏడవసాగాడు సంగమేశ్వర్రావు. "ఉండవయ్యా స్వామీ! ఏమయిందో చూడందే ఎలా తెలుస్తుంది? నా మందులపెట్టె మూత తెరుచుకోక నే ఛస్తుంటే ఇందాకట్నుంచీ" అంటూ విసుక్కున్నాడు డాక్టర్.

—వంశీకృష్ణ

# జవాబు

మధుమతికి పెళ్ళి నిశ్చయమయింది.

కాబోయేభర్త కిరణ్‌తో కలిసి కార్లో షాపింగుకి బయల్దేరింది. తాము కాపురం పెట్టబోయే కొత్త బంగళాలో అన్ని ఆధునిక సౌకర్యాలూ ఏర్పాటు చేసుకోవాలనుకుంది. ఎయిర్‌కూలర్స్‌కీ, ఫ్రిజ్‌కీ ఆర్డరిచ్చింది.

దోవలో కంప్యూటర్ల తయారీదార్ల ఆఫీసుచూసి, ఓ సారి చూసివద్దామంది. ఇద్దరూ కారుదిగి కులాసాగా సేల్సు రూములోకి నడిచారు. సేల్సుమన్ ఒక మిషనుచూపించి "మీరు ఏ ప్రశ్న అడిగినా ఈ మిషను సరిగ్గా సమాధానమిస్తుంది" అని చెప్పాడు. మధుమతి మిషన్ని పరిక్షిద్దామని ఒక కాయితం మీద "మా నాన్నగారెక్కడున్నారు" అని రాసి, మిషన్లో పెట్టింది. వెంటనే మరోకాయితం మీద సమాధానంవచ్చింది—"మీ నాన్నగారు ప్రస్తుతం బీచ్‌లో కూర్చుని వున్నారు".

"నో...నో...తప్పు. ఈమిషనంతా బోగస్ మా నాన్నగారు చనిపోయి పదేళ్ళయింది" అన్నది మధుమతి.

"లేదు మేడమ్! ఈ మిషన్ ఎప్పుడూ తప్పు చెయ్యదు. బహుశా ప్రశ్న అడగటంలో చిన్నపొరపాటుగానీ, తేడాగానీ వుండివుండొచ్చు. అందుకని అదే ప్రశ్నని మరో విధంగా మార్చి అడగండి" అన్నాడు సేల్సుమన్.



"ఓ.కె" అని ఈ మారు "మా అమ్మ భర్త ఎక్కడున్నాడు" అని రాసి, చీటీని మిషన్‌లో పెట్టింది. మిషన్ వెను వెంటనే సమాధానమిచ్చింది

"ఆయన చచ్చిపోయి పదేళ్ళయింది.

—నరేంద్ర

# గొప్ప

మాణిక్యరావు ఇంటర్ నాలుగుసార్లు దండయాత్ర చేసి కూడా పాసవ లేకపోవడంతో, వాళ్ళ మామయ్య, ఇక వీడికి చదువురాదని నిర్ధారణచేసుకుని హైదరాబాదులో వుంటే ఏదైనా కంపెనీలో చిన్న వుద్యోగమైనా చూడవచ్చని శ్రీకాకుళం నుంచీ హైదరాబాదు తీసుకొచ్చాడు. మూణ్ణెల్లపాటు అడ్డమైనవాడి కాళ్ళూ పట్టుకున్నా, మనవాడి వాలకం చూసి, కనీసం అటెండరుద్యోగమివ్వటానికూడా ఎవ్వరూముందుకు రాలేదు. ఉద్యోగం రాకపోయినా, హైదరాబాదు లాంటి మహానగరంలో ఉండటంతో మాణిక్యరావుకి పోజు బాగా పెరిగింది. తనవూళ్ళో స్నేహితులకి ఏవేవో గప్పాలు కొడుతూ ఉత్తరాలు రాస్తుండేవాడు. ఈ మూణ్ణెల్లల్లో పొడిపొడిగా ఉర్దూ మాట్లాడం కూడా నేర్చుకున్నాడు.

ఒకసారి ఏదో ఇంటర్వ్యూకోసం మాణిక్యరావు స్నేహితులిద్దరు హైదరాబాదు వచ్చారు. వాళ్ళకి హైదరాబాదు కొత్తగావడంతో మాణిక్యరావు వాళ్ళ ముందు అన్నీ తెలిసినవాడిలా పోజు కొడుతూ, తనకి తెలిసిన నాలుగైదు ప్రదేశాలు చూపించి లీడర్‌షిప్ [illegible]



బెట్టాడు. చార్మినార్ నుంచీ వస్తుంటే ఫుట్‌పాత్ మీద ఒకతను స్వెట్టర్లు, మఫ్లర్లు పెట్టుకుని అమ్ముతున్నాడు తన

స్నేహితుల ముందు తన ఉర్దూ పాండిత్యం ప్రదర్శిద్దామనుకున్నాడు మాణిక్యరావు గొప్పగా. మఫ్లర్లమ్మే అతని దగ్గరకెళ్ళి, ఒకటి తీసి "యే కిత్‌నా హై" అన్నాడు. మనవాడి వాలకం చూసి వీడికెట్లాగూ ఉర్దూరాదనుకుని అతను వచ్చీరాని తెలుగులో "పన్నెండు రూపాయలుంది సార్" అన్నాడు. మాణిక్యరావు ఇంకాధాటిగా "కమ్ నై దేతే ?"(తక్కువకిస్తావా) అని అడిగాడు. "పోనీ పదిరూపాయిలివ్వండి సార్" అన్నాడతను. విస్తుపోయి తనని చూస్తున్న స్నేహితులవైపు గర్వంగా ఒకసారి చూసి, "నైనై పాంచ్ ... రూపయామే దేవ్" అన్నాడు మాణిక్యరావు, పన్నెండు రూపాయిలది ఐదు రూపాయలకు ఎలాగూ ఇవ్వడులే అనుకుని. వెంటనే అతను "తీసోకండి సార్ ... పైసలివ్వండి" అన్నాడు. మాణిక్యరావు పని గొంతులో పచ్చివెలక్కాయ చిక్కుకున్నట్లయింది. జేబులో రూపాయి కూడాలేదు. ఏం చెయ్యాలో తోచక గుటకలు మింగుతూ నిలబడ్డాడు.

— భాగవతుల సత్యనారాయణ

# సాక్షి

బార్‌లోంచి బైటకి వచ్చి కారెక్కబోతున్న రాజారావుని ఓ ముష్టివాడు ఆపాడు, "బాబూ! దరమ పెబువులు, మూడు రోజుల్నించీ తిండిలేదండీ. కాసిని డబ్బులిప్పించండి బాబూ" అని వేడుకున్నాడు. రాజారావు ముష్టివాణ్ణి ఎగాదిగా చూశాడు. పీలికలయి పోయిన మురికి గుడ్డలు, లోతుకుపోయిన కళ్ళు, పీక్కుపోయిన దవడలు చాలా దయనీయంగా ఉన్నాడు. ముష్టివాడి ప్రార్థన విని నిషాలోవున్న రాజారావు,

"చూడవోయ్! అయితే నీ కోసం ఓ బ్రాందీసీసా కొనిస్తాను" అన్నాడు.

"నాకు తాగుడు అలవాటు లేదు బాబయ్యా, డబ్బులిప్పించండి ఇంత తిండితింటా" అన్నాడు ముష్టివాడు.

"ఓకే - ఓకే...అయితే ఓ రెండు సిగరెట్ ప్యాకెట్లు కొనిస్తాను"



"నేను సిగరెట్లు కాల్చనండీ, నాలుగు రాళ్ళిప్పించండి, కాస్త కూడుతింటా"

"ఆల్‌రైట్, రేపు రేసులో గెల్చే గుర్రం నాకు తెలిసిపోయింది. దానిమీద పందెం కాస్తాను, వచ్చిన డబ్బు..." చెప్తున్నాడు రాజారావు.

ముష్టివాడు అందుకుని "నేను జూదమాడనుసారూ!" అన్నాడు.

వెంటనే రాజారావు కారు

స్టార్టుచేసి "వెరీ గుడ్, ఇలావచ్చి కారెక్కవోయ్! నిన్ను మా యింటికి తీసుకెళ్ళి కడుపునిండా భోజనం పెట్టి స్తాను. ఆగకుండా, సిగరెట్ కాల్చకుండా, రేసులాడకుండా బ్రతికే బుద్ధిమంతులు ఏ స్థితిలో వున్నారో మా ఆవిడకి ప్రత్యక్షంగా చూపించదల్చుకున్నాను. ఆవిడ రోజూ నా మీద ఒకటే పోరు" అంటూ డోరు తెరిచి పట్టుకున్నాడు కారెక్కమంటూ.

—ప్రియదర్శిని

# దర్పం

హెడ్డాఫీసునుండి జనరల్ మేనేజర్ రాబోతున్నాడనేసరికి బ్రాంచి ఆఫీసు అంతా కలవరం బయల్దేరింది.

ఆయన వస్తూనే పులిలాగా మహా సీరియస్‌గా ఆఫీసంతా తిరిగి. 'అది సరిగా లేదు, ఇది బాగాలేదు' అంటూ అందరి మీదా తన దర్పాన్ని, అధికారాన్ని ప్రదర్శించసాగాడు. అంతలో ఓకుర్రాడు బయటనుంచీ రెండు బరువైన ప్యాకేజీలు లోపలికి పట్టుకొస్తూ పొరపాటున వాటిని క్రింద పడెయ్యబోయి, ఎలాగో ఆపుకొని జాగ్రత్తగా గదిలో పెట్టాడు. అగ్గిమీది గుగ్గిలంలా ఎగిరిపడుతున్న జనరల్ మేనేజర్, వెళ్ళిపోబోతున్న ఆ కుర్రాణ్ణి చూసి, కోపంగా "ఇట్రా!" అని కేకేశాడు. కుర్రాడు వినయంగా వచ్చి నిలబడ్డాడు. "నీ జీతమెంత?" తీక్షణంగా అడిగాడు జనరల్ మేనేజర్ "వంద రూపాయలండీ" వణుకుతూ జవాబిచ్చాడు కుర్రాడు. వెంటనే జనరల్ మేనేజర్ జేబులోంచి పర్సుతీసి, వంద రూపాయిలు కుర్రాడి చేతిలో పెట్టి "ఇదిగో నీ నెలజీతం! ఇక మళ్ళీ ఈ ఆఫీసు చాయలకు రావద్దు. గెటౌట్..." ఆఫీసు దద్దరిల్లేటట్లు అరిచాడు. కుర్రాడు డబ్బు జేబులో పెట్టుకుని బయటి కెళ్ళిపోయాడు. జ. మే. ఆగ్రహంతో బ్రాంచి మేనేజర్‌వైపు తిరిగి "ఈ చచ్చు చేతల వాణ్ణి ఎవడయ్యా పనిలో పెట్టుకుందీ? కొంచెంలో సామానంతా పగలగొట్టే వాడేగదా! అలాంటి పనికిమాలిన సన్నాసికి ఎందుకిచ్చావు ఉద్యోగం ఇక్కడ?" హూంకరించాడు.

"క్షమించాలి సార్! ఆ కుర్రాడు మన ఆఫీసులో ఉద్యోగి కాదు. వేరే కంపెనీ



నుంచీ ప్యాకేజీలు తెచ్చి లోపల పెట్టాడు. అంతే..." వినయంగా సమాధానమిచ్చాడు బ్రాంచి మేనేజర్.

—మహేంద్రనాథ్

# రచయితలకు ఆహ్వానం

జాతి జీవిత సమగ్ర చిత్రాన్ని విభిన్న కోణాల నుండి దర్శించి, పాఠకులకు దర్శనీయం చేయగల ఉత్తమ నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది.

* నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలుండాలి. అచ్చులో 'చతుర'లో ఒక పేజీకి సుమారుగా 240 పదాలు వస్తాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత వరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* నవలలు తెలుగుదేశపు వాతావరణంతో, తెలుగువారి సమకాలీన జీవిత చిత్రణగా ఉండటం అవసరం.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయితనుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నికకాని నవలలను త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే ప్రతి నవలకూ పారితోషికం రచననుబట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుదినిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్ సోమాజిగూడ హైదరాబాద్-500004

Edited, Printed and Published by Ramoji Rao Ch for Vasundhara Publications. Printed at Colorama Offset Printers, Hyderabad. Office Address : CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004

